సారస్వత జ్యోతికి 53వ పూజా పుష్పం

# అంతర్మథనము

## [ఆత్మ చింతన]

(లలిత గీతాలు)






దుర్గాప్రసాద్

వృషనామ సంవత్సరము
వర్షఋతువు - శ్రావణ పూర్ణిమ
ఆగస్టు మాసము–2001

ప్రథమ ముద్రణము-400 ప్రతులు

మూల్యము: రు. **80-00** లు

ముద్రణము :
డి. బి. ప్రింటర్స్
విజయవాడ-520 002



---

ప్రతులకు :

1. పి. దుర్గారావు, యం.ఓ.యల్.,
రిటైర్డు తెలుగు పండిట్,
(పౌనుగోతు తండా) గ్రామము
రాగడప (పోస్టు)
(వయా) మిర్యాలగూడ-508 207.
నల్లగొండ జిల్లా

2. విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్
విజ్ఞాన భవన్, బ్యాంకు స్ట్రీట్,
హైదరాబాదు-500 001.






# స మ ర్ప ణ !

సర్వ జీవకోటియందునూ

అంతర్నిగూఢముగా ప్రకాశించుచున్న

భాస్వదంతర్జ్యోతికి —

పుష్పాంజలులతో

# దేవతా వందనము!

వాణీ! వీణాపాణీ! వందిత జన సకలలోక!
కామిత విద్యాప్రసన్న! కల్యాణీ! శుభదాయిని!
వాణీ! వీణాపాణీ! వందిత జన సకలలోక!

యోగివంద్య జ్ఞానజ్యోతి! సారస్వత స్వాదురూప!
మృదుపద సుందరభావన! కవికులజన వరదాయిని!
విశ్వరూప విమలచరిత! అక్షరరూపిణి భారతి!
లలిత లలిత పదశోభిని! లాలిత సుందర భాషిణి!

వాణీ! వీణాపాణీ! వందిత జన సకలలోక!
కామిత విద్యాప్రసన్న! కల్యాణీ! శుభదాయిని!

ఉదయసంధ్య అరుణారుణ రేఖాంకిత సదయనేత్రి
కరుణామయి! కావ్యగేయ గాన కళా సుప్రసన్న!
అజరుద్రాచ్యుత పూజిత! ఆదిరూప! సుఖదాయిని!
బుధ సేవిత! ధవళవర్ణ! భూరికృపానంద లహరి!

వాణీ! వీణాపాణీ! వందిత జన సకలలోక!
కామిత విద్యాప్రసన్న! కల్యాణీ! శుభదాయిని!

లలితకళానందమూర్తి విలసిత చైతన్యమూర్తి!
మానవ విజ్ఞాన భాండ మధుర సుధా కలశహస్త!
శివరూపిణి! ప్రణవనాద! తేజోమయి! దీపరేఖ!
అఖిల జీవకోటి హృదయ! ఆనందిని! శ్రీదుర్గా!

వాణీ! వీణాపాణీ! వందిత జన సకలలోక!
కామిత విద్యాప్రసన్న! కాలాణీ! శుభదాయిని!
వాణీ! వీణాపాణీ! నందిత జన సకలలోక!

# వి న య వా క్య ము

అంతర్మథనము - ఆత్మచింతన అను ఈ గ్రంథమును 53వపూజా పుష్పముగా శ్రీ వాగ్దేవికి సమర్పించుకొనుచున్నాను. ఉపాధ్యాయ వృత్తి నుండి విరమణ జేసిన తరువాత లలిత గీతాలుగా వ్రాసికొనిన వేదాంత గీతికలు. మహాభక్తురాలు మీరాబాయి, గోదాదేవి, త్యాగరాజు, అరుణాచల శ్రీ రమణ మహర్షి,విశ్వకవి రవీంద్రనాథ టాగోరు మున్నగు మహనీయుల భక్తి గీతాలను పారాయణం చేస్తూ వుంటాను. ఆ మధురోదాత్త గీతాల ప్రభావం- నా గీతాలలో ఇంచుకంత పరిశీలిస్తే కనిపిస్తూ వుంటుంది. స్వయం ప్రకాశులైన యా మహా మహులకు భక్తిపూర్వక నమోవాకములు.

ఇంతవఱకు దాదాపు రెండు వేల లలిత గీతాలు 20 సంపుటాలుగా వ్రాసి యుండవచ్చును. వానిలో చాలవఱకు శ్రీరామ కృష్ణుల భక్తిగీతాలు, కొన్ని ప్రకృతి సౌందర్యమునకు సంబంధించినవి. బాల సాహిత్యమునకు చెందినవి కొన్ని. మఱికొన్ని ప్రబోధ గీతాలు.

## ప్రస్తుత గ్రంథమును గుఱించి

ఇది నా అంతిమ గ్రంథముగా భావిస్తూ వున్నాను. ఇందు నా శైలిలో 120 గీతాలను వ్రాసిన తరువాత, మహాకవి భవభూతి రచించిన ఉత్తర రామ చరిత్రను పఠించడం జరిగింది. ఆ గ్రంథములో రచయిత,

ఒకచోట అరుంధతీ వశిష్ఠులను గురించి ప్రస్తావిస్తూ భాస్వదంతర్జ్యోతిని దర్శించిన మహానుభావులని కీర్తించడం జరిగింది.

ఈ భాస్వదంతర్జ్యోతి పదమును గురించి నా మనస్సు ఎంతో మథనపడింది. దానిని గురించి పూర్తిగా తెలిసికోవాలని ఆశించాను.

ఇంతలో శ్రీ రామభక్తులు, శ్రీ రమణ మహర్షి శిష్యులునైన శ్రీ మద్దాళి సుబ్బారావుగారు 'శ్రీ రమణ సూక్తులు' అను పేరుతో తాము ప్రచురించిన చిన్న పుస్తకమును, శ్రీ రమణ మహర్షి సూక్తులతో కూడి నది, వారింటికి వెళ్ళినపుడు నాకు బహూకరించిరి.

ఆ సూక్తి ముక్తావళిని పఠించిన తరువాత ఆత్మనుగురించి ఏమీ తెలియని నాకు ఒక నిశ్చితాభిప్రాయం గలిగింది.

ఆత్మ అనునది విశ్వవ్యాప్తమైన దనియు సర్వ జీవులయందు నిగూఢముగా అంతర్లీనమై యున్నదనియు, దీక్షతో, భక్తితో యత్నిస్తే సాక్షాత్కరించుకొనగలరనియు తెలిసికొనగలిగితిని, అట్టి ఆత్మయే పర మాత్మ యనియు, గ్రహింపగలిగితిని. అట్టి సూక్తులను ఖండగతిలో గీతికా రూపమున నుల్లేఖింప గలిగితిని. ఆ గీతములే యీ గ్రంథమున ప్రచురింప గలిగితిని. ఈ విషయమున నే నెంతవఱకు కృతార్థుడ నైతినో తెలియదు, విజ్ఞులు తెలియబఱచిన తెలిసికొందును.

ఇదేవిధముగా 2400 పేజీలలో ఎనిమిది సంపుటాలుగా మహర్షి వాల్మీకులవారు రచించిన శ్రీ మద్రామాయణ గ్రంథమును శ్రీ రామ కథా సుధాలహరి అను పేరుతో చతురస్ర గీతికలలో(పాటగా)రచించి ప్రచురించడం జరిగింది.

ఇది నా ప్రజ్ఞ అని భావింపకుండా సర్వేశ్వరుడు నా కిచ్చిన దానిని పూర్తిచేశానని భావించుకొనుచున్నాను.

ఆ పరమేశ్వరుని కృపాకటాక్షముల వలననే నేనీ పనిని సాధించితి నని భావించుకొనుచున్నాను. ఈ విధముగా వ్రాసినందులకు పెద్దలు క్షమింపగలరని వినయపూర్వకముగా ప్రార్థించుకొనుచున్నాను.

ఈ గ్రంథమునుగూడ అట్లే భావింపగలరు. వేదాంతమనగా యేమియో తెలియని నా వంటి వ్యక్తి ఆత్మను గురించి వ్రాసి పుస్తకమును ప్రచురించుట విచిత్రమే!

ఇదంతయు పెద్దల సేవా ఫలమని భావించుకొనుచున్నాను- ఇందలి తప్పొప్పులను తెలియబఱచిన సంతోషింతును.

—రచయిత



# మాతృవందనము

ఓహో! నా జన్మభూమి! ఓహో! నా మాతృభూమి!
ఓహో! నా కన్నతల్లి! వందన మిదె ప్రియభారతి!
ఓహో! నా జన్మభూమి! ఓహో! నా మాతృభూమి!

సకలసస్య శ్రీ నిలయిని! సాధుమార్గ శుభదాయిని!
సర్వలోక జనపూజిత సామగాన సురభాషిణి!
సకలధర్మ సహజీవన సంస్కృతి విలసిత శోభిని!
పుణ్యకర్మ సువిరాజిత పూర్ణకలా తేజోమయి!

ఓహో! నా జన్మభూమి! ఓహో! నా మాతృభూమి!
ఓహో! నా కన్నతల్లి! వందనమిదె! ప్రియభారతి!

గంగ యమున కృష్ణవేణి - కావేరీ తుంగభద్ర!
ఉన్నత హిమగిరి శిఖరము - లొప్పిన శుభ కల్యాణీ!
అడుగడుగున పుణ్యభూము లమరు విమల సౌమ్యమూర్తి!
మధుర కావ్య గేయశిల్ప - మంజులతర శివగాయిని!

ఓహో! నా జన్మభూమి! ఓహో! నా మాతృభూమి!
ఓహో! నా కన్నతల్లి! వందన మిదె! ప్రియభారతి!

సత్యము శివ సుందరములు సర్వ దిశలు విలసిల్లిన
ఈ సుందర కర్మభూమి! ఈ పవిత్ర పుణ్యధాత్రి!
నీ స్వరూప విలసనమే! నీ యనంత దర్శనమే!
అమ్మా! నీ యాశీస్సుల నలరి వేడుచుంటి నమ్మ!

ఓహో! నా జన్మభూమి! ఓహో! నా మాతృభూమి!
ఓహో! నా కన్నతల్లి! వందన మిదె ప్రియభారతి!
ఓహో! నా జన్మభూమి! ఓహో! నా మాతృభూమి!

# అంతర్మథనం - ఆత్మ చింతన
## (లలిత గీతాలు)

### ప్రకృతి యందాలతో

ప్రకృతి యందాలతో పరవశముతో గూడి
కమనీయ దృశ్యాలు కనిపించుచున్నవీ!

ఆకాశ మార్గాన అందాల హంసలా
కమ్మనీ సొగసులూ కనులలో దూగాడె!

ప్రకృతి యందాలతో పరవశముతో గూడి
కమనీయ దృశ్యాలు కనిపించుచున్నవీ!

పండు వెన్నెలలతో నిండినా తోటంత
వెండి మతాబులను వెలయించినటు లుండె!
కన్నె గులాబీలు కల కలా నవ్వుతూ
వన్నెలా వలపులను వయ్యార మొలికించె! ॥ప్రకృతి॥

పండినా వరిచేలు పరవశముతో దూగి
కన్నె వలపులనన్ని కథలుగా చెబుతోంది!
సంగీత ధ్వనులతో సరసాల పాటలను
నవ్వులొలికించుతూ నాట్యాలలో మునిగె! ॥ప్రకృతి॥

కృష్ణ విరహముతోని కుమిలేటి నా మదికి
సిరులు సింగారములు చిత్రముగ నగుపించె!
అందాల సొగసులూ యగ్గిమంటకు వోలె
కనిపించుచుండె నా కన్నులకు నిప్పులై!

ప్రకృతి యందాలతో పరవశముతో గూడి
కమనీయ దృశ్యాలు కనుపించుచున్నవీ!

## అపురూపమైన

అపురూపమైన నీ యందాల మురళినీ
వినిపింతువేగాని వేడుకలు జిందగా!

కంటి కగుపింపవూ కనులపండువు గాగ
చంటిపాపకు వోలె వెంట నుందువుగాని!

అపురూపమైన నీ యందాల మురళినీ
వినిపింతువేగాని వేడుకలు జిందగా!

కొండలను కోనలను కూర్మి సెలయేఱులను
కలువ పద్మాలతో కమనీయ గీతాలు!
పాడుకొను తుమ్మెదల పరవశము జెందుతూ
నీజాడ లడిగితిని నిఖిలేశ దెచ్చటని? ॥అపు॥

కొమ్మపై పాడేటి కోకిలను అడిగితిని
ఆడుకొను నెమిలినీ యల పాలపిట్టలను!
గొంతుకలిపి మధుర గోపికను నేననీ
గోపాలు డెచ్చటని గొంతెత్తి యడిగితిని! ॥అపు॥

మాటలో పాటలో ఆటలో నుంటావు
మనసులో నుంటావు మధుర యూహలయందు
కంటి కగుపింపవూ! యొంటిగా నను జేసి
చంటిపాపకు వోలె సరస మాడెద వేమి?

అపురూపమైన నీ యందాల మురళినీ
వినిపింతువేగాని వేడుకలు జిందగా!

## కనుచూపు మేరలో

కనుచూపు మేరలో కనిపింతువే గాని
దాపుకొచ్చి నన్ను దయ దలపవెందుకో?
తలపులో మనసులో దగ యుందువేగాని
తీయనీ పలుకుతో దీర్పవెందుకు కాంక్ష!

కనుచూపు మేరలో కనిపింతువే గాని
దాపుకొచ్చి నన్ను దయ దలపవెందుకో!

సెలయేటి జాలులా జలజలా ప్రవహించి
మర్మర ధ్వనులతో మది కలత జిందేవు!
నిండు కొలనుకువోలె దండిగా నామదికి
కలువ పద్మములతో కనిపింప వెందుకని?

అందాల్ల రాయంచ ఆకాశ మార్గాన
పయనించు చందాన పరుగులెత్తెద వేమి?
కనులముందర నిలిచి కమనీయ నాట్యాల
నెమ్మివలె నిలిచి మది తమ్మిగా జేయవూ?

ఇంద్ర ధనుసుకువోలె సాంద్రకాంతులు జింది
యేడు రంగులయందు నింపుగా కనిపించి!
మాయమై పోవుదువు మధురిమలు జూపించి
అందాల గోపాల! ఆటలా యిది నీకు?

కనుచూపు మేరలో కనిపింతువేగాని
దాపుకొచ్చి నన్ను దయదలప వెందుకో?

ఆత్మ చింతన

# వెన్నెలా పువ్వులను

వెన్నెలా పువ్వులను వేడుకను గొనితెచ్చి
రాగాల దారాన రమ్యముగ గ్రుచ్చితిని!

వలపంత చిలికించి వయ్యార మొలికించి
నీదారి గాచితిని! నిర్మలముగా కృష్ణ!

వెన్నెలా పువ్వులను వేడుకను గొనితెచ్చి
రాగాల దారాన రమ్యముగ గ్రుచ్చితిని!

ఎన్నాళ్ళ దీ ప్రేమ? యెన్నాళ్ళ దీ వలపు?
చిన్నికృష్ణా! నీకు తెలియదా నా మనసు?
అన్ని వదిలీ నిన్ను అరవిందనేత్ర విను!
చిన్ని నా హృదయమును జేర్చితిని యెన్నడో! ॥వెన్నెలా॥

కొండలను కోనలను బండలను శిలలలో
నిండు సెలయేఋలా పండినా భక్తితో!
నిను బాడుచుంటినీ! నిఖిలేశ! తీయగా
కదుపవేమీ మురళి? గానకళ వికసింప! ॥వెన్నెలా॥

అలలలో తెరలలో అందాల రవళిలో
జలజలా ధ్వనులతో జారు ముత్యాలతో!
ఒకసారి కనిపింపు వయ్యార మొలికింపు!
బాటసారిని నేను బవళింతు నీగుడిని!

వెన్నెలా పువ్వులను వేడుకను గొనితెచ్చి
రాగాల దారాన రమ్యముగ గ్రుచ్చితిని!

## శారదా రాత్రులవె

శారదా రాత్రు లవె! చనుదెంచె ప్రకృతిని!
మనసు ఊయలలూగె! మాధవా! నీకొఱకు!

తెల్లనీ మబ్బులను దీరుగా గగనాన
పూలపందిరి వేసె పొలుపులను జిందగా!

శారదా రాత్రులవె! చనుదెంచె ప్రకృతిని!
మనసు ఊయలలూగె మాధవా! నీ కొఱకు!

వెన్నెలలు మల్లెలుగ విరబూసె జగమంత
పూలవాసనలతో పులకించె కొలకులూ!
నీటి పక్షులతోని నిండినవి సరసులూ!
కొండశిఖరములన్ని కూడినవి మంచుతో! ॥శారదా॥

సన్ననీ జాలులను చిన్ని సెలయేఱులూ
కమ్మనీ గీతికల నిమ్ముగా బాడుచును!
చిన్ని బేడిసలతో చిన్నారి శిలలతో
ఆటలాడుచు నుండె యందాలు జిందగా! ॥శారదా॥

పల్లవిని బాడుచును బరుగులెత్తుచు నుండె
చిన్ని నా మనసులో చిగురించె నీ వలపు!
సాహిత్య గీతికయు జాలువారుచు నుండె!
నిను పాట బాడగా నిండు మనసూ తోణికి!

శారదా రాత్రులవె! చనుదెంచె ప్రకృతిని
మనసు ఊయల లూగె! మాధవా! నీ కొఱకు!

## ఆడబోకుము కృష్ణ!

ఆడబోకుము కృష్ణ!అందాలు జిందుతూ
పాడబోకుము నేను పరవశము జెందా!

అరవిందమును బోలు అందాల మోముతో
కనిపింప బోకుమా! కనుల పండువుగాగ!

ఆడబోకుము కృష్ణ! అందాల మోముతో
పాడబోకుము నేను పరవశము జెందా!

కోర్కె లేమని నన్ను కూర్మితో బలికేవు
కోరికల నడిగెనా కోరి మనసెపుడయిన?
నిను జేరుటకు గాద! నిండు నా మది కోర్కె!
నా తపము నా జపము నవ్య గీతికలన్ని! ॥ఆడబోకుము॥

జప తపము లన్నిటిని చాలించితిని కృష్ణ!
ఉపవాస వ్రతములను నొదిలితిని యెన్నడో!
తీయనీ గీతమును దీరుగా బాడుచూ
మురళిలోలా! నిన్ను మోహించు చుంటినీ! ॥ఆడబోకుము॥

నను జేర్చుకో కృష్ణ! నాట్యాల గజ్జియల
పిల్లనా గ్రోవిలో ప్రీతితో జేర్చుకొను!
శాశ్వతానందాల సరితలో కెరటముగ
తీరమును జేరగా శ్రీరమణ ననుజేయి!

ఆడబోకుము కృష్ణ! అందాలు జిందుతూ
పాడబోకుము నన్ను పరవశము జెందా!

## అంగుళీయం బిదిగో!

అంగుళీయం బిదిగో! అందుకో శ్రీకృష్ణ!
నీ విచ్చినది సుమా! నిండు మనసుననూ!

నిను విడువబోననుచు నీతోని యుందునని
బాస జేసితినికద! పరమాత్మ! ఒకనాడు!

అంగుళీయం బిదిగో అందుకో శ్రీకృష్ణ!
నీవిచ్చినది సుమా! నిండు మనసుననూ!

పారాణి దిద్దినా పదములను ఒకనాడు
సప్తపదులను వేసి సరస గూర్చుంటినీ!
మంగళాక్షతలతో మదిపొంగ శిరసునను
సిగ్గు తెరలను నాదు శిరము వొంచితినీ! ॥అంగు॥

అవని యంబరములును యల మింటి చుక్కలను
కనులార గాంచినవి కమ్మనీ మన కథను!
ఏల విడిచితి విచట వేడుకను వరియించి
కానలో వదలితివి కనికరము లేక యిటు! ॥అంగు॥

పదిమంది జూడగా పతితపావన నాకు
బంగారు వుంగరము బరగ వ్రేలికి దొడిగి
మోమిటుల ద్రిప్పగా మోహనా యిది తగున?
నీ యంగుళీయమును నీవె గైకొను మిడిగో!

అంగుళీయం బిదిగో! అందుకో శ్రీకృష్ణ!
నీవిచ్చినది సుమా! నిండు మనసుననూ!

# వెన్నెలా దెలుపవే!

వెన్నెలా! దెలుపవే! వేణుగోపాలునకు
మంజులంబగు నాదు మదిలోని వ్యథనూ!

తెల్లనీ కాంతులను తెలిమబ్బు తెరలతో
హంస పదధ్వనులతో నలరు మృదుగీతితో!

వెన్నెలా! దెలుపవే! వేణుగోపాలునకు
మంజులంబగు నాదు మదిలోని వ్యథనూ!

కొండకోనలయందు కూర్మి సెలయేఱులను
కలువ పద్మములుండు కమ్మనీతావులను!
వెదుకవే వెన్నెలా వేడుకను కృష్ణునీ
మనసులోనీ మాట మర్మముగ దెలుపవే! ॥వెన్నెలా॥

అలమందల యందు అందాల మల్లియల
పూతోటలందు మఱి పొంకముగ కానలను!
అరుణారుణ ప్రభల అందాల సంధ్యలను
వెదుకవే వెన్నెలా! వేడుకను గోపాలు! ॥వెన్నెలా॥

తాళలేనమ్మ నే సఖియ విరహమునందు
కృష్ణ విరహముతోని గష్టపడుచుంటినీ!
పిల్లనాగ్రోవితో ప్రీతిగీతము బాడు
అల యశోదకు ముద్దు అందాల బాలునీ!

వెన్నెలా దెలుపవే! వేణుగోపాలునీ!
మంజులంబగు నాదు మదిలోని వ్యథనూ!

## కొండలను కోనలను

కొండలను కోనలను కూర్మి సెలయేఱులను
నీ రాకకై ప్రభూ! నిలిచితిని భక్తి!

లలిత గీతముతోని లాలిత్య మొలుకగా
పిలుచుచుంటిని కృష్ణ! ప్రీతి బొంగారగను!

కొండలను కోనలను కూర్మి సెలయేఱులను
నీ రాకకై ప్రభూ! నిలిచితిని భక్తి!

ఆకాశ మార్గాన నటుబోవు హంసలను
చిలుక గోరింకలను శీర్షమును బైకెత్తి!
నీ వార్త లడిగితిని నిఖిలేశ దేడనుచు
పారవశ్యముతోని పరమేశు డెట యనుచు! ॥కొండలను॥

కొండ చరియలనుండి కూర్మి జలజల పాఱు
సెలయేటి జాలులను చిని చిన్ని దరగలను!
వచ్చుచున్నాడ యని మచ్చికను ప్రశ్నించి
మనసు వేదనంత మర్మముగ దెలిపితిని! ॥కొండలను॥

వేదనాశ్రువులతో విలపించుచుంటినీ!
విరహగీతము దిశల వినిపించుచుంటినీ!
అంటకను ముట్టకను నటు దూరముండుటయు
నీకు దగునో స్వామి!నీలమేఘ శ్యామ! ॥కొండలను॥

కనికరము జూపించి కరుణరస మొలికించి
ఆదరముతో నన్ను అలరించుమో స్వామి!
నీ హృదయ కమలమున నీ వేణు నాదమున
నను జేర్చుకో స్వామి నవ పుష్పమాలగా! ॥కొండలను॥

## వినిపించుచుండు నీ

వినిపించుచుండు నీ వేణునాదము జెవుల
కనుల కనిపింతువూ! కమలాక్ష!యెప్పుడూ!

మౌనమూనినగాని మనసు మాటాడునూ
మధురమౌ గీతమున మాధవా! యెపుడూ!

వినిపించుచుండు నీ వేణునాదము జెవుల
కనుల కనిపింతువూ! కమలాక్ష! యెపుడూ!

మనుషులే లేనట్టి మరుప్రదేశము అందు
పశులే లేనట్టి పలు ప్రాంతములనూ!
పరుగులెత్తిన గాని పన్నుగా నీ మురళి
మధుర సుస్వనములే మారుమ్రోగుచు నుండు! ॥విని॥

కిన్నెరను మ్రోగించి కీర్తనల బాడకను
రాగ తాళములందు రక్తి నే నొదిలితిని!
మనసునందున జేరి మాటాడుచుందువూ!
తేనె లొలికించేటి తీపి మాటలతోని! ॥విని॥

నీకు నా కేముందొ నిర్మలంబగు రక్తి
విడివడని బంధ మిది విశ్వేశ్వరా జూడ!
నీవు నేనో యేమొ! నేను నీవో యేమొ!
గారడీవాని వలె కథసడుపు చుంటివీ!

వినిపించుచుండు నీ వేణు నాదము చెవుల
కనుల కనిపింతువూ కమలాక్ష! యెపుడూ!

## నను జూడ వత్తువని

నను జూడ వత్తువని! నను హత్తుకొందువని
దూరాన సంద్రాన దూగుచూ అలలా!

అరుణారుణ ప్రభల యలరుచును నొక పడవ
నను జేర వచ్చునని నాథ! దలచితినీ!

నను జూడ వత్తువని నను హత్తుకొందువని
దూరాన సంద్రాన దూగుచును అలలా;

సంధ్యకాంతులు జారె చక్కనీ చుక్కలును
కనిపించు చుండెనూ గగనాన నల్దిశల!
చీకటీ తెరలతో చిమ్మజీకటి గ్రమ్మె
చంద్రకాంతులు విరిసె చారు వెన్నెల వాన! ॥నను॥

పథికు లెవ్వరు లేరు పయనించు పడవలో
మురళినీ బాడేటి మోహనా! నువు దప్ప!
నెమిలి పింఛముతోని నిండారు మోముతో!
పాడుచుంటిని కృష్ణ! పారవశ్యము తోని! ॥నను॥

ఇన్నినాళ్ళకు నాదు విన్నపము నాలించి
చిన్నిపూపడవపై చేరవచ్చితి విపుడు!
ఆశలన్నియు దీర అందాల గోష్ఠాల!
నీ మురళి స్వనములను నిండార గలుపుకొను!

నను జూడ వత్తువని! నను హత్తుకొందువని!
దూరాన సంద్రాన దూగుచూ అలలా!

## నా పాటలో కృష్ణ!

నాపాటలో కృష్ణ! నయముగా యిమిడిపో!
నీరూప మధురిమను నిండుగా నింపు!

ఏ రూప నామముల నింపుగా బిలుతునో
ఆ రూప నామముల నలరుమా! దివ్యముగ!

నా పాటలో కృష్ణ! నయముగా యిమిడిపో!
నీ రూప మధురిమను నిండుగా నింపు!

శిలలలో నీరూపు దీరుగా దీర్చినా
మట్టి బొమ్మలయందు మాధుర్య మొలికినా!
నీ రూప భంగిమల నిలిచిపో శ్రీకృష్ణ!
శిల్పి దీర్చిన యటుల శ్రీల విలసిల్లుమా! ॥నా పాటలో॥

చిత్రకారుని కుంచె సిరుల రంగుల నొదిగి
అపురూప కళలతో నలరారుమో స్వామి!
పిలిచినా పిలుపులకు ప్రేమతో బలుకుచును
రమణీయ మురళితో నాట్యాలు సలుపుమా! ॥నా పాటలో॥

ఊహ లెన్నింటినో యూహించి పలువిధము
ఆటలాడితి నేను ఆడించితిని నిన్ను!
నా యూహ లన్నిటిని నాథ! నిజముగ జేసి
ఆ రూప నామముల అలరారు శ్రీకృష్ణ!

నా మాటలో కృష్ణ! నయముగా యిమిడిపో!
నీరూప నామముల నిండుగా నింపు!

## అడవి పూవును నేను!

అడవి పూవును నేను అందాల గోపాల!
అంటబోకుము నన్ను కంటి నలుసును నే!

వాసనలు లేనట్టి వన్నెలును లేనట్టి
రూపు లేఖలు లేని గోపికను శ్రీకృష్ణ!

అడవి పూవును నేను అందాల గోపాల!
అంటబోకుము నన్ను కంటినలుసును నే!

బంగారు వీణియను రంగారు గీతికను
పాడజాలగ లేను భ్రమర గీతికలా!
కాలి గజ్జియలతో కమనీయ భంగిమల
ఆటలాడగ లేను అతి వైభవము తోని! ॥అడవి॥

సింగారములు లేవు చిలికింప నీ మనసు
రామచిలుకను గాను రమణీయముగ బలుక!
నెమ్మి సింగారములు నిమ్మగా లేవు గద!
నీ మనసు నే నెటుల నిండు జాబిలి జేతు? ॥అడవి॥

ఉర్వి శాపము వలన ఊకబంతిని నైతి!
సర్వశూన్యం బయ్యె సర్వేశ్వరా బ్రతుకు!
నిను దలచు చుంటినీ నిర్జనంబగు చోట
కనులతో గనుమయ్య! కనిపింప రావయ్య!

అడవిపూవును నేను! అందాల గోపాల!
అంటబోకుము నన్ను కంటి నలుసును నే!

## నీ దర్శనము గోరి

నీ దర్శనము గోరి నిఖిల మంతయు దిరిగి
వెదుకుచుంటిని స్వామి! విమలమగు భక్తి!

కనిపింప రావుగా కనులపండువు గాగ
వినిపింపరావుగా వేణువును నూదీ!

నీ దర్శనము గోరి నిఖిలమంతయు దిరిగి
వెదుకుచుంటిని స్వామి! విమలమగు భక్తి!

ఉదయకాంతులయందు నూహింతు నిను గాంచ
అరుణారుణ ప్రభల నలరారు చుందువని!
చంద్రకాంతులయ్యందు సరసమగు నీ రూపు
చూడగోరుదు మదిని చోద్యముగ రాత్రులను! ॥నీ॥

నక్షత్ర కాంతులను రమ్యమౌ మెఱుపులను
నీవుందువనుచు నే నిరతమును కాంక్షింతు!
దిగ్దిగంతములందు దివ్య సుందరములను!
వనరేఖలను గాంతు వన్నెలను దిలకింతు! ॥నీ॥

అటు చూచి యిటుజూచి అలపింపక వేగ
మదియందు గనుము! నీ మాధవుని ప్రభలతో!
ఆత్మయందున వెలుగు నలరు జ్యోతిని గనుము
అదియె పరంజ్యోతి! అదె ఆత్మ భాస్వరము!
అనుచు బలికెను ప్రకృతి యాత్మీయతను జూపి!

నీ దర్శనము గోరి నిఖిలమంతయు దిరిగి
వెదుకుచుంటిని స్వామి! విమలమగు భక్తి!

## పాడలేను గదయ్యా

పాడలేను గదయ్యా! పరమాత్మ నీ పాట
రాగతాళంబులను రమ్యముగ జతజేసి!

తెగిన ముత్తెపుదండ తీరుగా ముత్యాలు
రాలినటు కంఠమున రమణీయతలు బోయె!

పాడలేను గదయ్యా! పరమాత్మ నీ పాట
రాగతాళములతో రమ్యముగ జతజేసి!

కంఠమందున యేదొ కఠిన శిల చేరినది!
రాగమందున యేదొ రాతిబండయు నిలిచె!
మధురాతి మధురమౌ మాధుర్యమును బోయె!
ఎటుల నిను మెప్పింతు? కఠినమగు రాగమున? ॥పాడ॥

సన్ననీ సెలయేటి పాటవలె నా గొంతు!
మన్ననలను బొందెడిది మాధవా! నా గీతి!
ఎత్తు పల్లాలతో నెటులెటుల బారుచును
సుడులు దిరుగుచు నుండె ముడులు విప్పగలేక! ॥పాడ॥

హంసవలె నా పాట ఆకాశ వీధిలో
మణికాంతి పుంజమున మాధవా! బోయెడిది!
శిధిలమగు రెక్కలను జేర గమ్యములేక!
మైదానముల యందు మాటుమణుగుచు నుండె!

పాట బాడితిగదా! పరమహంసకు వోలె!
రాగ మాలాపించి రమ్యతను వెలసితిని
అడ్డుగోడల గూల్చు అలసతను మాన్పుమా!
నీ దివ్యధామమును నే జేరుకొను నటుల!

## కొండ కోనల నుండి

కొండ కోనలనుండి కూర్మి జలజల జారు
సెలయేటి రాగాలు జిందేటి కూడలివి!

నీ రాకకై నేను నిలిచియుంటిని స్వామి!
అలరేటి భక్తితో నాత్మ నర్పింపగా!

కొండ కోనలనుండి కూర్మి జలజల జారు
సెలయేటి రాగాలు జిందేటి కూడలిని!

మధురమౌ నా విరహ మధుర గీతముతోని
పాడుచున్నది కోకి పంచమ స్వరముతో!
ఆడుచున్నది నెమిలి ఆడాలు జిందుచును
పలుకుచున్నది రామ చిలుక అందము లొలుక! ॥కొండ॥

ఘూత్కారముల మాని గుడ్లగూబలుగూడ
పొదలనే గూటిలో పొంకముగ గూర్చుండి!
నా గీతికను వినుచు నయముగా మౌనమున!
మధుర గీతమునందు మనసు నిలిపినవీ! ॥కొండ॥

అఖిల జీవులయందు అలరెదవు శ్రీకృష్ణ!
అంతరంగిక జ్యోతి వానంద రూపివై!
నీ రూపమునుజూపి నీ మురళిని బాడుచును
నను జేర వే రమ్ము నాథ! దర్శించెదను!

కొండ కోనలనుండి కూర్మి జలజల జారు
సెలయేటి రాగాలు జిందేటి కూడలిని!

# నీ వెనుక ధీరతను

నీ వెనుక ధీరతను నే నడతు పయనమై
ఎంత దూరంబైన నుంత భయమును లేక !

కాఱడవులను దాటి గండ శిలలను దాటి
నదీనదాలనూ నాథ! గమియింతునూ!

నీ వెనుక ధీరతను నే నడతు పయనమై
ఎంత దూరంబైన నుంత భయమును లేక!

కన్నీరు దొలుకుచును కలగుండు బొందేటి
మౌన ప్రార్థలచే మది కలత నొందేటి!
దీనులను గాపాడ దిశల జను చుందువూ!
ననుగూడ గొని పొమ్ము నాథ సేవకునిగాఁ ॥నీ వెనుక॥

పాదముల నొత్తుదును బడలిగా శ్రీకృష్ణ,
వీవనలచే విసిరి వేదనను హరియింతు!
భక్తు లిడు ప్రార్థనల బరుగెత్తు నీ వెనుక
మచ్చికను నే నొత్తు మధురార్ద్రి భావమున! ॥నీ వెనుక॥

సేవ జేయించుకొను సేవకునిగా నన్ను
కమిలిపోవను స్వామి! కుమిలి విడిపోనూ!
ఎన్నాళ్ళు ఇటుల నను యిలపైని నిలుపుదువొ
అన్ని నాళ్ళను నీకు అలరిసేయుదు సేవ!

నీ వెనుక ధీరతను నే నడతు పయనమై
ఎంత దూరంబైన నుంత భయమును లేక!

## నీ విరహ వేదనను

నీ విరహ వేదనను నిండినా కన్నులను
జారినా యశ్రువులు దగ మారె కొలనుగా !

కలువ తామర లవిగో! దగ విరిసె యందముగ
నిను బిలుచుచున్నవి! నీరజాక్షా! వినుము!

నీ విరహ వేదనను నిండినా కన్నులను
జారినా యశ్రువులు దగ మారె కొలనుగా

తుమ్మెదల బారులా తూలుతూ నాట్యాల
కొలను కలువలపైని కూర్మి వ్రాలుచు రక్తి;
నేర్చుకొనుచున్నవి నీ మధుర గీతాలు
పాడుకొనుచున్నవి పరవశంబున భక్తి! ॥నీ విరహ॥

దరులపై నిలిచినా దగ కడిమి తరువులును
ఒక్కొక్క పూవునూ యొనర కొలనున రాల్చి!
నీటి సుడులను భక్తి నీ రూపమును గాంచి
తమ నీడలను గాంచి తన్మయము నగుచుండె! ॥నీ విరహ॥

నీటి పక్షులు గూడ నీ నామమును దలచి
నీరమున నీదుచును నిండుమునుకలు మునిగి
దరుల జేరుచు నుండె దగ నీకు నాపైని
దయలేదుగద స్వామి! దరిజేర రావుగద!

నీ విరహ వేదనను నిండినా కన్నులను
జారినా యశ్రువులు దగ మారె కొలనుగా?

## ఎచ్చటిది యీ మురళి ?

ఎచ్చటిది యీ మురళి? యెచ్చటిది యీ పాట?
వినిపించుచున్నదీ వీనులకు విందుగా!

కంటి కగుపింపకను కనుమఱుగు తా నుండి
పాట బాడుచునుండె బన్నుగా కృష్ణుడే;

ఎచ్చటిది యీ మురళి? యెచ్చటిది యీ పాట?
వినిపించుచున్నదీ వీనులకు విందుగా!

నిండు చందురునందు నీడగా తానుండి
పాడుచున్నాడేమొ ప్రభువు నా కృష్ణుడూ!
యీ మధుర వాదాలు యెందుకో యెవరికో!
నా కోసమే యేమొ? నను బిలుచుటే యేమొ? ॥ఎచ్చటిది॥

మంచు ప్రొగలో నుండి మాధవుడు గనబడక
హంసవలె ధ్వనిజేసి యలరి వేణువు నూది;
నా కిన్నెరకు జతగ నళినాయతాక్షుడూ
పాడుచున్నాడేమొ పన్నీటి జల్లుగా! ॥ఎచ్చటిది॥

అడ్డుగోడ లవేల? అందాల గోపాల!
కంటి కగుబడరాద; కనికరింపగరాద!
వేదనలు యెన్నాళ్ళు? వెతలెన్ని నాళ్ళు యిటు?
నీ మురళి సంధాన నిలుపుకో! అలరితి!

ఎచ్చటిది యీ మురళి? యెచ్చటిది యీ పాట?
వినిపించుచున్నదీ వీనులకు విందుగా!

## తీయని నా పాట

తీయనీ నా పాట తేనెలా ప్రవహించి
సెలయేఱుగా మారె చిన్నారి నదలా!

అడవి తుమ్మెదలన్ని యటునిటూ బోకుండ
సెలయేఱు గప్పినవి అలలు గనరాకుండ!

తీయనీ నా పాట తేనెలా ప్రవహించి
సెలయేఱుగా మారె చిన్నారి నదలా!

ఎక్కడెక్కడి పులులు యెక్కడెక్కడి లేళ్ళు
మక్కువగ వచ్చినవి మది పులకరింపగా!
కమ్మనీ తీర్థమును గడపార ద్రావుచును
తిరిగి బోవుచు నుండె తీర్థయాత్రకు బోలె! ॥తీయనీ॥

ఆకాశమున యెగురు అల మేటి హంసలును
మావి చిగురులు మేయు మధుర కోకిలలూ!
రమ్యముగ బలికేటి రామచిలుకలు గూడ
తనివార ద్రావుచును దన్మయము లగుచుండె! ॥తీయనీ॥

లలిత సుకుమారమును లాలిత్య బంధములు
ముగ్ధ మోహనమునగు మోదమగు ధ్వని గలుగు
ఒకమాటు యిటువచ్చి యొనర నీ పదములను
సెలయేట నుంచుమా! అల నొదు స్పృశియించి!

చిన్నారి నా పాట తేనెలా ప్రవహించి
సెలయేఱుగా మారె చిన్నారి నదలా!

## వేదనాశ్రువులన్ని

వేదనాశ్రువు లన్ని విమలమగు ధరణిపై
ప్రవహించి మేఘముగ బరగ నింగిని జేరె!

చిరువాన చినుకులై చిట్టడవి యంతయును
కళ్ళాపి జల్లినటు గడువేడ్క గురిసినది;

వేదనాశ్రువు లన్ని విమలమగు ధరణిపై
ప్రవహించి మేఘముగ బరగ నింగిని జేరె!

కాని కాలమునందు కమనీయ జల్లు లిటు
భూమిపై బడుటయు బుంకించి ప్రకృతియు;
పచ్చనీ మొలకలను బన్నుగా ధరియించి
నవపుష్ప ధారణల నటియించె సొగసులను! ॥వేదనా॥

పూవులలో నున్న పూర్ణ జలరాశులను
ఆకు చివరల జేరు నవరూప బిందువుల!
పాలపిట్టలు వచ్చి బన్నుగా ద్రాగినవి
పికిలి పిట్టలు గూడ బీల్చినవి ముక్కులను! ॥వేదనా॥

రాతి పగుళులయందు రాలినా బిందువుల
అడవి తొండలుగూడ అట కొచ్చి ప్రీతితో!
మొగము సూర్యునివైపు మోదమున తలయెత్తి
త్రాగుచున్నది గనుము! తాపమును జల్లార! ॥వేదనా॥

నీ మురళి పాటయే నిఖిలమని తలచెదవు!
నాపాట వినవుగా నళినాక్ష! రవ్వంత!
ఆపదల రక్షించి యరయు వాడవుగదా!
మన్నింప వెందుకో! మనవి విన వెందుకని? ॥వేదనా॥

# ఒడిని జేర్చవు నన్ను

ఒడిని జేర్చవు నన్ను ఓరజూపది యేల?
నన్ను సృజియించినా నాథుడవు జగదీశ!

పక్షపాతము తోని పదిమందిలో నన్ను
నగుబాటు జేయుటిది నాథ తగునా నీకు?

ఒడిని జేర్చవు నన్ను ఓరజూపదియేల?
నగుబాటు జేయుటిది నాథ! తగునా నీకు?

తీయనీ పలుకులను దీరనీ ప్రేమతో
పలుకు నేర్పుచునుండె బరగ తన పిల్లలకు!
ఆవు అంబా యనుచు యరసి తన లేగలకు
దుగ్ధ ధారలతోని దువ్వుచును నాలుకను! ॥ఒడిని॥

ఒడియందు జేర్చుకొని ఒయ్యారి కోకిలా
పాటనేర్పుచునుండె పన్నుగా బిడ్డలకు!
తీయని రాగాల దీరనీ మమతతో
ఆటనేర్పుచునుండె అందాల నెమిలియును! ॥ఒడి॥

చిన్నిచిన్ని మొక్కలను సింగారములు ధరణి
శిరముపై జేర్చుకొని శ్రీల జిందించుచును!
కఠినమగు బెను దరుల కమనీయ హర్షమున
లాలించు ప్రేమించు లలిత సుకుమారముగ!

ఒడిని జేర్చవు నన్ను ఓరజూపది యేల?
నన్ను సృజియించినా నాథుడవు జగదీశ!

## లయ తాళ రాగాల

లయ తాళ రాగాల లలిత గీతాలనూ
పాడుచుంటిని కృష్ణ! భక్తి విలసిలగా!

నీ మురళి నాదమే! నీవేణు స్వరములే!
ఆనంద గీతిగా అలరి విరియుచు నుండె!

లయ తాళ రాగాల లలిత గీతాలనూ
పాడుచుంటిని కృష్ణ! భక్తి విలసిలగా!

కలువ తామరలపై దగ ద్రావాలి నాట్యాల
తుమ్మెదలు సరసిలో తూలుతూ బాడేటి!
మధుర గీతములన్ని మాధవా! నానుండి
నేర్చినా పాటలే నీరజాక్షా వినుము! ॥లయ॥

మావి కొమ్మలపైని మంజులంబగు పొదల
తీయనీ రాగాలు దీరుగా బాడేటి!
పక్షులన్నియుగూడ పరమపావన! వినుము!
నా లలితగీతాలు నయముగా బాడేది! ॥లయ॥

అణువణువునున్నట్టి అందాల గోపాల!
జగమంత నిండినా శ్యామసుందరమూర్తి!
నా పాటలో నున్న నవనీత భావమును
వినిపించుకోవేమి? వేదనాంతర గీతి!

లయ తాళ రాగాల లలిత గీతాలతో
పాడుచుంటిని కృష్ణ! భక్తి విలసిలగా!

## మావి కొమ్మలపైని

మావి కొమ్మలపైని మధురముగ కోకిలలు
పాటబాడుచు నుండె పద్మనాభా! గనుము!

హంసాభినయములను నందాలు జిందగా
వనమహోత్సవముగా వాసంతి యొప్పినది!

మావికొమ్మలపైని మధురముగ కోకిలలు
పాట బాడుచునుండె పద్మనాభా! గనుము!

చినిచిన్ని చిగురులును జిన్నారి మొగ్గలును
పచ్చనీ కాంతితో పరిమళము వ్యాపించె!
లే లతల దీవెలను లేలేత గ్రీష్మమును
ఆడుకొనుచున్నవీ యందాల ప్రకృతిని! ॥మావి॥

మబ్బులన్నీ చెదిరి మాయమై పోయినవి
క్రౌంచపక్షుల బారు దగ నింగి పయనించె!
చిఱుగాలి సవ్వడులు జిత్రమై దోపగా
మధుర సంధ్యలు విరిసె మహనీయ కాంతులను! ॥మావి॥

మధుర వాసంతమును మాధవా వొచ్చినది
పులకరింపులతోని భువియంత నిండినది!
ఏటి యొడ్డున నిలిచి వేడ్క నిను గనుచుంటి
పడవపై రావయ్య! బరగ నను నొడిజేర్పు!

మావి కొమ్మలపైని మధురముగా కోకిలలు
పాటబాడుచునుండె పద్మనాభా! గనుము!

## ఏటిఒడ్డున నిలిచి

ఏటిఒడ్డున నిలిచి మాటిమాటికి విరహ
వేదనను కన్నీరు విరులుగా వర్షింప!

పయనించు పడవలకు బరగయడ్డుగ నిలిచె
తెరచాపలందుకొనె దీరుగా అశ్రువులు!

ఏటి ఒడ్డున నిలిచి మాటిమాటికి విరహ
వేదనను కన్నీరు విరులుగా వర్షింప!

అలలన్ని పూలుగా కలవోలె కనిపించె
పూలరంగులతోని పులకించె సెలయేఋ!
పూల సువాసనల బులకింప యేఅంత!
ఆసక్తితో నిలిచె యట వన్య మృగములును! ॥ఏటి॥

రెక్కలొచ్చిన పక్షి కూనలును దరిజేరి
రంగురంగుల పూలు రమణీయముగ జేర్చి!
గూళ్ళు కట్టుచునుండె కూనిరాగాలతో
తల్లులకు జూపింప దన్మయము నందుచును! ॥ఏటి॥

సెలయేటి జాలులో నిలిచినా మొలిచినా
ముత్యాలొ, రత్నాలొ మురిపెంపు శిలలనో!
హంసచేడియ లొచ్చి యతని మేయుచునుండె
పులకించి నీరముల పుప్పొడుల దేనియల!

దినమంత గడిచినది దీరుగా వేదనను
కన్నీటి జలలతో కలుషమాయెను యేఋ!
రాడుగద! మురళితో! రమణీయ దర్శనము
నిచ్చి బ్రోవడుగదా! మచ్చికను మాధవుడు

## వేదనాశ్రువులలో

వేదనాశ్రువులలో విలవిలా దొరలినా
రాళ్ళన్ని రూపొందె రమ్య రూపాలా!

శిలలు శిల్పాలుగా చిత్రముగ రూపొందె
అందమౌ గుహలోనె యలరు దేవతలుగా!

వేదనాశ్రువులలో విలవిలా దొరలినా
రాళ్ళన్ని రూపొందె రమ్య రూపాలా!

మనసులో రాగాలు మనసులో భావాలు!
పాటగా రూపొందె బరగ లాలితముగా!
నా భావగీతాలు నాట్యమాడుచు శిలలు
ఏటి యొడ్డున నిలిచె నీటి యలలును దగుల ॥వేదనా॥

అలలలో దరికొచ్చి శిలలపై నిలిచినా
దివ్యాక్షరములన్ని తీరుగా గనునూ!
నిలిచినవి పరమాత్మ నీ రూపనామములు
నా గొంతు బాడినా నవసుందరాకృతులు! ॥వేదనా॥

ఆరిపోయినదాక యలరి నీ పాటలను
పాడుకొందును కృష్ణ పరవశము జెందగా!
వేదనాశ్రువులందు విలవిలా తపియించి
మూర్ఛనొందిన దాక! మునిగిపోయినదాక!

వేదనాశ్రువులలో విలవిలా దొరలినా
రాళ్ళన్ని రూపొందె రమ్య రూపాలా!

## పాలపిట్టకు వోలె

పాలపిట్టకు వోలె బరుగెత్తు నాగీతి!
ఎటు మాయమాయెనో! యెఱుగజాలనుగా!

అందాల భావాలు! అపురూప రాగాలు
శ్రుతిలయలతో గూడి చోద్యముగ నుండేవి!

పాలపిట్టకు వోలె బరుగెత్తు నా గీతి
ఎటు మాయమాయెనో యెఱుగజాలనుగా!

మావి కొమ్మను బాడు మధురమగు కోకిలయు
అందాల నృత్యాల యలరేటి నెమిలి!
హృద్యాభినయములను మోదించు కలహంస
నను మెచ్చుకొనివవి నా పాట మధురిమల! ॥పాల॥

మాధవుడు వచ్చినటు మదిని బులకించినటు
తీరుగా బాడినటు తీయని మురళిని!
అనిపించుచుండెడిది యారోజు లేమాయె?
మబ్బు క్రమ్మిన రాత్రి మాదిరిగ బ్రతుకాయె! ॥పాల॥

అచ్చరగ వలె నాడు ముచ్చటగ కిన్నెరను
పంచమ స్వరమునను పాటపాడితి గదా!
గిరటోయిన గొంతు కీరవాణికి బోలె
బరవశింపగ యెటుల పాట పాడుదునూ!

పాలపిట్టకు వోలె బరుగెత్తు నా గీతి
యెటు మాయమాయెనో యెఱుగజాలనుగా!

## వేదనాశ్రువులతో

వేదనాశ్రువులతో వికసించె జాలుగా
ప్రవహింప సాగినది పన్నుగా గిరులందు!

రాతిబండల పైని రమ్యముగ చిందుచూ
గమ్య మన్నదిలేక కదులుచున్నది యెటకొ!

వేదనాశ్రువులతో వికసించె జాలుగా
ప్రవహింపసాగినది పన్నుగా గిరులందు!

ముందునకు సాగునూ మురిపెముగ జలజలా
ఆగిపోవును నచట యలలన్ని మాయమగు!
మఱల ముందుకు సాగు మధుర నాదములతో
పొదలలో ప్రవహించు బూర్ణమగు ధారలను! ॥వేద॥

సుడులుగా దిరుగునూ స్రుక్కు బల్లములందు
దరుల కొమ్మల నంటి దగరాల్పు గుసుమముల!
రంగురంగుల పూల రమణీయ ముడులతో
అచటనే గిరి గుహల యలలతో నింపునూ! ॥వేద॥

చిలుక గోరింకలును చిత్రముగ వెంటరా
పాలపిట్టలుగూడ బరగ పైకెగురుచును!
గమ్యమును లేవట్టి కథవోలె పయనించు!
పాట యెటు లాగునో భావమాధురి లేక!

నీటిలో ప్రవహించి నీరముల స్పృశియించి
అలసిపోయినది నా యపురూపమగు పాట!
రాళ్ళన్ని నునుపాయె రమ్యాక్షరములాయె
చదువుకో గోపాల! సదయ! నా హృది గీతి!

## పాడినా నా పాట

పాడినా నాపాట బరగ యాగినదోయి!
గొంతు మాధుర్యమును గూర్మి యాగినదీ!
ముగ్ధమోహనమైన మురిపెంపు భావాలు
మాయమై పోయినవి మాధవా! యెచటకో!

పాడినా నాపాట బరగ యాగినదోయి
గొంతు మాధుర్యమును గూర్మి యాగినదీ!

తొలిసంధ్య కిరణాల తోరంపు భావాలు
నా గీతిలో నుండె నవనవోజ్జ్వలముగా!
అంతరంగము నొదిలి యాగీతికలుబోయె
అడవులకు, కొండలకు సలరు మరు భూములకు! ॥పాడినా॥

కిన్నెరను ప్రయోగించి కీర్తనలు బాడితిని
వీణ బలికించితిని విమల నాదములతో
పులకించి నదులన్ని పూలవానలు గురిసె
సెలయేఱు బాడినది చిత్రముగ నాపాట! ॥పాడినా॥

శ్రీనిలిచినా పాట శిథిలమై పోయినది!
గొంతులో సౌరభము కూలిపోయెను నేడు!
ఏ మొగముతో బిలుతు వేడుకను గోపాల?
రవరవలు జిందేటి రాతి గొంతుకతోని!

పాడినా నాపాట బరగ యాగినదోయి!
గొంతు మాధుర్యమును గూర్మి యాగినదీ!

# పద్మపత్రములపై

పద్మ పత్రములపై బడిన నా యశ్రువులు
విమలాక్షరములుగా వికసించె వరుసగా!

చిఱు చేపలన్నియును జేరి గుంపుగ ప్రీతి
పాడుకొన జొచ్చినవి బాలబాలికలవలె!

పద్మపత్రములపై బడిన నా యశ్రువులు
విమలాక్షరములుగా వికసించె వరుసగా!

తుమ్మెదల గుంపులును దూలుతూ నటకొచ్చి
రాగాలు తీయుచును రమ్యమగు నాట్యాల
పత్రములపైనున్న బరగలిపి దెలిసికొని
పాడుకొనజొచ్చినవి పతితపావన! గనుము! ॥పద్మ॥

తరుల కొమ్మలపైని దగ నిలిచి పక్షులును
విమలరాగములతో వినువీధి వినబడగ!
టెక్కలను విదిలించి మక్కువను శ్రుతిలయల
పాడుకొన సాగినవి పరమ హర్షము జెలగ! ॥పద్మ॥

హంస చేడియ వచ్చి ఆల్లారు ముద్దుగా
పద్మపత్రములందు పైనున్న గీతముల!
కావ్యరూపముగాగ కమ్మనీ పొత్తమును
ప్రకటింప దలచినది బరగ వరుసగ జేర్చి!

నా పాటలన్నియును నీకోసమే గదా!
నీ మురళినాదాలు నాకోసమే గదా!
వేణునాదములు నే వేడుకను వినుచుంటి
నాపాట వినవుగద! నళినాక్ష! యాసక్తి!

## రాబోకు వెన్నెలా!

రాబోకు వెన్నెలా! రమణీయ కాంతులను
ముత్యాల పూవులను ముదముతో రాల్చి!

మదియందు నిలుచు నా మాధవుడు మురళితో
చిగురించు నాగీతి చిత్తమందున రక్తి!

రాబోకు వెన్నెలా రమణీయ కాంతులను
ముత్యాల పూవులను ముదములో రాల్చి!

కనులందు ప్రవహించు కలకలా కన్నీరు
అలలుగా తెరలుగా అల్ల సంద్రమును జేరు!
కన్నీటి సుడులలో గన లేను మాధవుని
అంతరంగమునందు నలరు జ్యోతిని గూడ! ॥రాబోకు॥

జొరబడని వెన్నెలల దూరముగ నే బోదు!
తరు రంధ్రబొరియలను దాగియుందును నూరి!
పొదలతో గుహలలో పూలపందిరులందు
మరుగుండి దర్శింతు మాధవుని శాంతముగ! ॥రాబోకు॥

వెన్నెలల యేముందొ! విమలమౌ మనసునను
వేణుగోపాలునీ వేణువును సేవింతు!
వేణువును వినగానే వికసించు నాగీతి!
విరహగీతములతో విమలాశ్రు ధారలను!

రాబోకు వెన్నెలా! రమణీయ కాంతులను
ముత్యాల పూవులను ముదముతో రాల్చి!

## సీలిమబ్బులతోని

సీలిమబ్బులతోని నిండినది గగనమూ!
పచ్చనీ మొలకలను బరగ ధరణియునూ!

వర్షఋతువున తాను వత్తునని బలికెనూ
రాదేమి కృష్ణుడూ? రమ్యమగు మురళితో!

సీలిమబ్బులతోని నిండినది గగనమూ!
పచ్చనీ మొలకలను బరగ ధరణియునూ!

కనులు గలువలు జేసి కనుచుంటి దిక్కులను
ఏటునుండి వచ్చునో యేమొ యని మదిదలచి!
మురళీ ధ్వనుల నేను మోహ మందుదు నంచు
కమలములు జేర్చితిని కర్ణ రంధ్రములందు! ॥సీలి॥

కొండ కోనల నున్న కోవెలను సరిజేసి
బంతి పూదోరములు బన్నుగా గట్టితిని!
కోకిలల నుంచితిని కుహుకుహూ స్వనములను
స్వాగతం బీయగను సాధుమార్గము నంచు! ॥సీలి॥

హంసలను నుంచితిని అభినయంబులు సేయ
చిలుకలను నుంచితిని చిత్రముగ పలుకగా!
కిన్నెరను బట్టి నే చిఱు గీతములతోని
గుడిద్వారమున యుంటి కూర్మి యంజలితోని!

సీలిమబ్బులతోని నిండారె గగనమూ
పచ్చనీ మొలకలను బరగ ధరణియుమా!

## సెలయేటి పొరలందు

సెలయేటి పొరలందు నలల యంజలి బట్టి
నీదాని ననుచు నే నిండు హృదయమునా!

మధుర గీతముతోని మాధవుని యర్చింప
నీటిపక్షులు గాంచె నిండు హృదయమునా!

సెలయేటి పొరలందు నలల యంజలి బట్టి
'నీదాని' ననుచు నే నిండు హృదయమునా!

అంజలిని కలువయని యతి మోదమును నంది
పాలపిట్టలు వచ్చి ఖరగ యట వ్రాలినవి!
దోసిలిని యున్నట్టి దివ్యమౌ నీరమును
ముక్కులను ముంచుకుని ముదముతో ద్రావినవి! ॥సెలయేటి॥

పూవులను నున్నట్టి పుష్పాంజలిని గాంచి
తుమ్మెదలు నాట్యాల తూలుతూ నట కొచ్చి!
అంజలిని కమల మని అలరి భ్రమమును జెంది
తేనె లనుచును ద్రావె తీయనీ జలములను! ॥సెలయేటి!॥

అంజలిని యున్నట్టి యలరు జలముల నొదిలి
ముకుళించి యంజలిని మోదమున బట్టగా!
పూమొగ్గ యనుచు మది పులకలను పిట్టలును
ముక్కులను ముద్దాడి మోదమందుచు నుండె! ॥సెలయేటి॥

నా పాటలో నున్న నాదమెటు వంటిదో
కోకిలల గుంపులును గూర్మి పాటలు బాడె!
మత్త మయూరాలు మధుర నాట్యము జింద
వన్నెలను జిందినది వయ్యార మొలుకగా! ॥సెలయేటి॥

## అంతరంగమునందు

అంతరంగమునందు అలరు నా వేదనను
వినిపింప బోనులే! వివరింప బోనూ!

పశులను మృగములను బరగ పూ దీవెలును
వినలేవులే కృష్ణ! విపుల రోదనలనూ!

అంతరంగమునందు అలరు నా వేదనను
వినిపింపబోనులే వివరింప బోనూ!

హృదయాంతరము నందు సదయ! వేదనలనూ
పాటగా పాడనూ బరులకును వినిపింప!
కోమలంబగు నాదు కోరికను కడ ద్రుంతు
మోహమందను కృష్ణ! మూర్ఛనల జెందనూ! ॥అంత॥

కలువరింపను నిన్ను కమ్మనీ మాటలను
రమ్మనీ బిలవనూ రాగాల మాలికల!
గొంతెత్తి బిలువనూ! కూర్మి నీ నామమును
బిలుక గోరింకలకు చెలులతో దెలుపనూ! ॥అంత॥

గూఢమగు మదియందు కుమిలేటి నా కోర్కె
మబ్బుభూములకు నిదే మాధవా! బంపెదను!
మనుషులే లేనట్టి మైదానముల యందు
ఒంటరిగ మౌనముగ యేదార్తు గీతమును!

అంతరంగమునందు అలరు నా వేదనను
వినిపింప బోనులే! వివరింప బోనూ!

## పరమాద్భుతములు

పరమాద్భుతములు నీ పనులు బరికింపగా
మాయమగు ప్రాణాలు మరల నిలుపుదువూ!

కష్టాల దుఃఖాల కతదేర్చి నిలకడను
మరల జీవమునిచ్చి మమత జేకూర్చెదవు!

పరమాద్భుతములు నీ పనులు బరికింపగా
మాయమగు ప్రాణాలు మరల నిలుపుదువూ!

చైతన్య హీనమై మతిలేకయున్న యా
సమయాన నిలిపితివి సకలమును గూర్చి!
గొంతు బోయిన గూడ కోమలంబగు గీతి
వ్రాయుటను నిలిపితివి రమ్యమగు శైలినీ! ॥పర॥

కఠిన శిల లేవియో కనికరంబులు లేక
ముందునకు ద్రోసినవి మోద మింతయు లేక!
మరల నిచ్చితివి గద! మధుర సుందర శైలి
హృది బాడుకొను మనుచు మతిని శ్రుతిలయలతో! ॥పర॥

పాడినది చాలులే! బరగ నిను స్తుతియించి
ఆడినది చాలులే! యలరి నా మనసునను!
నా మదిని నీ వుండి నవ్యగీతిక లెపుడు
ప్రకటింప జేసెడి ప్రతిభ యిక చాలులే! ॥పర॥

దోచుకుంటివి నాదు దోషములు హరియించి
నీ పాదసన్నిధిని నిలుపుకొంటివి! యికను
సుఖదుఃఖములు లేని సుందరంబగు జ్యోతి
అంతర్గతమునందు అలరింపు పరమాత్మ! ॥పర॥

## వేదనాశ్రువులతో

వేదనాశ్రువులతో వెలసినా కొలనిలో
కలువ తామరలార! కమనీయగీతీ!

గోపాలబాలునికి కూర్మితో దెలుపుచూ
శిలనైతి ననుచు నే చిత్తరువు నైతినని!

వేదనాశ్రువులతో వెలసినా కొలనిలో
కలువ తామర లార! కమనీయ గీతీ!

కిన్నెరను జేపట్టి కీర్తనల బాడుచును
మధుర గీతములతో మది నిన్ను బిలుచుచును!
అంజలిని జేపట్టి యలరి పూమాలలను
ఎదురు జూచిన దనుడు! మది సుడులు తిరిగెనని! ॥వేదనా॥

కన్నీటితో నింపె కలికి యీ కోనేరు
మధుర బావాలతో మంజులంబగు శైలి!
నీరాకకై జూచి నిలువునా నీరాయె!
శిలగ మారెను జూడు! చిత్తరువువలె ననుచు! ॥వేదనా॥

గగన వీధులయందు కాంతి మొలకలయందు
గిరులందు తరులందు సరుల తీరములందు!
నీ కోసమై వెదికి నిను జాలి బిలుచుచును
శిలగ మారినదనుడు చిత్రముగ కోనేట! ॥వేదనా॥

శిలగ మారుటకు మును చిత్రముగ గొంతెత్తి
మరుజన్మకైన నిను మరుతనని దెలిపినది!
పూవుగా మారి నిను పూజింతు నని బలికె!
చిగురునై శ్రీతులసి జేరెదను హృది ననుచు! ॥వేదనా॥

## ఏ మధుర బంధమో

ఏ మధుర బంధమో యెఱుగరానిది కృష్ణ!
మన బంధ మీరీతి మలచె విధి చిత్రముగ!

మహనీయ శ్రుతిలయల మాధుర్య మొప్పినది
భక్తియే రక్తిగా ప్రణయ గీతిగ మారె!

ఏ మధుర బంధమో! యెరుగరానిది కృష్ణ!
మన బంధ మీరీతి మలచె విధి చిత్రముగ!

మధుర మురళినిబాడి మనసు రంజించెదవు
తీయనీ గీతమును దీరుగా బాడెదను!
మధుర గోపిక నేడు మహనీయ రాగమున
దర్శింపగా జూతు దగని వేడుకతోను! ॥ఏ మధుర॥

అలనాటి వ్రేపల్లె అందాల బాలునిగ
కనులలో నిలిచెదవు కమనీయ రూపమున!
మాటలాడవుగాని మనసులోపల యుండి
యాడెదవు బాడెదవు అందాల మురళితో! ॥ఏ మధుర॥

కంటి కగుపింపకను కడు దూరమున నుండి
మనసునను నిలిచెదవు మధురమగు మురళితో!
నిను విడువలేనుగద! నీ మురళి నాదమును
నను విడువ లేవు గద! నా భక్తిగీతమును!

ఏ మధుర బంధమో! యెఱుగరానిది కృష్ణ!
మనబంధ మీరీతి మలచె విధి చిత్రముగ!

# కృష్ణ విరహముతోని!

కృష్ణ విరహముతోని కష్టమున నే నుంటి!
సేద దీర్పగరండు! చెలులార వేగా!

చిలుక గోరింకలును చిన్నారి తుమ్మెదలు!
మావికొమ్మల నున్న మధుర కోకిలటా!

కృష్ణ విరహముతోని కష్టమున నే నుంటి
సేద దీర్పగ రండు! చెలులార! వేగా!

మనసులో కోరికను మర్మముగ గీతితో
పాడి వినిపించితిని ప్రణయగీతము వోలె!
సర్వమర్పించితిని సరసిజాక్షునకు నే
అలనాటి గీతమును నలరి బాడితినమ్మ! ॥కృష్ణ॥

ఠెక్కలల్లార్పకను విప్పి జూచితి కనుల
అవని యంబరములను నలరి పది దిక్కులును!
కనిపింపగా రాడు! కమనీయ ముగ నిలిచి!
మురిపెమున మురళితో మోదమున నింపుచూ! ॥కృష్ణ॥

చెలులార! వేదనను కలత నలతల నంది
మూర్ఛలను నంది నే మునిగి దేలుచు నుంటి!
చందనాదులు దెచ్చి యందముగ ననుదీర్చి
మురళితో బాడరే మోహ మది శాంతించు!

కృష్ణ విరహముతోని కష్టమున నే నుంటి!
సేద దీర్పగ రండు! చెలులార! వేగా!

## ప్రస్రవణగిరికి వలె

ప్రస్రవణ గిరికివలె ప్రవహించె నా కనుల
వేల ప్రవాహాలు వినువీధి వెంటా!

అంబుధికివలె నాదు నలరేటి హృది యందు
వేల తరంగాలు వినువీధి కెగసినవి!

ప్రస్రవణ గిరికివలె ప్రవహించె నాకనుల
వేలప్రవాహాలు వినువీధి వెంటా!

చేసినా విన్నపము జెలగి ప్రార్థన యనుచు
మదియందు దలపకను మాధవుడు చులకనగ
నను జూచు! నా వ్యధను నటనాలనీ దలచు!
వినిపించుకోడు గద! విమలమగు ప్రార్థనను! ||ప్రస్రవణ||

ఎవరెన్ని జెప్పినా భవబందముల దెలిపి
తన హృదయ మురళిలో నను గలుపుకోడు గద!
చక్కనీ నాపాట సరసత్వమును గనడు!
చిక్కనీ భక్తినీ రక్తినీ గనరాడు! ||ప్రస్రవణ||

గిరులార! తరులార! కిన్నెరా సతులార!
ఆకాశమార్గాన యటుబోవు హంసలూ!
మాధవుకు నా వ్యధను మన్నించి దెలుపరే
కన్నీటి ముత్యాల కానుకల మీకిత్తు!

ప్రస్రవణ గిరికివలె ప్రవహించె నా కనుల
వేల ప్రవాహాలు వినువీధి వెంటా!

# విమలమగు కన్నీటి

విమలమగు కన్నీటి వేదనాశ్రువులతో
సెలయేటిలో రాళ్ళు చెదిరి దొరలుచునూ!

మధురాక్షరములుగా మారినవి శ్రీకృష్ణ!
శిల్పి చెక్కిన రీతి శిలలాయె దరులందు!

విమలమగు కన్నీటి వేదనాశ్రువులతో
సెలయేటిలో రాళ్ళు చెదిరి దొరలుచునూ!

మంచు పొరలుగ నాదు మదియందు వేదనయు
నింగి చుక్కల గప్పె రంగుగా చందురుని!
అందముగ తెరవేసి నటు మాపె కళలనూ
కలువలవి కొలనిలో కలత ఖాష్పము లొలికె! ॥విమల॥

వంగినా వరిచేల వన్నెలన్నియు మాపి
తెల్లనీ ముసుగులను తీరుగా వేసినది!
తరుల యాకులురాల్పె దీరుగా ముత్యాలు
రవికిరణములమారె రత్నాల కాంతులను! ॥విమల॥

దరుల శిలలను నున్న విరిసినా వేదనల
చదువుకో గోపాల! వేదనాక్షరములను!
వినిపించు నీ చెవుల విమల భాషల నొలుకు
అపుడయిన దయ గనుము ఆ శిలల ధ్వనులకును!

విమలమగు కన్నీటి వేదనాశ్రువులతో
సెలయేటిలో రాళ్ళు చెదిరి దొరలుచునూ!

## పయన మెచ్చటి కనుచు

పయన మెచ్చటి కనుచు ప్రశ్నింపకండమ్మ!
విభుని దరి జేరగా వేగ బోవుచునుంటి!

దరుల గిరులను దాటి దగ శైల శిఖరములు
మైదానముల దాటి మాధవుని దర్శింప!

పయన మెచ్చటి కనుచు ప్రశ్నింపకండమ్మ!
విభుని దరిజేరగా వేగ బోవుచునుంటి!

అశ్రుధారలతోని యవని దడుపుచు నుంటి
గోపాలదేవునీ కూర్మి దర్శింపగా!
కాలి నడకలతోని కదిలి పోవుచునుంటి
కిన్నెరను జేపట్టి కీర్తనల బాడుచును! ॥పయన॥

కొండ వాగుల నన్ని కూర్మితో దాటుచును
చిలుక గోరింకలను జేరి పలుకాడకను!
మబ్బు కన్నెలగాంచి మాటాడ కుండగా
ఆకాశమున బోవు అచ్చరకువలె నేను! ॥పయన॥

విభు పాదపద్మాల విమల భ్రమరము రీతి
నాట్యాలు జేయగా నా కోర్కె యదిగదా!
వేణువున కనువుగా విమల గీతము బాడ
నా కోర్కె చెలులార! నయముగా దీవించి
అంపరే నను వేగ యల కృష్ణు సన్నిధికి!

పయన మెచ్చటి కనుచు ప్రశ్నింపకండమ్మ!
విభుని దరి జేరగా వేగ బోవుచునుంటి!

## చిలుక గోరింకలూ!

చిలుక గోరింకలూ! చిన్నారి పిచ్చుకలు!
ప్రియస్పర్శలను నన్ను ప్రీతి జేకూర్పరే!

మోహమున మునిగితిని ముద్దుకృష్ణుని కొఱకు
నా వార్త ప్రియముగా నాధునకు దెలుపరే!

చిలుక గోరింకలూ' చిన్నారి పిచ్చుకలు
ప్రియ స్పర్శలను నన్ను ప్రీతి జేకూర్పరే!

నా మూర్ఛంను దెలిపి నయముగా జాలిగా
కనులు మూయక నిన్ను గాంచుచున్నదనీ!
నీతిమబ్బుల వెనుక నీవుంటి వని దలచి
మది నిలిపెదనని దెలిపి మాధవుని రమ్మనరె! ॥చిలుక॥

అందాల కృష్ణుడూ యలరి రాకున్నసరి
మురళినైనను దెండు ముద్దుగా యాచించి!
హృదయమున నుంచుకొని స్మృతినొంద మానసము
ఆనంద జలధిలో నటుమునిగి పోవుదును! ॥చిలుక॥

మోహమందిన నన్ను ముదితలారా! దేర్ప
అందాల పింఛమును చందముగ గొనితెండు!
పాద ధూళినినైన బన్నుగా యాచించి
నాపైని ఇల్లరే! నను ప్రీతి జేయరే!

చిలుక గోరింకలూ! చిన్నారి పిచ్చుకలు!
ప్రియస్పర్శలను నన్ను ప్రీతి జేకూర్పరే!

## తరులార! పొదలార!

తరులార! పొదలార! విరియు పూలతలార!
నను సేద దేర్చరే! నళినాక్షు విరహమున!

బడిని గూర్చొనజేసి యుదధివలె నుప్పొంగు
మది విరహమును బాపి మాపరే కన్నీరు!

తరులార! పొదలార! విరియు పూ లతలార!
నను సేద దేర్చరే! నళినాక్షు విరహమున!

తరునీడంను జేర్చి దగ పూవులను బఱచి
పవళింప జేయరే బన్నుగా శ్రమ దొలగ
పద్మపత్రములతో బన్నుగా విసురుడూ!
కృష్ణ విరహము నాదు ఉష్ణమును శమియింప! ॥తరులార॥

పూపొదలలో నన్ను శయినింప జేయరే!
కలువపూవుల దెచ్చి కన్నులను నొత్తరే!
కోకిలకు కబురంపి కోమలంబగు గీతి
వినిపింప జేయరే వీనులకు విందుగా! ॥తరులార॥

పూలతలతో నన్ను బొలుపుగా నలరించి
కుదురుగ యొడియందు గూర్చుండ బెట్టుకొని!
చందురుని జూపించి సాంద్ర కిరణములతో
నా శరీరము నొత్తి నా వ్యధను మాపరే!

తరులార పొదలార! విరియు పూలతలార!
నను సేద దేర్చరే! నళినాక్షు విరహమున!

## ఒకదాని కొక్కటీ

ఒకదాని కొక్కటీ యొనరు కారణములను
తెలియరాదు  గదా! తీరుగా కృష్ణా!

పాటలో శ్రీకృష్ణ పరిఢవిల్లుట నీవు
వింతగా నున్నది వేయి విధములనూ!

ఒకదాని కొక్కటీ యొనరు కారణములను
తెలియరాదుగదా! తీరుగా కృష్ణా!

రవికాంతిలో విరియు రమ్యమగు కమలములు
చంద్రకాంతుల విరియు సరసి కలువల గుంపు!
ఏ కారణములచే యీవిధిని స్నేహములు
అమరెనో కారణము యరసి తెలియగలేము! ॥ఒకదాని॥

నీ పరిచయంబు మఱి నిను జూడలేదుగద!
నీమీద నా మనసు నిండియుండెపుడునూ!
ఏనాటి బంధమో కనబడని స్నేహ మిటు
నిలిచియుండుట జూడ నిజముగా భాగ్యమూ! ॥ఒకదాని॥

కనబడని కారణముల కలగనీ, కనబడక
మరుగుబడియుండనీ మాధవా! నీవింక!
నావాడవై తివీ నీదాన నే నైతి!
చరణదాసిని నైతి! జేర్చుకొను గోపాల!

ఒకదాని కొక్కటీగా యొనరు కారణములను
తెలియ రాదుగదా! తీరుగా కృష్ణా!

## ఆషాఢ మేఘముల

ఆషాఢ మేఘముల నటు జూచి కడిమియును
పూ మొగ్గ విడినటుల పొలుపుగా కృష్ణా!

నా మనసు నీ రూప నామములు దలపగనె
నీవేణు నాదాలు నిండిపోవును తనువు!

ఆషాఢమేఘముల నటు జూచు కడిమియును
పూమొగ్గ విడినటుల పొలుపుగా కృష్ణా!

నెలపొడుపు బాలునీ నింగి చందురు గాంచి
బాలకృష్ణుడు వేగ బన్నుగా మది నిలుచు!
కాలి గజ్జియలతో కమ్మనీ మురళితో
అగుపించుచుండు నా ఆత్మలో ముద్దుగా! ॥ఆషాఢ॥

మధుర చైత్రమునందు మానుగా కోకిలలు
మావిచివురులు మేసి మధురముగ కూ యనగ!
నా మనసులోనున్న నందగోపాలు గని
పాటబాడెద నేను బరవశము జెందగా! ॥ఆషాఢ॥

పడవపై పయనించు బాటసారిని గాంచి
వ్యధజెంది ప్రార్థింతు విమలమగు కంఠమున!
పథికుడా! గొనిపొమ్ము! పద్మనాభుని కడకు
భువనసుందరమైన పూలతో బూజింతు!

ఆషాఢ మేఘముల నటు జూచి కడిమియును
పూమొగ్గ విడినటుల పొలుపుగా కృష్ణా!

## కన్నీటి వాన

కన్నీటి వానలో కదిలినది నాపాట
ముత్యాలదండవలె ముదముతో సీటా!

పయనించుచున్నదీ బరగ నిను గలియగా
అలల తెరలను దూలి యప్సరసకును వోలె!

కన్నీటివానతో కదిలినది నా పాట
ముత్యాలదండవలె ముదముతో సీటా!

కలువ తామరపూలు కదిలిరాగా వెంట
కమనీయ గంధములు విమలముగ వ్యాపింప!
తుమ్మెదల బారులును దూలుతూ జనుదేర
మల్లెపూ దండవలె మాణిక్య సరమువలె! ॥కన్నీటి॥

కోకిలలు పాడుతూ కూర్మి వెనుకను రాగ
చిలుక గోరింకలును చిత్రముగ పయనింప!
అడవి మృగములుగూడ నలసతను విడనాడి
జాలితో పయనించె తలలొంచి పాటతో! ॥కన్నీటి॥

వెన్నెలా పువ్వులును వేడుకను బాడుతూ
ఆకాశమల్లెలును అందాల గొలుసువలె!
హిమబిందువులుగూడ అమలమగు ముసుగులను
పాటతో తరలినవి పతితపావన గనుము!

నా విరహ వేదనను నయముగా నింపితిని
పాటలో మధురముగ ప్రకటించితిని స్వామి!
పాటతో వచ్చినా చేటులను దయ దలచి
ఆదరింపుము ప్రేమ యటుపైని నీ యిచ్ఛ!

## ఆకస్మికముగ నా

ఆకస్మికముగ నా అందాల గీత మదె
వానచినకుల యందు వయ్యార మొలికినది!

విభుని దర్శించినటు విభు పాదపద్మముల
స్పర్శించినటుల మది తన్మయము నొందినది!

ఆకస్మికముగ నా అందాల గీతమది
వాన చినుకులయందు వయ్యార మొలికే!

పాటతో తనుగూడ పాటపాడిన యటుల
మురళిపాటకు తాను మోహమందిన యటుల!
శ్రీమనోహరుని తన చిత్తమున నిలుపుకొని
జ్యోతితో జ్యోతియై ప్రీతి జిందిన యటుల! ॥ఆక॥

నెమిలిపింఛము తోని నిండు నగు మోముతో
మురళిజేత ధరించి ముద్దుగా గీతమును!
ఆదరించిన యటుల యటు దయను వర్షించి
కౌగిలిని జేర్చుకొని కదిలినటు మది దోచె! ॥ఆక॥

కన్నీటి వానలో కదలి గలియకు మనుచు
వారించి దయతోని వర్షించి ప్రేమలను!
దగ ఊర్ధ్వస్వలంబైన దర్శనము దయజేసి
కరుణించినట్లుగా కలవోలె కనిపించె!

కటిక చీకటి యెదుట కన్నులకు వెన్నెలగ
కనిపించు చున్నదీ కమనీయ పులకలను!
చిత్త వికాసంబు జిగురించె మదియందు
ఆకస్మికంబుగా అలరుచున్నది మపసు!

## నీవు మనసున యున్న

నీవు మనసున యున్న నిజముగా జగమంత
పండువెన్నెలవోలె పరమ శోభలతో!
నిండియుండును స్వామి! నీవు లేకున్నచో
శూన్యముగ కనిపించు శోభావిహీనమై'
నీవు మనసున యున్న నిజముగా జగమంత
పండువెన్నెల వోలె పరమ శోభలతో!

ఆఱు ఋతువులుగూడ అందాల రాశులై
కనిపించు గన్నులకు కళ్యాణ రూపమున!
నీవు లేకున్నచో నిఖిల వాసంతమును
శిశిరంబునకు వోలె శిథిలముగ కనిపించు! ॥నీవు॥

నిండుచంద్రుడుగూడ పండు నిప్పుల నొలుకు
మధురసంధ్యలుగూడ మంటలను జ్వలియించు!
చిన్నిచుక్కలుగూడ వన్నెలను విడనాడి
చింతనిప్పులకు వలె వంతలను గూర్చునూ! ॥నీవు॥

కరుణించినాసరే నిరసించినను గూడ
మనసునందున నిలిచి మన్నింపగా వలెను!
నిను మఱువబోను గద! నిఖిలమును మఱచెదను
కలిసియుండుము కనుల కన్నీటి బిందువుల!

నీవు మనసున యున్న నిజముగా జగమంత
పండువెన్నెల వోలె పరమ శోభలతో!

## కడలేని యెడబాటు

కడలేని యెడబాటు గలిగెనే చెలియరో!
మాధవునితో నాకు మది క్రుంగుచుంటి!

జన్మజన్మలనాటి వీడనీ బంధమిది
మర్మముగ దయదలచి మనసీయదే చెలీ!

కడలేని యెడబాటు గలిగెనే చెలియరో!
మాధవునితో నాకు మది క్రుంగుచుంటి!

మధురాక్షరములతో మనసునను వ్రాసెనే
చెరగనీ వ్రాతలను చిత్తమం దుంచెనే!
అడియాస లాయెనే యాశలన్నియు గూడ
కబురంపినా గూడ కదిలిరాడే చెలీ! ॥కడలేని॥

అల గోపికను నేను అందాల ప్రేపల్లె
మమత పూజించితిని మాధవుని నాడూ!
మఱచిపోయెను నన్ను మదిని విరహముతోని
కలత జెందుచునుండె కమనీయ గీతముల! ॥కడలేని॥

మబ్బులో గనిపించు మసక మసకలతోని
శిలలలో గనిపించు శిల్పమున కన్నులకు!
మాటలను మాటాడు పాటలను బాడుచును
కనుచూపు కందడూ! కలిసి మాటాడడూ!

కడలేని యెడబాటు గలిగెనే చెలియరో!
మాధవునితో నాకు మది క్రుంగుచుంటి!

## మది దాచుకొందునూ

మది దాచుకుందునూ మాధవుని విరహమును
కనిపింప నీయనూ కనుల భాష్పములా!

కిన్నెరను మీటుచూ కీర్తనల బాడుచును!
వీధులందున దిరిగి విలపింప నో చెలీ!

మది దాచుకుందునూ మాధవుని విరహమును
కనిపింపనీయనూ కనుల భాష్పములా!

కలువ తామరలనూ కనబోను సరసితో
తుమ్మెదల గుంపులను దోరముగ గాంచనూ!
మబ్బు కన్నియలతో మాటలాడగబోను!
మదిలోని వేదనను మల్లెలను దాచెదను! ॥మది॥

ముత్యాల హారమును ముదముతో ధరియించి
అద్దమున జూచుకొని ఆనంద మొందనూ!
హంసభానుల బిలిచి అల్లారు ముద్దుగా
గోపాలబాలునీ కూర్మి దెమ్మని బలుక! ॥మది॥

అణచివేయుదును నా అందాల విరహమును
మది దాచుకుందునూ మాధవుని రూపమును
పరులకును తరులకును పక్షులకు మృగములకు
విప్పిజెప్పను నాదు విరహమును వేదనయు!

మది దాచుకుందునూ! మాధవుని విరహమును
కనిపింప నీయనూ కనుల భాష్పములా!

## కఠినోక్తులను బలికి

కఠినోక్తులను బలికి కలవరము బఱచితిని
మనసుపొరలను నున్న మాధవా! మన్నింపు!

దయజూడ లేదనీ, విరియలేదని నగవు
కనుల నీరొలుకుచును గఠినములు బలికితిని!

కఠినోక్తులను బలికి కలవరము బఱచితిని
మనసు పొరలనునున్న మాధవా! మన్నింపు!

పుట్టించితివి నన్ను పుడమిలో పువ్వుగా
రక్షింప వెనుకాడ రమ్యమా గోపాల?
అర్పింప గోరితిని యరసి నీ పాదముల
యిప్పుగిది వ్యధ ముంప యిది న్యాయమా నీకు? ॥కఠి॥

మాటగా జేసితివి మధుర రాజిలుకగా!
పాటగా జేసితివి బరగ కోకిలరీతి
మాట పాటలు బలుక మది విరస మెందుకో?
మన్నింప వెందుకో! మధుర వీక్షణతోని! ॥కఠి॥

కనిపించి మాటాడి కరుణ జూపింపవూ
వినిపించినా వ్యధను వెత దీర్ప రావుగా!
ఇది యెట్టి బంధమో! యేనాటి సఖ్యమో!
స్మృతిలేని కలవోలె మతి దోచు నిజముగా!

కఠి నోక్తులను బలికి కలవరము బఱచితిని!
మనసు పొరలను నున్న మాధవా! మన్నింపు.

## అడ్డుకట్టలు వేసి

అడ్డుకట్టలు వేసి యాపబోకండమ్మ!
ప్రవహింపనీయండి పల్లవించిన యలల!

చిగురులను పూవులను చిత్రముగ చిఱుతెరల
దోసిలిని జేపట్టి దూరమేగుచు నంటి!

అడ్డుకట్టలు వేసి యాపబోకండమ్మ!
ప్రవహింపనీయండి పల్లవించిన యలల!

విభు పాదపద్మముల వేడుకను బూజింప
మనసులో వ్యథలన్ని మర్మముగ వివరింప!
మురళీ స్వనములందు ముద్దుగా గలుపుకొని
భవబంధములనుండి బరగ విడిపింపుమని! ॥అడ్డు॥

కొండ కోనల దాటి కూర్మి మైదానముల
కలహంసలుండేటి కమనీయ సరసులను!
దాటిపోవుచునుంటి దరిలేని సంద్రమును
హరిపాదముల జేరి హారతుల నివ్వగను! ॥అడ్డు॥

ఎత్తుపల్లములందు నొత్తిడిని సహియించి
చిత్తమును గోవిందు శ్రీపాదముల నుంచి
మురళీ రవంబులను ముద్దుగా లీనమై
మఱుజన్మ మదిలేక మాయమై పోవుదును!

అడ్డుకట్టలు వేసి యాపబోకండమ్మ
ప్రవహింప నీయండి పల్లవించిన యటుల!

## పొగమంచుగా దిశలు

పొగమంచుగా దిశలు పొరలుగా వ్యాపించె
మనసులో వేదనను మాధవా! కనుగొనుము!

అవని యమురములును నటు గానరాకుండ
తెల్లనీ మబ్బుగా పల్లవించెను దిశలు!

పొగమంచుగా దిశలు పొరలుగా వ్యాపించె
మనసులో వేదనను మాధవా! కనుగొనుము!

మాటలను పాటలను మఱి వెలువరింపకను
కన్నీటి ధారలను కనకొనల నొలుకకను!
మౌనముద్రను దాల్చి మాధవా హృదయమున
నిను నిలిపితిని స్వామి! నిదుర నీరము నాదిలి!

పూలతోటకు నేను బోవుటను మానితిని
పూలతో నర్పింప బూనికను మానితిని!
కిన్నెరను మీటుటయు కీర్తనల బాడుటయు
మనసునకు దూరముగ మాధవా! యుంచితిని!

కోనలో నేనొక్క కుటిని నిర్మించితిని
నిర్జనంబైన తరు నీడలందున స్వామి!
ఒలక బోయుచు నుంటి సెలయేటి తరగలను
మనసులో క్రమ్మినా మధుర వ్యథ లన్నిటిని!

పొగమంచుగా దిశలు పొరలుగా వ్యాపించె
మనసులో వేదనను మాధవా! కనుగొనుము!

## మదిని వేడుక లన్ని

మదిని వేడుకలన్ని మాయమై పోయినవి
పాటలో భావాలు బహుదూరమునకూ!

వేదనలు బరువుగా విమల హృదయమునందు
నిలిచియున్నవి గనుము నిప్పులా కుంపటిగ!

మదిని వేడుకలన్ని మాయమై పోయినవి
పాటలో భావాలు బహు దూరమునకూ!

కలువ తామరలన్ని కదిలిపోయిన వెటో
రాజహంసలు గూడ రయము నెటుబో యెనో;
మధుర కోకిల గూడ మాయమై పోయినది
తుమ్మెదలు గనరావు తూలి యెటు బోయెనో! ॥మదిని॥

పాటలో భావాలు ప్రభవించుటయు మానె
శ్రుతిలయలు గనబడవు చోద్యమగు పాటలో!
అందాల సంధ్యలను బిందవుగ రాగాలు
మబ్బులను దాగున్న మధుర చంద్రికల వలె! ॥మదిని॥

కిన్నెరయు బలుకదూ కీర్తనల బాడదూ
నటన సలిపి నెమలినాట్యమున సేయదూ!
వ్యథ నిండగా మదిని వేదనలు వ్యాపించె
చూపులందిన దాక చోద్యముగ జగమంత!

మదిని వేడుకలన్ని మాయమై పోయినవి!
పాటలో భావాలు బహు దూరమునకూ!

## రావమ్మ కోకిలా!

రావమ్మ కోకిలా! రమ్య వీధుల నుండి
పాడవమ్మా గీతి! ప్రణవ నాదమునా!

నిండారు హృదయమున పండినా భక్తితో
పూజించుచుంటినీ పురుషోత్తముని రక్తి!

రావమ్మ కోకిలా! రమ్య వీధుల నుండి
పాడవమ్మా గీత! ప్రణవ నాదమునా!

నీ పాటతో వెలయు నిండారు నా పూజ
సఫలమై మధురమై సాధుత్వమును వెలయు
చివురు పూవులు పూయు చిత్రముగ వనమంత!
దిక్కులన్నియు నిండు ధీరుగా కాంతులను! ॥రావమ్మ॥

అడవి పక్షులవన్ని అందాల భంగిమల
నీ రాక కొఱకునై నిలిచియున్నవి గనుము!
నీ పాటతో గలిసి నిలిచి పాడుట కొఱకు
అందాల గజ్జియల నాడి పాడుట కొఱకు ॥రావమ్మ॥

ప్రణవగీతమునందు ప్రణయమును లీలగా
దాగియున్నటులుగా దర్శింతు కోకిలా!
హరివచ్చు నీ మధుర అందాల గీతి విని
నను గూడ మెచ్చుకొను నా గీతి మధురిమల!

రావమ్మ కోకిలా! రమ్య వీధుల నుండి
పాడవమ్మా గీతి! ప్రణవ నాదమునా!

## కొండంత వేదనను

కొండంత వేదనను గూర్మి మది భరియించి
పరమ పురుషుని కడకు బయనించు చుంటి!

మనసు జెదిరిన గూడ మధురమగు గీతమును
పాడుచును నుంటినీ భావ బంధురముగను!

కొండంత వేదనను గూర్మి మది భరియించి
పరమ పురుషుని కడకు బయనించు చుంటే!

ఊరు పల్లెల యందు ఉదయాస్తమయములను
అతని వేదుకుచునుంటి అందందు వేదనలను!
ద్వార ద్వారమునందు దయనీయముగ బిలిచి
కన్నీరు నొలుకుచును గాంచగా భక్తితో! ॥కొండంత॥

అలసతను నా గొంతు ఆగిపో రెందుకని?
చీలిపోదెందుకని చిత్రముగ నాదు మది?
తిరిగి తిరిగీ నాదు పదము లరిగెను స్వామి!
కాఱడవులందునను కఠిన శిలలందునను! ॥కొండంత॥

బరువు మోయగ లేను భారమును హృదియందు
పాట పాడగలేను భావ బంధురముగా!
కనుతెత్తి దూరమును గనలేను శ్రీకృష్ణ!
నీలి గగనమునందు నీలి వనరేఖలను!

కొండంత వేదనను గూర్మి మది భరియించి
పరమ పురుషుని కడకు బయనించు చుంటి!

## శ్రుతి లయలు దప్పినా

శ్రుతిలయలు దప్పినా చోద్యమగు నా పాట
పాడుచున్నది హృదిని భవ్య సుందరముగా!

బరువుగా నా గుండె బాధ నొందిన గూడ
హరి నామమును బాడు అందాల కిన్నెరగ!

శ్రుతిలయలు దప్పినా చోద్యమగు నా పాట
పాడుచున్నది హృదిని భవ్య సుందరముగా!

మనసు చెదిరిన గూడ మల్లెపూవులకు వలె
మధురాక్షరంబులును మది వెడలుచున్నవి!
వెన్నెలా పువ్వులుగ విమల పదబంధములు
చిన్ని పాపకు వోలె చిఱు నగవు లొలికించు! ॥శ్రుతి॥

నిను గాంచ కున్ననూ నీ రూప మధురిమలు
మది నిలుచు నెందుకో మధుర స్మృతులకు వోలె!
నీ మురళి రవములును నిండు నా హృది వీధి
వినిపించు చుండుగద! విమలమగు గీతిగా!

తుదిసారిగా నిన్ను దోరముగ బిలుచుచును
మదియందు నిలువుమని సదయ వేడుచునుంటి!
జన్మ జన్మలయందు కల్మషము హరియించి
పాదపద్మమునందు బరగ నే భ్రమరముగ!

శ్రుతిలయలు దప్పినా చోద్యముగ నా పాట
పాడుచున్నది హృదిని భవ్యసుందరముగా!

## మనసులో భావాలు

మనసులో భావాలు మది నుండి వెలుపలకు
పొగిలి రాకుండనుచు పూని దెలిపితినీ!

గోవిందు నామమును గూర్మి బలుకకు డనుచు
గొంతు నొక్కితి గదా! కూర్మి వేదనల చెలి!

మనసులో భావాలు మది నుండి వెలుపలకు
పొగిలి రాకుండనుచు పూని దెలిపితినీ!

మఱచిపోవుప మన్న మఱపునకు రావు గద!
హరి పాదపద్మములు నాత్మ యందున నిలుచు!
వీడనీ బంధ మిది! యేనాటిదో ,కాని
కనుఱెప్ప పాటయిన కన్నులను విడిపోదు!

చిగురాకు జూచినా చిన్ని పూవును గాంచ
కోకిలను గాంచినా గోరింక జూచినా!
మనసునను మెదలాడు మాధవుని దర్శనము
మురళి బాడుచునుండు మోదమును గురిపించు!

వ్యథలోన నను ముంచు వేదనల గలిగించు
కన్నీటి వానలో కడలేని గమ్యమును
పయనింతునే చెలీ! పవలు రాత్రులయందు
నా స్మృతికి రాకుమని సమయముగా దెలుపు చెలి!

మనసులో భావాలు మది నుండి వెలుపలకు
పొగిలి రాకుండనుచు పూని దెలిపితినీ!

## కన్నీటి కలశమును

కన్నీటి కలశమును కరమునను ధరియించి
కొండ నెక్కుచునుంటి కోరికను గుడికి!

నీ పాదముల గడిగి నిజ భక్తి ప్రకటించి
భక్తి గీతము పాడ బరవశింపగనూ!

కన్నీటి కలశమును కరమునను ధరియించి
కొండ నెక్కుచునుండి కోరికను గుడికి!

సఖియలతో గూడి చనుదెంచు చుంటినీ
సరసులను దాటి నీ చరణముల స్పృశియింప!
భక్తి మందారముల రక్తితో దెచ్చితిని
అమల గీతములతో అరుదెంచు చుంటినీ! ॥కన్నీటి॥

మనసులో నున్నట్టి మధుర భావములన్ని
గుదిగ్రుచ్చి దారాన గూర్చితిని మాలగా!
కన్నీటి కలశమున గడిగి పదపద్మముల
మాలగా వేయగా మాధవా! నా కోర్కె! ॥కన్నీటి॥

కొండంత పాటధ్వని నిండుగా వ్యాపించి
కన్నీటి జాలుగా సన్ననీ కాలువగ!
నా ప్రార్థనా గీతి నయముగా వినిపింతు!
పశు పక్షి మృగములను బరగ గుమిగూడగా!

కన్నీటి కలశమును కరమునను ధరియించి
కొండ నెక్కుచునుంటి కోరికను గుడినీ!

## చిని చిన్ని చిగురులను

చిని చిన్ని చిగురులను చిన్నారి మొగ్గలను
అలరేటి పువ్వులను అందాల మాలా!

నీ హృదయ హారముగ నిలిచి యర్పణ సేయ
మదిలోని నా కోర్కె మన్నింపవా కృష్ణ?

చిని చిన్ని చిగురులను చిన్నారి మొగ్గలను
అలరేటి పువ్వులను అందాల మాలా!

చిని చిన్ని పదములను చిన్నారి బంధముల
పాటగా గూర్చితిని ప్రణతు లర్పింపగను!
రాగాల కూచిగా రంజిలగ నాగీతి
నీ వేణు స్వరములను నిలిచియుండే టటులా! ॥చిని॥

హృదయవేదన యంత సదయ! కన్నుల జేరె!
కనుల నీరంతయును గడగి కంఠము జేరె!
పాటగా రూపొందె! పదముగా వర్ధిల్లె
భక్తిపూవుల దాల్చె బరగె నీ దాసిగా! ॥చిని॥

వేదాంత మార్గాన విలసిల్లె గగనాన
హంసగా రూపొంది యలరుచును ధ్వనులతో!
నీ పాదముల చెంత నిలిచినది గైకొనుము!
భక్తి నీరాజనము ప్రణతులను జేకొనుము!

చిని చిన్ని పూవులను చిన్నారి మొగ్గలను
అలరేటి పువ్వులను అందాల మాలా!

## కొండలను కోనలను

కొండలను కోనలను కూర్మిపూవుగ నుంటి
సెలయేటి జాలులను సవ్వడుల వినుచూ!
నీదారి జూచిలిని నిన్ను దర్శింపగను
కన్నీరు నింపుచును కలవరింవుచునూ!

కొండలను కోనలను గూర్మి పూవుగనుంటి
సెలయేటి జాలులను సవ్వడులు వినుచూ!

కోకిలగ నేమారి కుహుకుహూ ధ్వనులనూ
పాట బాడుచునుంటి బరగతేనియ లొలుక!
మావికొమ్మల నిలిచి మాంగల్య గీతమును
హంసభామలగూడి యాడి పాడుచునుంటి! ॥కొండలను॥

తంత్రినై కిన్నెరను తనివార మ్రోగుచును
ఎదురుజూచుచునుంటి మది పులకరింపగా!
మధురమౌ నీ మురళి మాధుర్యమును వినగ
దారిగాచియు నుంటి ధరిజేరు శ్రీకృష్ణ! ॥కొండలను॥

దాసిగానుండి నే తలచినా గీతముల
నాలకింపగ లేదు! అందుకోలేదు గద!
అందుకే పూవుగా నలరి కోకిలకు వలె
పాడితిని తంత్రినై పరవశం బలరగా!

ఇకనైన రారమ్మ! నింపుగా కోనలను
సెలయేటి దరులపై నిలిచి మురళిని బాడు!
కన్నీరు దుడిచి నా కలవరము దొలగించి
శిల్పముగ నను జేసి చిత్తశాంతిని గూర్పు!

## ఉదయ సంధ్యలలోని

ఉదయ సంధ్యలలోని కదిలేటిరాగాలు!
నీ పాద ధ్వనులనుచు నిలిచి భావింతూ!

రంగు రంగుల పూలు రమణీయ సుందరత
నీ మేని సొగసులని నిండుగా భావింతు!

ఉదయ సంధ్యలలోని కదిలేటి రాగాలు
నీ పాద ధ్వనులనుచు నిలిచి భావింతూ!

అలలలో కదలాడు నవరూప సొంపులను
సుడులలో గలిగేటి సురుచిరంబగు ధ్వనులు!
కలిలేటి సవ్వరులు కమనీయ నీ మురళి
నాదమే యనుచు నే నవనీత! భావింతు! ॥ఉదయ॥

సెలయేటి జాలులో నాలికేటి వెన్నెలలు
పువ్వులుగ జలజలా సవ్వడులు జేయుచును!
బండలను దాకునను నిండుగా జెదుర్చును
వేల దీపాలు నీ వెలుతురని భావింతు! ॥ఉదయ॥

ఒక చూపు జూడుమా! ఒక పలుకు పలుకుమా!
నే ధన్య నయ్యేదను నిజముగా గోపాల!
దాక్షిణ్య రేఖతో దయజూడు మొకసారి
మఱుజన్మ రేకుండ మానిపోదును భువిని!

ఉదయ సంధ్యలలోని కదిలేటి రాగాలు
నీ పాద ధ్వనులనుచు నిలిచి భావింతూ!

## కొండలను నెక్కుచును

కొండలను నెక్కుచును కోనలను తిరుగుచును
సెలయేటి జాలులను చరచరా దాటి!

వెదుకుచుంటిని కృష్ణ! విమలమగు గీతితో
మధుర భావముతోవి మానసము నర్పింప!

కొండలను నెక్కుచును కోసలను ధిరుగుచును!
సెలయేటి జాలులను చరచరా దాటి!

చిలుక గోరింకలను చిన్నారి పిచ్చుకల
పాలపిట్టలను నే పలుమారు నోదార్చి!
కలువ తామరలనూ కమనీయ కొలకులను
ఒదిలి వచ్చితి కృష్ణ! ఒంటరిగ నిను వెదుక!

కిన్నెరను దెచ్చితిని కీర్తనల బాడగా
అంజలిని దెచ్చితిని యాకాశ మల్లియల!
అర్పింపగా నీకు అందాల గోపాల!
మది విరహమును బాప మన్నింప సుకుమార!

వలదు వలదన్ననూ వరుసగా బాడుదును
పదములను అర్పింతు బరగ దోసిలి పూలు!
మౌన ప్రార్థనలతో మాధవా! యర్చించి
కన్నీటి ధారలను కరిగిపోదును కృష్ణ!

కొండలను నెక్కుచును కోనలను దిరుగుచును
సెలయేటి జాలులను చరచరా దాటి!

## పువ్వులను గోయనూ !

పువ్వులను గోయనూ రెమ్మలను ద్రుంపనూ!
కలువ తామరపూల కఠినముగ జిదుపనూ!

రాలినా పువ్వులే రతనాల మాలగా
గోపాల బాలునికి కూర్మితో వేయుదును!

పువ్వులను గోయనూ రెమ్మలను ద్రుంపనూ
కలువ తామర పూల కఠినముగ జిదుపనూ!

వీణియను మ్రోగించి వినుపీధియును మ్రోగ
పాట బాడను కృష్ణ! పరవశము జెందగా!
కిన్నెరను మీటుచును కీర్తనను నెమ్మదిగ
అందాల కృష్ణునీ యలరించెదను బ్రీతి! ॥పువ్వు॥

ఆషాఢ మేఘముగ అంతటను వ్యాపించి
కుంభవృష్టికి వోలె గురియ నే కన్నీరు!
స్వాతిబిందువులవలె సరసత్వమును బొంగ
ప్రేమాశ్రువులను నే! ప్రీతితో నర్పింతు! ॥పువ్వు॥

కొండంత కోరికల గోరియిచ్చిన గూడ
వలదంచు కృష్ణునీ వారింతు నో చెలియ!
జననమరణముల నే జడివాన దడియకను
చిన్ని కుటీరమును గోరుదును గోవిందు!

పువ్వులను గోయనూ! రెమ్మలను ద్రుంపనూ!
కలువ తామరపూల కఠినముగ జిదుపనూ!

# ఎంత కాలంబయిన

ఎంతకాలంబైన యెన్ని యుగములు నైన
యెదురుజూతును కృష్ణ! మది నిండు భక్తి!

నే నిరాశనుజెంది నిస్పృహను బొందనూ
కాలగర్భమునందు కనిపిపో నెన్నడును!

ఎంత కాలంబైన యెన్నియుగములు నైన
యెదురుజూతును కృష్ణ! మది నిండు భక్తి!

చిరకాల భక్తి యిది చెదిరిపోనీ మనసు
నీ పాదములబట్టి నిలిచి యుండినదీ!
అందందు దిరిగినా ఎందెందు దొరలినా
గాఢమగు నీభక్తి కలిసియుండును మదిని! ॥ఎంత॥

కన్నీళ్ళు దొరలించి కఱకు మాటల నాడి
వేదనను నీ మనసు వికలత్వమును జేయ!
పలుమాఱు నిను బిలిచి పంతమున బలుకనూ
అంజలిని నొదలనూ కంజాక్ష నిజముగా! ॥ఎంత॥

వేచియుండెదను నే వేయి వర్షంబులును
నీ సుధా దృష్టినీ నిలిచి బఱపేవఱకు!
కర్మ జీమూతములు కదిలిపోయే వఱకు
మాటలను తడబడక మనసు నిబ్బరముతో!

ఎంతకాలంబైన యెన్ని యుగములునైన
ఎదురు జూతును కృష్ణ! మది నిండు భక్తి!

## ఇంత వేదన యందు

ఇంత వేదనయందు కాంత! నే మునిగినా
గొంతుతో నా పాట కూర్మి కోకిలగా!

పాడుతూనే వుంది! పారవశ్యము తోని
మదికింపు గొలుపుచూ మాధవుని బిలుచుచూ!

ఇంత వేదన యందు కాంత! నే మునిగినా
గొంతులో నాపాట కూర్మి కోకిలగా!

కనులలో జ్వాలలును కదలాడినను గూడ
కలతనిదురను కలలు గాంచుతూనే వుంది!
కలలలో కృష్ణునీ కమ్మనీ గీతికను
వినిపించుచున్నదీ విమల రాగ ధ్వనుల!

కోనలో కొలనులో గూడినా కలువలకు
మదిలోని విరహమును చెదిరినా భావాల
తామరాకులమీద తన్మయముగా వ్రాసి
పాడించుచున్నదీ బరగ తుమ్మెదలతో!

ఆకాశమును గాంచి యలరి తారలతోని
మధుర భావాలతో మాటాడుచున్నదీ!
ఆట నున్న హంసలకు ఆలరి దెలుపుమటంచు
పాలపిట్టలగూడ పంపినది వ్యధ దెలుప!

ఇంతవేదన యందు కొంత! నే మునిగినా!
గొంతులా నాపాట కూర్మి కోకిలగా!

## మనసులోనీ పాట

మనసులోనీ పాట మర్మముగ వ్యథజెందు
మాధవునికై వేడి మక్కువగ బాడుకొను!

పరుల కెవ్వరికినీ పాడి వినిపింపదూ
తనలోనె కృశియించు తన్మయముగా బాడి!

మనసులోనీ పాట మర్మముగ వ్యథ జెందు
మాధవునికై వేడి మక్కువగ బాడుకొను!

చిగురాకులకు వోలె చిత్రమగు పదములను
మల్లెపూ దండగా మాల గ్రుచ్చుచునూ!
మనసులో అచ్యుతుడు మధుర మురళీ ధ్వనుల
ఎదుట నిలిచీ బలుక మది భావనలు సేయు! ॥మనసు॥

ఎవరు లేనీ చోట యేకాంత స్థలమందు
కొండ కోలనయందు కోనేరు దరులందు!
కడిమిచెట్టూనీడ విడని భక్తిని బాడ
గోవిందుడట కొచ్చి కూర్మి వినవలె నంట! ॥మనసు॥

వినిపింప దెవరికిని వీనులకు విందుగా
అలలుగా తెరలుగా అంతరాత్మను బాడ!
మనసు తెరలకు గూడ మర్మముగ దెలుపదూ!
కంటికొనలకు దెలుపు కమ్మనీ తన మనసు

మనసులోనీ పాట మర్మముగ వ్యథజెందు
మాధవునికై వేడి మక్కువగ బాడుకొను!

## రాళ్లు పాటలు బాడె

రాళ్లు పాటలు బాడె రమణీయ స్వరములను
శిల్పి ఉలి నాదాల చిత్రమగు రీతీ!

నా మనసు బాడినది నవ్యగీతము నపుడు
శ్రుతిలయల గలుపుకొని చోద్యమగు శిలవోలె!

రాళ్లపాటలు బాడె రమణీయ స్వరములను
శిల్పి ఉలి నాదాల చిత్రమగు రీతీ!

ఉదయ సంధ్యలలోని యూహలిల జారుచును
జాబిల్లి రేకలను సరసమగు యల్లికల!
హరివిల్లు గగనాన యలరినా విధమునా
నా మనసు బాడినది నవ్యమగు గీతికను! ॥రాళ్ల॥

శిల్పి ఉలి మ్రోతలను చిత్రమగు శిల్పమును
ఉద్భవించిన రీతి యుదయించె నా మదిని!
అందాల పాటయును నవతరించెను దివ్య
చందాల గోపికయు సరసతను కృష్ణుడూ! ॥రాళ్ల॥

కొండలో కొనలో గోపురము వెలసినది
శిల్పిచాతుర్యమున శిలలన్ని శ్రీ జిందె!
ఆశిల్పి నాదముల యలరి నా మది యందు
మధురమగు గీతిగా మాధుర్యమున వెలసె!

రాళ్ళు పాటలు బాడె రమణీయ స్వరములను
శిల్పి ఉలి నాదాల చిత్రమగు రీతీ!

# రిక్తహస్తాలతో

రిక్తహస్తాలతో నిలిచితిని స్వామి! యిట
స్వాగతంబిది స్వామి! స్వాగతంబోయీ!

ఎవరులేనట్టి యీ యేకాంత దేశమున
నడిచిరావోయి! నా నవగీతమును వినగ!

రిక్తహస్తాలతో నిలిచితిని స్వామి! యిట
స్వాగతంబిది స్వామి! స్వాగతంబోయీ!

చివురులను జివురించి పూవులను బుష్పించి,
సెలయేటి జాలులను జలకంబు లాడుచును!
చిలుక గోరింకలను చిత్రమగు పదములను
కోకిలల పాటలను కూర్మి నేర్చెను గీతి! ॥రిక్త॥

బంగారు వీణియను బరువైన స్వరములను
విడిచి వచ్చినదోయి విరిసి నా గుండెలో
పాటబాడుచు కృష్ణ! బరగ బిలుచుచు నిన్ను
లలితగీతములోని లాలించు చున్నదీ! ॥రిక్త॥

మరుభూములను నన్ను మాటాడ కుండగా
చిన్ని కుటియందు నను చిత్రముగ నిలిపినది!
తన పాట పాడగా తగిన స్థలమని దెలిపి
పాడుచున్నది గీతి పరవశము జెందగా!
తరలిపోవుచునుంటి మఱలి చూడక నేను
గీతిమార్గము బట్టి మతి నిలిపి నీయందు!
నను గలిపికొను నీదు మహనీయ వేణువున
అలసటను దీర్చి నన్నాదుకొనుమో స్వామి!

## నువ్వు కావాలనీ!

నువ్వు కావాలనీ నవ్వుచూ బిలుచుచూ!
స్పందించు చుంటినీ! సఖియగా నేనూ!

ముద్దుగోపాల! నా మురిపెమును దీర్చగా
హద్దేల? పద్దేల? యాలస్యమేలా?

నువ్వు కావాలనీ నవ్వుచూ బిలుచుచూ
స్పందించు చుంటినీ! సఖియగా నేనూ!

జన్మజన్మల నాడు జనియించినది కోర్కి
మర్మముగ మనసులో మారుమ్రోగినదీ!
పాడుచుంటిని గీతి! పరవశముగా రోజు
కిన్నెరను మీటుచూ! కీర్తనల నిన్నూ!

ఎంత బిలిచినరావు సుంత దయ లేదుగద!
కాంత దుఃఖమునూన్న కదిలి రావేలనో!
కన్నీరు వరదలై కాలువలు ప్రవహించె
కనిపింపరావుగద! కమనీయ రూపమున!

తరులలో విరులలో దగ మురళి వినిపించు
నల్లనీ శిలలలో నాథ! నీ వున్నటుల!
భావించుచుందునూ బరగ నాహృది యందు
నిజము సేయుము కృష్ణ! నీడగా నీవుండి!

నువ్వు కావాలనీ! నవ్వుచూ బిలుచుచూ!
స్పందించు చుంటినీ! సఖియగా నేనూ!

## రాలినా పువ్వులే

రాలినా పువ్వులే రమ్య హారము నీకు
పిల్లనాగ్రోవియే ప్రీతిగద కృష్ణా!

మురిపాలు బిందవూ?
ముత్యాల హారములు రత్నాల సొబగులును
మోదమున ధరియించి మురిపాలు జిందవూ?

రాలినా పువ్వులే రమ్య హారము నీకు
పిల్లనాగ్రోవియే ప్రీతిగద కృష్ణా!

ఆలమందల గాచి యలరారు చుందువూ
గోపబాలుర తోని గూడి యాడుదువూ!
రాసక్రీడల సలిపి రమ్యవన వీధులను
పులకింప జేసితివి పొలుపుగా గోపికల! ॥రాలినా॥

మానినీ ద్రౌపదిని మహిత శీలము గాచి
శ్రీగీత బోధించి చిందితివి మౌనిగా!
సత్యమును వెలయించి ధర్మమును స్థాపించి
రక్షజేసితివి గద! రమ్యముగ భూతలము! ॥రాలినా॥

మధుర భక్తిని నిన్ను మానసము నందునా
పూజించు చుంటినీ పురుషోత్తమా నిన్ను!
వేణువును నీకిచ్చి వేడ్కన్ పించము బెట్టి
గోపాల యని నిన్ను కోరి పిలుచుచు నుంటి!

రాలినా పువ్వులే రమ్య హారము నీకు
పిల్లనాగ్రోవియే ప్రీతిగద కృష్ణా!

## క్రొత్తగా నేనేమి

క్రొత్తగా నేనేమి కూర్చి దెలుపుట లేదు!
ప్రాతపాటే నేను బాడుచుంటినిగా!

నా పూర్వ పురుషులును నా దేశ బంధువులు
పాడినా పాటలే భక్తి పాడుచునుంటి!

క్రొత్తగా నేనేమి కూర్చి దెలుపుట లేదు!
ప్రాతపాటే నేను బాడుచుంటినిగా!

భగవంతు బూజించి భక్తితో బాడినవి
విరహ వేదనతోన్ని వేడుకను బాడినవి!
ఆ గీతికలను నే నలరి బాడుచు నుంటి
అల గోపకాంతనై ఆడి బాడుచు నుంటి ॥క్రొత్తగా॥

వేదమార్గముల నే విహరింపలేనుగా!
బంగారు పనసలను పఠియింప లేనుగా!
దీర్ఘస్వరాజ్యోతి నూహింప లేనుగా
అందుకే యీ ప్రేమ బంధాల కూర్పులా! ॥క్రొత్తగా॥

అలనాటి గోపికలు ఆడి పాడిన రీతి
ప్రీతితో కృష్ణుపై ప్రేమ నాలికినరీతి!
భక్తిభావముతోని బరువు భారములేక
పాటబాడుచునుంటి పద్మనాభునిపైద!

క్రొత్తగా నేనేమి కూర్చి దెలుపుట లేదు
ప్రాతపాటే నేను బాడుచుంటినిగా!

## కనులలో దొలికేటి

కనులలో దొలికేటి కన్నీటి ధారలే
నీ దయారస మనుచు నిండుగా దలతూ!

మనసులో దొలికేటి మధుర భావములనూ
నీ ప్రేమధారలని నిరవధిక వలపులని!

కనులలో దొలికేటి కన్నీటిధారలే
నీ దయా రసమనుచు నిండుగా దలతూ!

కోకిలల జతగూడి కూర్మి బాడుచునుండ
వనవీధిలో జేరి వయ్యార మొలుకగా!
ఒంటరిగ నీవొచ్చి వలపు కిన్నెర నిచ్చి
కంటి కగుపింపకను కనబడకపోతివీ!

తారలను గాంచుచును దగని యాసక్తితో
ఆకాశ మార్గమును నటు గాంచుచుండగను!
కాలి గజ్జెలనిచ్చి కల్యాణ ధామునీ
పాట నేర్పితివి గద! పరవశము జెందగా!

ఎవరివో ననుకొంటి భావమున తడబడుచు
చిన్నికృష్ణుడవనీ చిత్తమున గననైతి!
ఆటపాటల తోడి అందాల గజ్జియల
కీర్తించుచుంటిని కిన్నెరను రక్తితో

మురళిలో గలుపుకో మోదమున రక్తితో
కలిసిపోదును దివ్య కాంతిలో కాంతినై!
కనులతో దొలికేటి కన్నీటి ధారలే
నీ డయారసమనీ నిండుగా దలతూ!

# మనసులో నుంటావు!

మనసులో నుంటావు! మధురమగు స్పందనల!
మనసువిప్పి నీవు మాటాడ వెందుకో!

కనులలో నుంటావు కంటిపాపకు మల్లె
కనుల ముందూ నిలిచి కనిపింప వేలా!

మనసులో నుంటావు! మధురమగు స్పందనల
మనసు విప్పి నీవు మాటాడ వెందుకో!

అన్ని మఱచీ కృష్ణ! నిన్ను దలచుచు నుంటి!
చిని చిన్ని పలుకులను చిత్రమగు మాలగా!
అర్పించితిని స్వామి! ఆత్మార్పణం బనుచు
చిన్నిచూపును జూడు! చిఱునవ్వు లొలుకుతూ! ॥మనసులో॥

తపియించు చుంటినీ తాపసికి వలె నేను!
పసిపాప తల్లికై పలవరించిన యటుల!
మఱచి తన తావునూ మఱుభూము లందునను
లేడివలె దిరుగుచును నీడగానక నేను! ॥మనసులో॥

చిన్ని కుటి జూపింపు దీరుగా నా కొకటి
చల్లనీ నీడలో స్వామి! నిన్ను దలచుచును!
నే పాట బాడుకొను నిర్మలంబగు మనసు
దయసేయుమో ప్రభూ! దగ నన్ను కరుణించి!

మనసులో నుంటావు! మధురమగు స్పందనల
మనసు విప్పి నీవు మాటాడ వెందుకో!

# నీ మురళి స్వనములను!

నీ మురళి స్వనములను నింపొంది శ్రీకృష్ణ!
నా మనసులో గీతి నాట్యాలు చేస్తోంది!

ఆనంద గ్రంథి యిది! యపురూప బంధమిది
నీకు నాకూ మధ్య నిలిచినా సాక్షిగా!

నీ మురళి స్వనములను నింపొంది శ్రీకృష్ణ
నా మనసులో గీతి నాట్యాలు చేస్తోంది!

ఆర్ద్రభావముతోని యందించినా మురళి
నాదాల నందుకొని నా మనసు పులకించి!
చిని చిన్ని పదములను చిన్నారి రాగముల
మధుర గీతము లల్ల మధురిమలు నేర్పింది! ॥నీ మురళి॥

చిఱుగజ్జియల్ల తోని చిన్నారి పాదముల
నాట్యాలు చేస్తోంది! నవరాగ సంధ్యగా!
తేనె లొలికే పాట తీయగా బాడుతూ
మురిపించు చున్నదీ ముద్దుగా శ్రీకృష్ణ! ॥నీ మురళి॥

నీకు నాకును మధ్య నిల్చినా బంధమిది
జన్మ జన్మలకయిన విడిపోని స్నేహమిది!
సతినైన నాకు నొక సుతను జేకూర్చితివి!
మన రాగ బంధముల మధుర ఫల మిదిగాద?

నీ మురళి స్వనములను నింపొంది పెంపొంది
నా మనసులో గీతి నాట్యాలు జేస్తోంది!

## వెలుగులన్నీ మాసి

వెలుగులన్నీ మాసి వేడుకలు ముగిసినవి
చైతన్య యాత్రలో చరమ దశ యరుదెంచె!

దారి తెలియక నేను తలడిల్లు వేళ యిక
యరుగు దెంచె నటంచు నలరి దలచితినీ!

వెలుగులన్నీ మాసి వేడుకలు ముగిసినవి
చైతన్య యాత్రలుగ చరమదశ యరుదెంచె!

నిర్జీవ శక్తులవి నిలిచెనని బ్రతుకులో
భావించితిని మదిని బన్నుగా స్వామీ!
దారి మూసుకు పోయి దరిలేని చీకటిని
మ్రగ్గవలెనని నేను మదిని దలచితినీ! ॥వెలుగు॥

కాని నీ భావాలు గడు విచిత్రము గదా!
చిగురు పూవులు మరల జెలగుచున్నవి మదిని!
పాత పాటలు హృదిని బరగ మాయక ముందె!
క్రొత్త పాటలు వెడలె క్రొంగ్రొత్త రాగాల! ॥వెలుగు॥

నా హృదిని వెలిగించి నా నోట పాడించి
విన వలయునని నీకు విమల కోరిక యేమొ!
శిశిరమంతా మాసి చెలగి వాసంతమును
కనుల ముందర నిలిచె కమ్మనీ శోభలను! ॥వెలుగు॥

మరల కోకిల పాట మాధుర్యములు విరిసె
ప్రకృతి సౌందర్యాలు ప్రభవించె కనులలో!
మరల నీ నర్తనలు మనసులో గోపాల!
మురిపాలు చిందుచును ముదము గూర్చుచునుండె! ॥వెలుగు॥

## నా దీర్ఘ యాత్ర యిక

నా దీర్ఘ యాత్ర యిక నడువలే ననుచు మది
ఆశలన్నీ వొదిలి యడలు సమయమునా!

మఱల జవమును నిచ్చి మాధుర్యమును నిచ్చి
కనులలో నింపితివి కాంతులను మఱలా!

నా దీర్ఘ యాత్ర యిక నడువలే ననుచు మది
ఆశలన్నీ వొదిలి యడలు సమయమునా?

తీయనీ గీతముల జేర్చి పాడగ యింక
శక్తి లేదనుచు నే రక్తి విడిచితినీ!
మఱల హేనాథ! నా మనసు పొరలందునను
తీయనీ రాగాలు జేర్చితివి యేలా? ॥నా దీర్ఘ॥

అల తుమ్మెదకు వోలె యాడినా యాటలను
మఱు జన్మకే ననుచు మదిని దలచితినీ!
మఱల దయజేసితివి మధురగీతిక తోని
నీ యెదుట బాడగా నిఖిలేశ నాట్యాలు! ॥నా దీర్ఘ॥

మురళి పాటను వినుచు ముగ్ధనై రాధనై
తేలిపోవుచు నుంటి తెర వెనుక మధురిమల!
మఱల గాంచుచు నుంటి మధురాతి ప్రకృతిని
చిన్ని గోపాల నీ చిన్నారి సొగసులను! ॥నా దీర్ఘ॥

దారి తప్పిన నాదు దయనీయ స్థితి యందు
బాటజూపితివి మఱి పయనింప జేసితివి!
రంగు రంగుల పూల రమణీయ వనవీధి
నను నిలిపితివి స్వామి నాథ! నిను పూజింప! ॥నా దీర్ఘ॥

## మృత్యుమాతా! నిలువు!

మృత్యు మాతా! నిలువు! మోదమున కొన్నాళ్ళు
అలరి పిలువకు నీదు ఆనంద కౌగిలిని!

కృష్ణభక్తిని గూడి నిష్ఠతో నుంటినీ
విమలగీతిని మదిని విమలముగ బాడుచును!

మృత్యు మాతా! నిలువు! మోదమున కొన్నాళ్ళు
అలరి బిలువకు నీదు ఆనంద కౌగిలిని!

కాటుకల జీకటుల గడకు బా పెదవనుచు
మది కష్టముల నన్ని మా పెదవు నని దెలియు!
శాంతిగూర్చెడి దాన వని దెలియు నమ్మరో
కాంతి ప్రదాయివని గూడ నే నెఱుగుదును!

చిన్ని కృష్ణుని నేను జిగురాకు బూవులను
విరహ గీతంబులను విరచించి పూజించి
మాధవుని దర్శింప మది గుందుచుంటినీ
కొన్నాళ్ళ తరువాత గోరి వచ్చెదవమ్మ!

మాధవుని చింతలో మది బొగులుచుంటినీ
నీ శాంతి కంటె యది నిర్మలంబని దలతు
విరహ గోపికనుగా విలపించు చుండుచే
అలరు నా మది గోర్కె! అమ్మరో! నీ యిచ్చ!

మృత్యు మాతా! నిలువు మోదమున కొన్నాళ్ళు
అలరి పిలువకు నీదు ఆనంద కౌగిలిని!

## మృత్యు గీతము

మృత్యు గీతము నోట మోదమున బాడగా
సమయ మేతెంచెనని సఖియ దలచితినీ!

నా జీవ శక్తియును నవశక్తి బలములను
నాతి! ముగిసిన వనుచు నయముగా దలచితిని!

మృత్యు గీతము నోట మోదమున బాడగా
సమయ మేతెంచెనని సఖియ! దలచితినీ!

తీయనీ రాగాల తీపి కథ ముగిసెనని
ముళ్ల కంపల ముదిమి మోదముగ వచ్చెనని!
శక్తియుక్తులు దగ్గి జేతికఱ్ఱయు మిగిలి
మౌనగీతము బాడ మదియందు దలచితిని! ॥మృత్యు॥

అద్భుతంబులుగాద యావిష్ణు చిత్రములు
మఱల జవసత్త్వములు మానుగా నిచ్చెనే!
అరవిందములు బూచె యద్భుతము మదియందు
కలువ బూవులు బూచె! కమనీయముగ హృదిని! ॥మృత్యు॥

క్రొత్తపాటలు విరిసె కూర్మితో గుండెలో
మధురాక్షరములతో మాణిక్యముల వరుస!
మఱల నను బాడింప మధుర గీతాలనూ
అతని మది గోర్కెయని యతివ! భావింతు నే

మృత్యుగీతము నోట మోదమున బాడగా
సమయ మేతెంచెనని సఖియ! దలచితినీ!

## ఒక్క పాట

ఒక్క పాట! ఒక్క పాట!
చక్కనైన ఒక్క పాట!

పాడింపుము నా నోటను
పరవశింప ప్రకృతి యంత!

ఒక్క పాట! ఒక్క పాట!
చక్కనైన ఒక్కపాట!

నీమురళీ స్వనములలో
నిండయినది నీటయినది!
నా నోటను బలికింపుము
నవగీతిక యనునటులను! ॥ఒక్క॥

జగముల నూగించు దాని
జాగృతి గలిగింతు దాని
ప్రకృతిలో సుందరమయి
ప్రజలనోట నిలుచుదాని! ॥ఒక్క॥

అంబరమున తారవోలె
అలరు చందమామ విధము!
చల్లగాలి తెరల వోలె
ఉల్లము పులకించు దాని

సత్యము శివసుందరములు
సమత మమత తొలుకుదాని!
గమ్యమునకు దారి జూపు
కాంక్ష దీర్చు దాని నొకటి!

## దూరాన కోకిలా

దూరాన కోకిలా తోరంపు పాటలూ
నిను బిలుచుచున్నవి నిర్మలానందమున!

అల మయూరము గూడ యందాల నృత్యముల
యలరుచున్నది కృష్ణ! అందాల వనవీధి!

దూరాన కోకిలా తోరంపు పాటలూ
నిను బిలుచుచున్నవి నిర్మలానందమున!

ఉదయసంధ్యలు తూర్పు విరజిమ్మి కుంకుమలు
విశ్వమంతా విరిసె విరజిమ్మె యరుణిమలు!
మంచు బిందువులలో పంచినా ముఖములను
తమ రూపు జూచుకొని తన్మయము నగుచుండె ॥దూరాన॥

రామచిలుకలు గూడ రమ్యముగ నెగురుచూ
రామరామా యనుచు రవలు సేయుచు నుండె!
నీటిపక్షులు గూడ నెలవంక జారగా
తారలను లెక్కించి తగ బలుకుచును నుండె! ॥దూరాన॥

పరమపావన! నిన్ను పవలు రాత్రులు గూడ
బిలుచుచుంటిని స్వామి! దలచుచును మదియందు
మాటాడు చుండెదవు! మధురముగ మదియందు
కంటికందవు గదా! కమనీయ రూపమున! ॥దూరాన॥

ఈ మాట లెన్నాళ్ళు? యీ పాట లెన్నాళ్ళు?
సంతలో యెన్నాళ్ళు? సరసతను యగుబడుట?
కలిసి పయనించుటది కలలోని కథకువలె
అంతు జిక్కదు కృష్ణ! అది యేమి మాయయో! ॥దూరాన॥

## కలలలో గనిపించి

కలలలో గనిపించి కలత సేయకు స్వామి
కలిసి మాటాడుమా! కమ్మనీ ప్రేమా!

రాలేటి పూవునూ! రమణీయ వనమునను
అందుకో హస్తమున చందమున కృష్ణా!

కలలలో కనిపించి కలత సేయకుమయ్యా
కలిసి మాటాడుమా! కమ్మనీ ప్రేమా!

పగలంత రవిరశ్మి బరగ తాపమునందు
బాడుచుంటిని స్వామి! ప్రార్థనల తోనీ!
చల్లనీ వెన్నెలల మెల్లనీ రాగముల
నిన్ను వేడుచునుందు సన్నుతుల తోనీ! ॥కలలలో॥

చైత్రమది ముకుళించె చైతన్యమును మానె
మబ్బు తెరలను జగతి మాటు మణిగినదీ!
ఆషాఢ మేఘమును యలరె నా హృదయమును
బరువుగా దోచినది బాధ యనిపించే! ॥కలలలో॥

వర్ష జల బిందువులు వన్నెలను జిందుచును
కన్నీటి పువ్వులను గలిసి ప్రవహించినవి!
వానకోకిలగూడ వసర కన్నీటితో
జలజలా రాల్చుచును జాలిగా బాడినది! ॥కలలలో॥

ధాత్రి ధూళిని రాలి దగ బడక ముందుగనె
హస్తమున గ్రహియించి యలరించుకో స్వామి!
నా పూజ సఫలమై నా గీతి ధన్యమై
నిన్నందుకోగలను నిర్మలానందమున! ॥కలలలో॥

## వికసించెను నా మదిలో

వికసించెను నా మదిలో వేయివేయి తామరలూ!
మధురమైన వాసనలను మాధుర్యము జిందునటుల!
వికసించెను నా మదిలో వేయివేయి తామరలూ!

విమలమైన మధురగీతి
వినువీధుల బాడుకొనుచు!
దిరుగుచుందు నిను వేడుచు
వెదుకుచుందు మోరనెత్తి!

వికసించెను నా మదిలో వేయివేయి తామరలూ!
మధురమైన వాసనలను మాధుర్యము జిందునటుల!

కొండలలో కోనలలో
కూర్మి మధుర గీతములను
సెలయేఱుల సవ్వడులను
జేర్చి గొంతు స్వరములనూ

వికసించెను నా మదిలో వేయి వేయి తామరలూ!
మధురమైన వాసనలను మాధుర్యము జిందునటుల

సీతకోక చిలుక వలెను
జేరి పువ్వు పువ్వు నందు!
మర్మముగా నాదు మాట
మధురముగా దెలుపుచుందు!

వికసించెను నా మదిలో వేయి వేయి తామరలూ!
మధురమైన వాసనలను మాధుర్యము జిందునటుల!
వికసించెను నా మదిలో వేయి వేయి తామరలూ!

## మనసున దయదలచి కృష్ణ!

మనసున దయదలచి కృష్ణ! మాధుర్యము జిందవోయి!
అడుగు దామరలను నన్ను నలసి గాంచనిమ్ము కృష్ణ!
మనసున దయదలచి కృష్ణ! మాధుర్యము జిందవోయి?

నీ వెనుకను వచ్చుచుంటి!
నీరధి గలిసే నదివలె!
అలల గలియనిమ్ము కృష్ణ!
అంతులేని వారాసిని!

మనసున దయదలచి కృష్ణ! మాధుర్యము జిందవోయి!
అడుగు దామరలను నన్ను నరసి గాంచనిమ్ము కృష్ణ!

పడమటి సూర్యునికి వోలె
బరుగెత్తుచు నుంటి వేమి?
నిలిచి నన్ను జూడుమోయి!
నిర్మలముగ దయను దలచి!

మనసున దయ దలచి కృష్ణ! మాధుర్యము జిందవోయి
అడుగు దామరలను నన్ను నలసి గాంచనిమ్ము కృష్ణ!

అంతులేని యాత్ర యిటుల
యలసి వచ్చుచుంటి నేను!
కనుమఱుగై పోబోకుము!
కామితమును దీర్పవోయి!

మనసున దయదలచి కృష్ణ! మాధుర్యము జిందవోయి!
అడుగు దామరలను నన్ను నలసి గాంచనిమ్ము కృష్ణ!

## ప్రేమతో బిలిచినా

ప్రేమతో బిలిచినా పిలుపులన్నీ గూడ
గాలిలో గలిసెనని కలత జెందితినీ!

విభు డింక రాడనీ వెతనంది మదియందు
యారాట బడుచుంటి యది యేమి చిత్రమో!

ప్రేమతో బిలిచినా పిలుపులన్నీ గూడ
గాలిలో గలిసెనని కలత జెందితినీ!

అల విభుని భావాలు నంతుబట్టవు చెలియ!
వికసింప జేయునే! వెన్నెలల కుసుమాలు!
ఆశలను జిగురించి యందాల గురిపించి
కోకిలా పాటలా కూర్మి చిందులువేయు! ॥ప్రేమతో॥

క్రొత్త రాగాలతో క్రొత్తపాటలు విరియు
మనసులో పొంగునే మహనీయ భావాలు!
చీమలా బారులా సెలయేటి జాలులా
ఉయ్యాల లూగించు సయ్యాట లాడించు! ॥ప్రేమతో॥

మధురమౌ శ్రుతిలయల మనసులో బాడించు
సరిక్రొత్త గీతమును సరసతను వెలయించు!
గొంతెత్తి పాడమని కోరి తన మురళినీ
ముందుగా బాడునే మోదమున చెలికాడు!

ప్రేమతో పిలిచినా పిలుపులన్నీ గూడ
గాలిలో కలిసెనని కలత జెందితినీ!

## కోకిలకు వలె

కోకిలకువలె నాకు గూడన్నదియు లేదు
నీలి మబ్బునకు వలె నిలకడయు లేదు!

అలకువలె ఒకచోట నిలుచుటయు లేదు గద!
జగమంత దిరుగుచును వగజెందు చుంటినీ!

కోకిలకువలె నాకు గూడన్నదియు లేదు
నీలిమబ్బునకు వలె నిలకడయులేదూ!

చెట్టు చేమలయందు చింతనల దిరుగుచును
పాడుచుంటిని కృష్ణ! ప్రవిమలంబగు గీతి!
నీ పాదములచెంత నిబస్థావరము నిచ్చి
నిలువనీయవుగదా! నీవైన దయ దలచి! ॥కో॥

ఆధారమునులేక యందందు తిరుగుచును
దిక్కులను దిరుగుచును దిశల బోవుచునూ!
నీడగా నీపైని నిలువ నీయవు గదా!
నల్లనీ మబ్బులని నవ్వగా జగమంత! ॥కో॥

అలవోలె కొండలను తగిలి తుంపురులుగా
చిదికి పోవుచునుంటి చిన్నారి తెరగూడ
పయనించి భూమిపై బడి యింకిపోవుదును
కడలేని కథవోలె తుదిలేని గీతివలె!

కన్నీరునకు గూడ కడయన్నదియు లేదు
బాటసారిగ నేను పథముజేరుట లేదు!
చేతిలో కిన్నెరే చిరకాల సఖి యనుచు
అంతరంగము గీతి! అది ప్రాణముని దలతు!

## ఎన్నాళ్ళు యీభక్తి?

ఎన్నాళ్ళు యీభక్తి? యెన్నాళ్ళు యీగీతి?
సన్నుతించుచు కృష్ణ! విన్నపము దెలిపి!

నదులు దారులుమారె! నవ పథము లేర్పడియె!
మల్లె పూదలు గూడ మఱ్ఱి వృక్షములాయె!

ఎన్నాళ్ళు యీభక్తి? యెన్నాళ్ళు యీగీతి?
సన్నుతించుచు కృష్ణ? విన్నపము దెలిపి!

పెంచినా చిఱుమల్లె కంచెగా మారినది
పుష్పించుచున్నదీ పున్నమీ వెలుగుగా!
కొలను ప్రక్కనయున్న కుదురుగా కడిమియును
భాసిల్లు చున్నదీ పరిపూర్ణ కాంతులను ॥ఎ॥

వరదలో దరికొచ్చి వగజెందు చిలుకనూ!
రక్షించి వృక్షమున రమ్యముగ నుంచితిని
గూడొకటి కట్టుకొని కుదురుగా ప్రియునితో
సంతాన గరిమతో సౌఖ్యముగ నుండెనూ! ॥ఎ॥

సెలయేటి జాలులో కదిలినా రాళ్ళన్ని
గుండ్రాళ్ళవలె దొరలి కుదురుగా బొమ్మలై
చిఱుచేపలన్నియును జెలగి యా శిలలతో
బొమ్మలా పెళ్ళిళ్ళు బొసగ జేయుచు నుండె!

దయలేని నీవు నను దయగలిగి యుండుమని
మోయమని జీవితము మొరటుగా నిచ్చితివి!
అంతులేనీ యాత్ర నరయజేయగ లేను!
చింతతో కిన్నెరను వంతె జెందగ లేను!

## మంచుపొగలకు వోలె

మంచుపొగలకు వోలె మదిని వ్యాపించినా
చింతలను దొలగించు అంతరంగమునా!

నావలెను జగమంత నళినాక్ష! రోదనల
వేదనా భాష్పముల వెదజల్లు చున్నదీ!

మంచుపొగలకు వోలె మదిని వ్యాపించినా
చింతలను దొలగించు అంతరంగమునా!

కలువ తామరలునూ కలత నొందుమ మదిని
కన్నీటి ముత్యాలు వెన్నెలను ధరియించి!
ఎదురు జూచుచునుండె వేడుకను మోమెత్తి
నీయందు మిళితమై నిండుకాంతులు జింద ॥మంచు॥

కొండలును బండలును కూర్మితో రోదించి
నిండారు నశ్రువులు నీరుగా జారుచును!
సెలయేఱుగా మారె విలపించుచును మదిని
కిన్నెరల ధ్వనులవలె మన్ననల జేయుచును ॥మంచు॥

చిలుక గోరింకలును జిన్నారి తుమ్మెదలు
విరహ జ్వాలలతోని వేదనల జిందుచును!
నిను బిలుచుచున్నవీ నిండారు గొంతుతో
భవబంధముల బాపి బన్నుగా బ్రోవమని!

ప్రకృతి వలె నే గూడ పరవశించుచు మదిని
విరహగీతిక తోని విపులమగు వ్యథతోని
పాటపాడుచునుంటి బన్నుగా జగతితో
ఆగపడుము ప్రేమతో ఆర్తులను గాపాడు!

## కొండ వాగుగ మారి

కొండ వాగుగ మారి కోరికను జాలుగా
బండలపై దూకి ప్రవహించుచుంటి!
  నీ పాదముల గడిగి నీచుట్టు దిరుగుచును
  పాడుచుంటిని గీతి భవ్యమగు ధ్వనులా!

కొండవాగుగ మారి కోరికను జాలుగా
బండలపై దూకి ప్రవహించు చుంటి!

గిరిపైని వెలసినా గోపబాలక! నిన్ను
పూజించు చుంటినీ! పురుషోత్తమా! భక్తి
రాలినా పూలన్ని రమణీయముగ దెచ్చి
నీ పాద సన్నిధిని నిలుపుచుంటినిగా! ॥కొండ॥

కదిలేటి శిలలనూ గలిగేటి మృదుధ్వనుల
మధుర మృదంగాలు మారుమ్రోగిన యటుల!
పరుగెత్తు సెలయేటి పాటలే మాటలుగ
విన్నవించుచు నుంటి విమల గీతముగా! ॥కొండ॥

బహుదూర యుదధికిని బన్నుగా బోవలెను
మంచు ముత్యాలనూ మాణిక్యములను మఱి
మాలగాజేసి నీ మధురమగు కంఠమున
హారముగ అర్పించి అలరి తరియింపగా!

కొండవాగుగ మారి కోరికను జాలుగా
బండలపై దూకి ప్రవహించు చుంటి!

## పరుల యాచింపనూ

పరుల యాచింపనూ బన్నుగా చేజాచి
నినుదప్ప జగతిలో నిర్మలంబగు భక్తి!

అంతరంగమునందు జింతనలు జేయుదును
మధురమగు గీతముల మన్నింప మనుచునూ

పరుల యాచింపనూ బన్నుగా చేజాచి
నినుదప్ప జగతిలో నిర్మలంబగు భక్తి!

కోనలో కోకిలను కూర్మి యాచింపనూ
మధురమగు రాగాం మనసు దయసేయమని
చిలుకలను యాచింప చిఱునగవు జిందుచును
చతురమగు పలుకులను చాతుర్య మీయమని ॥పరుల॥

కలువ తామరపూల కలతలను యాచింప
కన్నీటి ముత్యాల కాంక్షతో నీయమని!
దరులందు నిలిచినా కడిమిచెట్టును గూడ
మురిపాల అందాలు ముద్దుగా నివ్వమని! ॥పరుల॥

పరుల పాటలు బాడ బన్నుగా నావనుచు
ధ్వనియింపలేనుగా ధన్యమగు కిన్నెరను!
సుడులు దిరిగే నాద ముడులుగా ధ్వనియించు
మధురాక్షరంబులే మర్మమగు నా గీతి!

పరుల యాచింపను బన్నుగా చేజాచి
నినుదప్ప జగతిలో నిర్మలంబగు భక్తి!

## హంస గానముతోని

హంసగానముతోని అలరు ముత్తెపు దండ
పదములన్నియు జెదిరె బరగ నీరమునా!

దండతెగి ముత్యాలు బండపై బడినటుల
చెదిరిపోయెను. కృష్ణ! మది గానరాకుండ!

హంసగానము తోని అలరు ముత్తెపు దండ
పదములన్నియు జెదిరె బరగ నీరమునా!

చిఱుచేప కన్నియలు చిన్నారి బేడిసలు
కొన్ని ముత్తియములను కూర్మితో మ్రింగినవి!
కొన్ని ముత్తియములనూ కోర్కెతో బండలను
చిన్ని బొరియల దాచె వన్నె జల పక్షులును! ॥హంస॥

హంస అందింపగా అల దండ ముత్యాల
చిలుక గోరింకలును చిని పాల పిట్టలును!
మురిపాల ముత్యాల మురిపముగ గొనిపోయి
తమ గూళ్ళలో దాచె తన్మయము జెందుచును! ॥హంస॥

నీతోని జతగూడి నింగిపై కొచ్చుటయు
చెలుల కిష్టముకాదొ! కష్టమో శ్రీకృష్ణ!
హంసగానముతోని యలరు ముత్తెపుదండ!
త్రెంపినవి దండనూ చెదరగా ముత్యాలు!

హంసగానముతోని యలరు ముత్తెపు దండ!
పదములన్నియు జెదిరె బరగ నీరమునా!

## కోకిలకు వలె నాకు

కోకిలకువలె నాకు గూడన్నదియు లేదు
నీలిమబ్బునకు వలె నిలికడయు లేదూ!

ఆలకువలె ఒకచోట నిలుచుటయు లేదుగద!
జగమంత దిరుగుచును వగ జెందుచుంటినీ!

కోకిలకువలె నాకు గూడన్నదియు లేదు
నీలిమబ్బునకు వలె నిలికడయు లేదూ!

చెట్టు చేమలయందు జింతనల దిరుగుచును
బాడుచుంటిని నిన్ను ప్రవిమలమగు గీతి!
నీ పాదముల చెంత నిజ స్థావరం బిచ్చి
నిలువనీయవుగదా! నీవైన దయ దలచి ॥కో॥

ఆధారమును లేక యందందు దిరుగుచును
దిక్కులను దిరుగుచును దిశల బోవుచునుంటి!
నీడగా నీ దాపు నిలువనీయవు గదా!
నల్లనీ మబ్బులను నవ్వగా జగమంత! ॥కో॥

అలవోలె బండలను తగిలి తుంపురులుగా
చిదికి పోవుచునుంటి చిన్నారి తుంపురుల
పయనించి భూమిపై బడి యింకి పోవుదును
కడలేని కథవోలె తుదిలేని గీతిగా!

బాటసారిగ నేను పథము జేరుట లేదు
కన్నీరునకుగూడ కడయన్నదియు లేదు
చేతిలో కిన్నెరే చిరకాల సఖి యనుచు
శాంతి నిచ్చెడిదనుచు అంతరంగము గీతి!

## ఈ కొండ కోనలను

ఈ కొండ కోనలను యీయేటి సవ్వడుల
యెదురుజూచుచునుందు యీచిన్ని కుటిలో!

కిన్నెరను మీటుచును కీర్తనను బాడుచును
రాత్రిబవళులు నీదు రాకకై కనుగొందు!

ఈకొండ కోనలను యీయేటి సవ్వడుల
యెదురు జూచుచునుందు యీచిన్ని కుటిలో!

నీవార్తలను దెలుప నిలిపితిని గగనమున
రాజహంసల నీదు రమ్య జాడలనూ!
భూమిపై నిలిపితిని బొలుపుగా జింకలను
నీరాజము నీయ నిండుగా పూజింప! ॥ఈకొండ॥

కోనేరు అందుగల కూర్మి తుమ్మెదలనూ
కోనంత దిరుగగా కూర్మి కట్టడిజేసి!
ఆకాశమందునా అలరి హరి విల్లునూ
నిలిపితిని దెలుపగా నీరాక జాడలను! ॥ఈకొండ॥

ఒకనాడు నాజాడ యరసి వచ్చెద వీవు
మురళిలో మోదమున ముద్దుగా గలిపేవు!
జన్మజన్మలనాటి బంధములు ద్రెంపేవు!
మనసుతోనీ కోర్కె మధురముగ దీర్చేవు!

ఈ కొండకోనలను యీ యేటి సవ్వడుల
యెదురుజూచుచు నుండు యీ చిన్ని కుటిలో!

## మనసులో నాపాట

మనసులో నాపాట మౌనముగ రోదించు
కోనలో ఒంటరిగ కోర్కె తలపోసి!

పరులకెప్పరిరినీ పలికి పిలిచీ తనదు
హృదయ వేదన యంత పదిలముగ దెలుపదూ!

మనసులో నా పాట మౌనముగ రోదించు
కోనలో ఒంటరిగ కోర్కె దలపోసి!

మురళిలో గలియగా మోహమును విడలేక
నిలుచుచును నీడలో విలుపకను బరుగెత్తి!
కడిమిచెట్లును గాంచి కానకను నిన్నచట
కోనలకు దాబోవు కోనేరు దిలకింప! ॥మనసులో॥

తూలేటి తుమ్మెదల తొలిసంధ్య కాంతులను
మబ్బులో తిరిగేటి మబ్బి రాజహంసలను!
ప్రశ్నించు నినుగూర్చి ప్రేమతో జాడలమ
తన మదిని తాపమును తన్మయమున దెలిపి! ॥మనసులో॥

కొండ వాగులయందు కోనేటి దరులందు
పూపొదల యందువను పొలుపుగా వెన్నెలల
ఇసుక నేలల యందు నింపుగా ఒంటరిగ
కలువ కాడను వ్రాయు గలవ్యథను పాటగా!

మనసులో నాపాట మౌనముగ రోదించు
కోనలో ఒంటరిగ కోర్కె దలపోసి!

## మనసులో దెలుపదూ!

మనసుతో దెలుపదూ! మౌనముగ నాపాట
కన్నులకు వినిపించు కలత నంతటినీ!

కృష్ణభక్తిని తాను క్షమిలుచున్నాననీ
వేదనను దెలుపు దన విరహ మంతయుగూడ!

మనసుతో చెలుపదూ! మౌనముగ నాపాట
కన్నులకు వినిపించు కలక నంతటినీ!

తన ప్రేమ నంతయూ తాముందు కృష్ణుడూ
వలపించి తనను దా వన్నెలను దెలిపెవని!
పాటబాడగ గోపికవనితనై ముగ్ధనై
యతని జాడల నరసి యరుగుచున్నాననీ! ॥మ॥

పాటతో బాటుగ బయనించు చుంటినీ!
కొండ కోనల నన్ని కూర్మితో నను ద్రిప్పె!
కలువ తామరలుండు గల తావులకు వేగ
కోకిలలు నివసించు కూర్చి మావుల ద్రిప్పె! ॥మ॥

తిరుగుచుంటిని గాని దీరుగా కృష్ణుడూ!
అంజలిని గ్రహియించి యాదుకొనడే సఖీ!
అతని విరహముజేత అలత కలతల జెంది
కన్నులకు జెప్పుకొను గలవేద నంతయును!

పాటలో రాగాలు బద్ధలై పోయినవి!
పాటలో పదములును పరుగెత్తి పోయినవి!
పాటలో భావాలు మీటినా దీవెలును
తేనెటీగలగుంపు చెదిరినటు తుట్టెలో!

## వినుతించి వినుతించి

వినుతించి వినుతించి విమలమైనా మనసు
రాయిగా మారినది తమ్య శిల్పముగా!

ఎదురు చూచుచునుండి మదినింద వేదనను
కుటినుంటి గోపాల! కూర్మి నీ రాకకై!

వినుతించి వినుతించి విమలమైనా మనసు!
రాయిగా మారినది రమ్య శిల్పముగా!

కఠినజ్వాలల తోని కాఱడవి మండినటు
మండిపోదెందుకో మాటుమణిగుండునూ!
రాజుకొను చుండెపుడు రవరవల గుండెలను
నిప్పుసెగలను గూడి నిగనిగల వేడిమిని! ॥విను॥

సెలయేటి జాలుగా అలలతో ప్రవహించి
శిలలతో జిందుచును జెదిరిపోవదు నేల!
కదలనీ కోనేరు మెదలనీ నీటివలె
కన్నులను విరహమును కలిసి యుండును నెపుడు ॥విను॥

నిప్పులా కుంపటిగ నిగనిగల సెగలతో
నిలిచియుండును నెపుడు మెండుగా గుండెలో!
గంగలా తొలుకదూ! కన్నీరు ప్రవహించి
నిలిచియుండును నెపుడు నిండు కోనేరువలె!

నిప్పులా కుంపటిగ నిగనిగల సెగలతో
నిండియుండును నెప్పుడు మెండుగా గుండెలో

## కన్నీటి వానలో

కన్నీటివానలో కదులుచున్నవి శిలలు!
సెలయేటితో బాటు జారుచును గిరినీ!

మబ్బులేని వాన మఱియెచటి నుండనుచు
వనమయూరములన్ని వడి పొదల నిలిచినవి!

కన్నీటివానలో కదులుచున్నవి శిలలు
సెలయేటితోబాటు జారుచును గిరినీ!

దరులునిండీ కొలను దన నీరు దొలుకుచును
పల్లమగు భూములకు బయనించు చుండే!
కలువతామరలునూ దగ మునిగి పోయినవి
నీటిపక్షులు తరుల నిలిచినవి కొమ్మలను! ॥కన్నీటి॥

చిఱు జేపలన్నియును చిత్రముగ పైకెగిరి
ముత్తెముల సొగసులను మురిపెముగ జూపించె!
నీటిలో మునుగుచును నిలిచె తామరలపై
క్రీడించుచున్నవి కన్నెరలవలె కృష్ణ! ॥కన్నీటి॥

కఠిన సర్పములునూ కానలో గల పులులు
ఎదురుపొదలను దాగె మది భీతి నొందుచును!
కన్నీటితో గిరులు తరులన్ని తడిసినా
వెన్నెలగ నీ కరుణ నన్నుగా రాదు గద!

కన్నీటివానలో కదులుచున్నవి శిలలు
సెలయేటితో జాటు జారుచును గిరినీ!

# వెన్నెల సొగసులో

వెన్నెల సొగసులో యేటిపై పడవలో
పయనించుచుంటినీ బరగ ఒంటరిగా!

ఆలలలో తెరలలో అటుబోయి నిటుబోయి
ఒకచోట నిలువకను యొనర బేడిస వోలె!

వెన్నెల సొగసులో యేటిపై పడవలో
పయనించు చుంటినీ బరగ యొంటరిగా!

పడవ నడిపేవాడు బరగ లేనే లేడు!
చుక్కాని తెరచాప సూటిగా లేవూ!
గమ్యమన్నది లేదు గగనాన చుక్కలను
చంటురుని గాంచుచును అందమగు గీతితో! ॥వె॥

ఉదయ కాంతులు విరిసె ఉదయాద్రి కుంకుమల
పడవ దరికిని జేరె బరగ ఒక గ్రామమున!
ప్రజలడుగ యెవరివని బన్నుగా బ్రశ్నింప
హరిదాసి నను చు నే నలరి దెలిపితినీ! ॥వె॥

హరి యెచట? యేడి? యని యలరి ప్రజ ప్రశ్నింప
మనసులో నుండెనని మారు బలికితినీ!
ఏ పల్లె? యే వూరు? యెవరివని ప్రశ్నింప
లోకమంతయు నాది! లోతుగా యోచింప
అందఱీ వాడనని అలరి బలికితినీ! ॥వె॥

ఎట బోవుచుంటివని యని వారు బ్రశ్నింప
గొంతు సవరించుకుని కూర్మి బలికితినీ!
దుఃఖితులు వేదనను మరపిల్లు వారలను
ఓదార్చి కన్నీరు నొనర దుడుచుటకనీ!

## మనసులో నా పాట

మనసులో నా పాట మాటిమాటికి కదిలి
మాధవుని కొలకునై మథనపడి రొదలా!

నీలి గగనమునందు నిలిపి తన చూపులను
వర్షధారల వోలె వగజెందు కన్నీట!

మనసులో నా పాట మాటిమాటికి కదిలి
మాధవుని కొలకునై మథనపడి రొదలా!

దూరముగ వనరేఖ దోరముగ గనుచుండు
గిరుల దారులు జూచు గగనాన చుక్కలను!
ఏ దారి మాధవుడు నిటకొచ్చునో యనుచు
బది దిక్కులను బలపు బరగ తన కన్నులను! ॥మనసులో॥

మంచుపొగ బయలులో మటికొండ శిఖరముల
కోనేరు దరులందు కూడి నిలుచును తాను!
అలచి యలచీ పిలుచు నాదరము జూపమని
పిలిచి పిలిచీ గీతి ప్రేమతో రమ్మనీ! ॥మనసులో॥

గొంతు నిలుపదుగదా! కూర్మి యొక నిముసమును
పాటనాపదు గదా! పరవశంబగు నెపుడు!
ఆపలే నో పాట! అలరి బొమ్మెటకైన
కొండలకు కోనలకు కూర్మి సెలయేఋలకు!

మనసులో నా పాట మాటిమాటికి కదిలి
మాధవుని కొలకునై మథనబడు, రొదలా॥

## ఆలయంబున నున్న

ఆలయంబున నున్న అందాల గోపాల!
ఏ విధిని పూజించి యెటుల యర్చింతూ?

శిలనున్న ని న్నెటుల చిత్రముగ మాటాడి
మురళి నూదు మటంచు ముద్దుగా దెలుపనూ?

ఆలయమున నున్న అందాల గోపాల!
ఏ విధిని పూజించి యెటుల యర్చింతూ?

వనవీధిలో నున్న వన్నెలా పూలతల
పూవులను గొనితెచ్చి పూనికను మాలగా!
జేర్చి నీ హృదయాన గూర్పజాలను కృష్ణ!
తుమ్మెదలు నంటినవి! తోరముగ యెంగిలిని
ఎటుల మాలను గూర్చి నింపుగా దెచ్చేదను? ||ఆల||

గల గలా బారేటి సెలయేటి జలములను
బంగారు కలశమున బన్నుగా తేలేను!
చేపలంటినవి గద! శ్రీ బాల గోపాల!
ఎటుల నీ కర్ఘ్యమును వేడుకను దేగలను? ||ఆల||

మనసులో పూచినా మధురమగు పాటలే
మాలగా వేసెదను మది నున్న భక్తితో!
అర్ఘ్యమును నీకిత్తు నలరి కన్నీటితో
పాదముల గడిగి నే ప్రణతు లర్పించెదను!

ఆలయంబున నున్న అందాల గోపాల!
ఏ విధిని పూజించి యెటుల యర్చింతూ?

## శిలల వేదనలనూ

శిలల వేదనలనూ కదలికను కదిలించి
నా పాట బాడుకొను నాథ ప్రణవమునా!

అప్పుడే రోదనల యతిభక్తి ధ్వనియించి
మౌనముగ రొద మాను మానసిక చింతనల!

శిలల వేదనలనూ కదలికను కదిలించి
నా పాట బాడుకొను నాథ! ప్రణవమునా!

మావికొమ్మల పైని మధురముగ కోకిలలు
మంజులంబగు ధ్వనులు మాధుర్యముగ నింపి
మౌనముగ కోనలో మాయమగు రీతినీ
గొంతునొక్కి నటుల కొస జారిపోయినటు! ॥శిలల॥

అరవిందములు పగలు యరసి రవికాంతులను
మకరందములు తావి మధురముగ నొలుకుచును!
పశ్చిమా సంధ్యాన బడిపోవ సూర్యుడును
మొగ్గలుగ మారునూ మోములను దించుకుని! ॥శిలల॥

అల రోదసిన గాంచి యలసి సొలసీ బాడి
కన్నీటి ధారలను కడవలను నింపితిని!
కమలాక్షు గానకను కనతి కనలీ పాట!
కిన్నెరను దాగినది వన్నెలను విడనాడి!

శిలల వేదనలనూ కదలికను కదిలించి
నా పాట బాడుకొను నాద ప్రణవమునా!

## మాధవుని విరహమున

మాధవుని విరహమున మనసు చెదిరిన గాని
మాట వస్తూ వుంది మధురమగు ధ్వనులా!

వాసంత ఋతువునా వన్నెలను మానినా
పాట వస్తూ వుంది బరగ కోకిలకు వలె!

మాధవుని విరహమున మనసు చెదిరినగాని
మాట వస్తూ వుంది! మధురమగు ధ్వనులా!

విచ్చుకత్తులకు వలె వెలసినా యాపదలు
ఒకదానిపై నొకటి వచ్చుచుండిననూ!
మనసులోని పాట మాధవుని మరువకను
శ్రుతిలయలతో పాట సొంపు గులుకుచు నుండె! ॥మాధవుని॥

మనసంత వికలమై మాధవుని చింతనల
అలిత కలతల నుండి యలరి కన్నీటితో!
సొలసిపోయిన గూడ సొంపుగా నా మాట
చిలుక వలె బలుకుచును శ్రీలు జిందుచునుండె! ॥మాధవుని॥

మాధవుని విరహమున మానసము జెదిరినది
మూగినై పోతినీ మునివోలె వేదనను!
ఆ మాట యాపాట అలరి తెచ్చుచునుండె
స్వాతి కార్తెను బుట్టు జలధి ముత్తెముల వలె!

మాధవుని విరహమున మనసు చెదిరినగాని
మాట వస్తూ వుంది! మధురమగు ధ్వనులా!

## కొండపై నుండి నే

కొండపై నుండి నే గోపాలకృష్ణ!యని
అఱచి పిలుచుచు నుంటి! యాకాశ మార్గమున!

పిలిచినా పిలుపులకు ప్రిదిలె మేఘములన్ని
నీ దర్శనము నాకు నిండుగా గనరాదు!

కొండపై నుండి నే గోపాలకృష్ణ! యని
అఱచి పిలుచుచు నుంటి! యాకాశమార్గమున!

ఏటి యొడ్డున నిలిచి దీటుగా యద్దరిని
యుంటివని నీ పాట యొనర బాడుచునుంటి!
నీవు గూడను బాడి నిండుగా దరిజేరి
ఓదార్ప వెందుకో! వన్నెలా శ్రీకృష్ణ!

అలలలో మునుగుచును దెరలలో దేలుచును
సుడులలో ముడులలో దేలుచును గోపాల!
నిన్ను వెదుకుచు నుంటి నింగి హరివిల్లులో
కన్నులకు గనబడవు! వన్నెలను దొలుకవూ!

కలువ తామరలతో కన్నీటి బిందువుల
దోసిలిని బట్టి నే దొసగులను బాపమని
అలగ జేంద్రునికి వలె యఱచి బిలుచుచు నుంటి
ఆలకింపగ రాద! యోతసి బ్రోవగ రాద!

కొండపై నుండి నే గోపాలకృష్ణ! యని
అఱచి బిలుచుచు నుంటి! యాకాశమార్గమున!

## అంతర్నిగూఢమగు

అంతర్నిగూఢమగు నలరు నా వేదనను
మనసులో దావాగ్ని మాపువా రెవరూ?

జెప్పికొనరానిదీ వావిచ్చి యెవరికిని
మనసు ముడులను నున్న మర్మమగు తాపమును

అంతర్ని గూఢమగు నలరు నావేదనను
మనసులో దావాగ్ని మాపువా రెవరూ?

కోనలో కోకిలకు గుప్తముగ దెలిపితిని
మధురమగు నా వ్యథను మంజులంబగుగీతి!
జాలితో తా గూడ చలియించి గీతితో
కన్నీరు నొలికినది మున్నీరు గలియగా! ॥అంత॥

జల జలా ప్రవహించు సెలయేటికిని దెలిపి
మనసులో నున్నట్టి మాధవుని విరహమును!
కన్నీటి ముత్యాలు చిన్ని దోసిలితోని
అర్పింపమని దెలిపి యందించితిని యలల! ॥అంత॥

ఎంతకాలం బిటుల చింతలను కన్నీళ్ళ
వంతలను కృశియించి కాంత! ప్రకృతిమాత!
చిక్కనీ యడవులను చెట్టు పుట్టలయందు
కాంత వెదుకుచు నుంటి కల్యాణ ధామునీ!

అంతర్నిగూఢమగు అలరు నా వేదనను
మనసులో దావాగ్ని మాపువా రెవరూ?

# ఆకాశ మల్లియరో!

ఆకాశ మల్లియరో! అందాల శ్రీకృష్ణు
పొందగా వేదనను బొగులుచుంటివిగా!

విరహ వేదనతోని విమలమగు కన్నులను
కన్నీటి పుష్పాల కాన్కగ అర్పించుచును!

ఆకాశ మల్లియలో! అందాల శ్రీకృష్ణు
పొందగా వేదనను బొగులుచుంటివిగా!

నిలిచి కానలయందు నీరాజనముతోని
చూచుచుంటివి దిశలు దీనత్వమును దాల్చి!
నావలెను విరహమున నలిగిపోవుచు గలత
కన్నీటి భాష్పాల కరుణ నొలుకుచునూ! ॥ఆకాశ॥

నేలంత బఱచితివి నిలిచి పుష్పాలతో
కలయ జూచుచు గిరులు కాఱడవులందునను!
నే నొలుకు కన్నీరు నిలిచె సెలయేఱుగా
కొండలను బరుగెత్తి కూర్మి ధరణిని ప్రాలె! ॥ఆకాశ॥

కన్నీరుగా పుష్ప సౌరభము నొలికితివి
ఎదురు జూచుచు కృష్ణు మది స్మరణ జేయుచును!
నేగూడ కన్నీరు నిలిచి నొలుకుచునుంటి
కొండవాగుగ మారి బండలను ప్రవహించె!
నా మదిని నీ మదిని నలుగుచున్నా వ్యధను
కరుణ బ్రోవడు గదా! వినడుగద! మన పాట!

## ఆషాఢ మేఘమున

ఆషాఢ మేఘమున యలరు నీటికివోలె
నిలిచె నా కన్నులను నీరములు కృష్ణా!

మంచుకాలమునందు మంచు పొగవలె నాదు
మదియందు నిలిచినది మాధవా! విరహమును!

ఆషాఢ మేఘమున యలరు నీటికివోలె
నిలిచె నా కన్నులను నీరములు కృష్ణా!

మెఱుపులను యుఱుములను మేఘములు గురిసినటు
కన్నీటి ధారలును గలగలా నాలికినవి!
అంబరమునందునను హరివిల్లు గనిపించె
కనుల కనిపింపవూ కమనీయ రూపమున! ॥ఆషాఢ॥

మంచు తుంపురులతో మహియంత నిండినది
మంచు ముత్యాలతో మధురముగ ప్రకృతియు
చల్లనీ చంద్రునిగ చరియించె సూర్యుడూ!
కనరావుగద కృష్ణ! కరుణతో చల్లగా! ॥ఆషాఢ॥

హరివిల్లునకు వోలె అందాలు గురిపించు!
మనసునను రాజిల్లు మాధుర్యమును జేరద!
మంచు పొగవలె నాదు మదిలోని విరహాగ్ని
చల్లదనములతోని శాంతింప జేయుమా!

ఆషాఢ మేఘమున యలరు నీటికివోలె
నిలిచె నా కన్నులను నీరములు కృష్ణా!

# అంతర్నిగూఢమై

అంతర్నిగూఢమై యలరి యుండిన నిన్ను
యత్నించుచును గాంచ జతనమున కృష్ణా!

పరమ భాస్వరమైన ఊర్ధ్వస్థలంబైన
జ్యోతి కనుగొనగ నే ప్రీతి గాంచుచునుంటి!

అంతర్నిగూఢమై యలరి యుండిన నిన్ను
యత్నించుచును గాంచ జతనమున కృష్ణా!

కోరికల నిను గోరి కొసరుచును కొసరుచును
ఆకాశ హర్మ్యాల నలరి గట్టుచునూ!
అటు కోరికల గోరి ఆయాస బడబోను!
నిష్కామ కర్మలను నిరతి జేయుచు నుంటి! ॥అంత॥

నిశ్శబ్ద వీధులను నిరతమును దిరుగుచును
కొండలను కోనలను బండలను గూర్చుండి!
చిందుచును మనసులో చిగురులను దొడుగుచును
పూలుపూయుచు నుంటి పొలుపుగా శాంతమున! ॥అంత॥

నిను జూచుచుంటిని నీడగా హృదయమున
జ్యోతిగా నిలుపుచును ప్రీతి భావముతోని!
ఉదయసంధ్యకువోలె వెలిగినా దీపమును
ఆరిపోనీయకను నటులె యుంచుము స్వామి!

అంతర్నిగూఢమై అలరి యుండిన నిన్ను
యత్నించుచును గాంచ జతనమున కృష్ణా!

## హృదయారవిందమున

హృదయారవిందమున వెలిగేటి జ్యోతిగా
నినుగాంచు చుందునూ నిజముగా కృష్ణా!

అటులోయి వెదుకనూ నిటువెదలి కనుగొనను
మనసునందున నిలిపి మౌనముగ దలతు నిను!

హృదయారవిందమున వెలిగేటి జ్యోతిగా
నినుగాంచు చుందునూ నిజముగా కృష్ణా!

విశ్వమంతా నిన్ను వెదుక నిక గోపాల!
కనులలోనున్న నిను గాంతు నిరతమునూ!
వేయివెలుగుల జ్యోతి వేడుకను వెలిగించి
చూచుచుందును మదిని సురుచిరంబుగనూ! ॥విశ్వ॥

నిర్జనంబైన యా యేకాంతదేశమున
కుటియందు నే నిలిచి కూర్మి కిన్నెర దాల్చి!
జ్యోతిలో నిను గాంచి జ్యోతిగా నేమారి
నిను కలిసిపోదునూ నిర్మలంబుగ హృదిని! ॥విశ్వ॥

విశ్వ ప్రణవమును నే పీడివచ్చితి కృష్ణ!
తిన్నెన్నో మలుపులను చెన్నుగా తిరిగితిని!
కన్నులను కాంతులను కదివినవి శ్రీకృష్ణ!
హృదిలోని జ్యోతిగా మదికిచ్చితివి శాంతి!

హృదయార విందమున వెలిగేటి జ్యోతిగా
నిను గాంచుచుందునూ నిజముగా కృష్ణా!

## ఎచ్చటో నుంటివని

ఎచ్చట్లో నుంటివని వెదుకనిక గోపాల!
మనసులోనుంటివీ మధుర కాంతులతోని!

వేడ నిక గోపాల! వేడుకను కిన్నెరను
పాడిపాడీ నిన్ను బరగ యాచింపకను!

ఎచ్చటో నుంటివని వెదుక నిక గోపాల!
మనసులో నుంటివీ మధుర కాంతుల తోని!

కన్నులలో నిలిచి కదలాడు నిన్ను నే
వీధులందున వెదికి వ్యధ నందగా బోను!
గగన వీధులయందు గనుగొనుచు తారలను
చందమామను గాంచి అందాల బొగడనూ! ॥ఎచ్చటో॥

సంధ్య మొలకల గాంచి చారుసుందరమైన
అరుణారుణ ప్రభల అంతటను గాంచుచును!
మదిమురిసిపోను నే యెద సంతసింపనూ!
మంగళంబగు నీదు మధుర మూర్తిని గాంతు! ॥ఎచ్చటో॥

విశ్వసౌందర్యంబు విమలమగు ప్రకృతియు
నీజ్యోతిలో గలవు నిఖిలమంతముగూడ!
పాలలో వెన్నయును బరగ యుండినరీతి
మబ్బులో వర్షమును మణిగి యుండినరీతి

ఎచ్చటో నుంటివని వెదుకనిక గోపాం
మనసులో నుంటివీ మధుర కాంతులతోని!

## నా మనసు లోపలను

నా మనసు లోపలను నవనవోజ్జ్వలముగా
కాంతులను దొలుకుచును కమనీయముగనూ!

ఉన్న నిమ గానకను కన్నులను దెఱచుకొని
నలుమూల లందునను నాట్యమాడుచునుంటి!

నా మనసు లోపలను నవనవోజ్జ్వలముగా
కాంతులను దొలుకుచును కమనీయముగనూ!

ఊర్ధ్వస్వలంబైన ఉన్నతంబగు జ్యోతి
హృదయారవిందమున కదులుచుండగనూ!
కొండకోనలయందు బండలను ప్రవహించు
సెలయేఱులను గాంచి శిలగ నే మారితిని! ॥నా॥

మదిలోని తెరలనూ మర్మముల దొలగించి
దివ్య జ్యోతిని గాంచి దీప్తిబొందక నేను!
అందందు వెదుకుచును అలరి మది కలతలను
భ్రమజెందుచుంటినీ భానుబింబము గనక!

లోకమంతయు నీవె! లోలోన వికసించు
అంతరంబగుజ్యోతి అఖిల జీవులయందు!
ఉన్నదొక్కటియనీ యూహింపు పరమాత్మ
ఒక్కడే యని మదిని మక్కువగ యూహింపు!

నా మనసు లోపలను నవనవోజ్జ్వలముగా
కాంతులను దొలుచుకును కమనీయముగనూ!

## మనసులో నున్న నిను

మనసులో నున్న నిను మమతతో గాంచకను
మబ్బులను గాంచుచును మమత చిందితినీ!

హంసభామల గాంచి యలరు చుక్కలగాంచి
హరివిల్లు గాంచి నే నలరుచుంటినిగా!

మనసులో నున్న నిను మమతతో గాంచకను
మబ్బులను గాంచుచును మమత జిందితినీ!

దివి భువిని వెలిగేటి దివ్యమైనా జ్యోతి!
ఒక్కటే యని మదిని మక్కువగా దెలియకను!
జీవులన్నిటియందు బరగ లీలగ యుండు
పరమాత్మయందు నా బరగ లీలగ యుండు!
అని మదిని దెలియకను యలసి దిరుగుచు నుంటి

సూర్యునీ కిరణాలు సూటిగా జగమంత
కాంతి కిరణాలుగా గనిపించు రీతిగా!
సకల జీవులయందు సర్వాత్మ డొక్కడే!
విడదీయరానిదీ! విడిపోని బంధ మిది!

వేలువేలుగ నుండి వేడుకను గనిపించు
భాను కాంతికి వోలె బరగు జగమంతయును
జీవాత్మ పరమాత్మ దివ్వెలో కిరణమై
భాసిల్లుచుండునూ బన్నుగా లోకాలు!

మనసులోనున్న నిను మమతతో గాంచకను
మబ్బులను గాంచుచును మమత జిందితినీ!

## కనులలో నున్న నిను

కనులలో నున్న నిను గానకను జగమంత
వెదుకుచుంటిని ప్రభూ! వెతల నందుచునూ!

కానలన్నియు వెదికి కలత నలతలనంది
అలసిపోతిని స్వామి! అంతుదెలియక నిన్ను!

కనులలో నున్న నిను గానకను జగమంత
వెదుకుచుంటిని ప్రభూ వెతల నందుచునూ!

కలువ తామరలందు కమనీయ సరసులను
తుమ్మెదల బారులను దోరముగ కోకిలలు!
పాడేటి మావులను బరగ వీక్షించితిని
కనరావు గన్నులకు కటిక చీకటి గంటి! ॥కను॥

పడవపై పయనించి బరగ యద్దరి జేరి
గోపాలు డెచటయని కూర్మి ప్రశ్నించితిని!
పదిమంది నవ్విరీ బరగ నను జూచుచును
మదిలోని కృష్ణునీ హృదితోని గను మనిరి! ॥కను॥

కనులలోనున్న నిను కానలను వెదికితిని
మనసులోనున్న నిను మహనీయ ప్రకృతిని!
అంతటా యున్న నిను యలరి గానగ లేక
చూపులేనివాడు సూర్యునీ గాంచినటు!

పాడేటి పాటలూ! భ్రమర గీతములన్ని
కిన్నెరను మీటినా కీర్తన లవన్నియును!
గోపాలబాలుడై కూర్మి కన్నులయందు
హృదియందు జ్యోతిగా మది వెదుక కనబడును!

## అందరిలో నున్న

అందరిలో నున్న యాత్మ ఒక్కటి గదా!
ఆ ఆత్మ పరమాత్మ! యరసి జూడగనూ!

ఆ పరమాత్మయే యపురూప జ్యోతిగా
అందరిలో నుండు నాత్మీయ కిరణమై!

అందరిలో నున్న యాత్మ ఒక్కటి గదా!
ఆ యాత్మ పరమాత్మ యరసి జూడగనూ!

అఖిల జీవులయందు ఆ యాత్మ యొక్కటే
వర్షించుచుండునూ వానచినుకుల వోలె!
మంచుబిందువులుగా మర్మముగ కనిపించు
అఖిలాత్మ కిరణములు అందుండి ప్రసరించు ॥అంద॥

పరమాత్మనే మదిని పరమ భాస్వరమైన
జ్యోతిగా భావించి కీర్తనలతో నేను!
రాముడని కృష్ణుడని రమ్య నామములలో
పూజించుచుంటినీ పురుషోత్తమా నేను! ॥అంద॥

లోకమంతయు ఒకటి! లోకులందఱు ఒకటి!
జ్యోతిలో వెలువడిన ప్రీతి కిరణములమూ!
మదిలోని వెలుగునూ మానవుడు గుర్తించి
వెలుగులోనే సకల విశ్వమును గాంచునూ!

విడదీయరానిదీ! విమలమగు బంధ మిది!
వేర్వేఱు నదులతో విలసిల్లు సంద్రమిది!
చంద్రకాంతులవోలె విలసిల్లు పువ్వు లివి!
అరుణకాంతులతోని యలరారు రేఖ లివి!

## విశ్వాత్మలో నుండి

విశ్వాత్మలో నుండి వెలసినా మన మిటుల
వేద భావంబేల బేద భావనలూ
పరమాత్మలో నుండి బయలు వెడలిన మనము
అన్నదమ్ములవోలె ఆలరగా రాదా!
విశ్వాత్మలోనుండి వెలసినా మన మిటుల
వేదభావం వేల బేద భావనలూ!

వేర్వేరు భావాలు వేర్వేరు మతములూ
వేర్వేరు వన్నెలను వెలసినా మనమూ!
పరమాత్మ జ్యోతిలో బన్నుగా విలసిల్లి
పుడమిపైని వసియించు బుద్ధి జీవులమూ! ॥విశ్వా॥

ఒక జ్యోతిలో నుండి వెడలినా జీవులము
ఒకభూమి వసియించు వికసించు మనమూ!
విశ్వమానవులంత ఒక్కటను భావమున
మనసునందున దలచి మనవలెను గాదా? ॥విశ్వా॥

ఆ పరమేశ్వరుని యంతరంగము వోలె
ఆ జ్యోతి కిరణములు అందరము మనమూ!
ఆ దివ్య జ్యోతినీ యలరి గాంచుచు దినము
కరుణ ప్రేమంతోని కలిసి జీవించుదము!

విశ్వాత్మలో నుండి వెడలినా మన మిటుల
వేద భావవలేం? బేద భావనలూ?

## ఊర్జస్వలంబైన

ఊర్జస్వలంబైన యున్నతంబగు జ్యోతి
కనుల గాంచగలేవు కాంక్షతో గూడీ!

మనసు జూడగ లేదు మాధుర్యమును నాలికి
అంతరాత్మను జూడమని పలికె కృష్ణుడూ!

ఊర్జ స్వలంబైన యున్నతంబగు జ్యోతి
కనుల గాంచగ లేవు కాంక్షతో గూడీ!

నను జూచినట్లుగా నా మురళి విని నటుల
కనలేవు కన్నులను వినలేవు చెవులతో!
ప్రకృతి యందాలనూ కనినటుల వినినటుల
మహనీయ జ్యోతినీ మది హృదిని గనలేవు!

కర్మ బంధము లన్ని గడతేరి పోవలెను
మనసులో కోరికలు మాయమై పోవలెను!
నిష్కామ కర్మమున నిరవధిక యాత్రలో
పయనించు పధికుడే పరతత్త్వమును దెలిసి
మాన్యుడై కనగలడు మహనీయజ్యోతినీ!

కోటి సూర్యప్రభలు గూడినా జ్యోతినీ
అంతరాత్మను గాంచి ఆనంద మొందెదరు!
నా మురళిలోగూడ ఆ దివ్యజ్యోతినే
ప్రణవ నాదముతోని బరగ బాడుచునుంటి
అనుచు పలికెను విభుడు ఆలరుచును ప్రేమతో!

ఊర్జస్వలంబైన యున్నతంబగు జ్యోతి
కనుల గాంచగలేవు కాంక్షతో గూడీ!

## మద మత్సరము లనే

మద మత్సరము లనే మనసు తెరలను దాటి
యడ్డు గోడల దాటి యలరు మాధవునీ!

దర్శింపగా నేను తరలిపోవుచునుంటి
మఱలి నే రానమ్మ! మధుమతీ! చెలియరో!

మద మత్సరములనే మనసు తెరలను దాటి
యడ్డు గోడల దాటి యలరు మాధవునీ!

జ్యోతిర్మయంబైన చూడశక్యము గాని
ఊర్జస్వలంబైన యుజ్జ్వలంబగు జ్యోతి!
కీర్తించుచున్న యా నర్తించు కృష్ణునీ
మురళిలో గలియగా మోదమున జనుచుంటి!

ప్రణవనాదములోని పాటవినుటకు గాను
నర్తించు కృష్ణునీ నర్తనల గాంచుటకు!
అలరి రాకందమ్మ! అడ్డుగా తెరలతో
మధువులను జిందుచును మందారములతోని!

పర్వతంబుల గిరుల బరగ దాటగవలెను!
నది సంద్రము నందు నావలో బోవలెను
ప్రకృతిమాతను గూడ పరికించి ప్రేమతో
మాధవుని సన్నిధికి మమత బోవుచునుంటి!

మద మత్సరములనే మమత తెరలను దాటి
యడ్డు గోడల దాటి యలరు మాధవునీ!

## ౩ మురళి స్వనములే

నీ మురళి స్వనములే నిర్మలంబగు ప్రణవ
నాదమని దలతు నే మదిని శ్రీకృష్ణా!

విశ్వమంతా మ్రోగు విమలమగు నీ ధ్వనియె
ఓంకార నాదముగ వర్ధిల్లుచున్నదీ!

నీ మురళి స్వరములే నిర్మలంబగు ప్రణవ
నాదమని దలతు నే మదిని శ్రీకృష్ణా!

ఊర్జస్వలంబైన యున్నతంబగు జ్యోతి
కనబడకయున్నదీ కాఱు చీకటులందు!
బహుదూర యాత్రికులు బరగ బోవలెనటకు!
బహు యాతనల జింది బాధజెందగ వలయు! ॥నీ॥

అతి సులభమైన నీ యందాలమురళిలో
మనసు జిందగజేతు మధుర శాంతిని నొందు!
దారిలో నడివెదను దాసిగా వర్తించి
అందుకొనుమా నన్ను అల గోపకాంతగా! ॥నీ॥

మౌనమును దాల్పవలె మౌనిగా నుండుటకు
తపసిగా నుండుటకు తపనలో మునుగవలె!
అట్టి మౌనము తపము నిట్టె జేయగలేను
గాన సంకీర్తనల కడ ముట్టెదను నిన్ను!

నీ మురళి స్వనములే నిర్మలంబగు ప్రణవ
నాదమని దలతు నే మదిని శ్రీకృష్ణా!

## ఊర్జస్వలంబైన

ఊర్జస్వలంబైన యున్నతంబగు జ్యోతి
కనలేను మాధవా! కాంతులను గలిసీ!

వినుచుందు నీ మురళి విశ్వాంతరాళమున
కనుచుందు నీరూపు కనుల పండువుగా!

ఊర్జస్వలంబైన యున్నతంబగు జ్యోతి
కనలేను మాధవా! కాంతులను గలిసీ!

గోపకాంతగ నిన్ను కోరి పూజించెదను
మధురగీతము బాడి మానసము నందునా!
వెన్నెలా పువ్వులను వేడుకను నే దెచ్చి
మాలగా గ్రుచ్చి నీ మదియందు వేయుదును! ॥ఊ॥

వీధివీధుల యందు వాడవాడలయందు
కిన్నెరను బట్టికొని కీర్తనల బాడుచే!
ముక్తిసాధనమనీ ముదముతో నే దలతు
దాసిగా యుండుటే దగ యోగ్యమని దలతు! ॥ఊ॥

అణువణువు నిండినా యందాల గోపాల
నిను విడిచి నేబోను నిఖిల యాత్రలకునూ!
నా కుటిని నే నుందు నాముందు నీవుండు!
నిను బాడుచుందునూ నిరతమున గీతికల!

ఊర్జస్వలంబైన యున్నతంబగు జ్యోతి
కనలేను మాధవా! కాంతులను గలిసీ!

## నా చిన్ని కుటియందు

నా చిన్ని కుటియందు నా చిన్ని గీతికను!
నా కిన్నెరను మీటి నాట్యమాడుదునూ!

వినుచుందువని దలతు విమలమగు దయతోని
పదియందు పూచినా మధుర గీతికలనూ!

నా చిన్ని కుటియందు నా చిన్ని గీతికను
నా కిన్నెరను మీటి నాట్యమాడుచునూ!

అలనాటి గోపికను సరి నా విన్నపము
నాలకింపు మటంచు యటవి పలుకుచునుంటి!
మురళిలో స్వనముగా మోదమున నను గలిపి
మన్ననను జేయుమని మనవి జేయుచు నుంటి! ॥నా॥

వేదవేదాంగాల వివరమది తెలియదూ!
ఘన ధర్మశాస్త్రాల కనలేదు వినలేదు!
గోపకాంతకువోలె కోరి పూజించితిని!
చిన్నికిన్నెర దాల్చి చిఱుగీతికల బాడి ॥నా॥

నీమీద నాకున్న నిరవధిక ప్రేమచే
మోము జూపించినను జూపకను బోయినను!
నిను గాంచ యత్నింతు నీ దివ్యదర్శనము
ఊర్జస్వలంబైన యున్నతంబగు జ్యోతి
ఆత్మగా నున్నటుల యలరిగాంచెద కృష్ణ!

# శ్రీదివ్యదర్శనము

శ్రీ దివ్యదర్శనము దర్శింపవలెనన్న
చిత్తశుద్ధిని గలిగి దీప్తి జెందగనూ!

మధురాతి మధురమౌ మాధుర్యమును గలిగి
పయనింపగా వలెను పక్షిగా గగనమున

శ్రీ దివ్యదర్శనము దర్శింపవలెనన్న
చిత్తశుద్ధిని గలిగి దీప్తి జెందగనూ!

కానుకలు, కట్నాలు, కనకాంబరములునూ
పూలమాలిక లతని పూజకై వలదూ!
మనసులో పూజింప మాధవుడు పులకించు
అంతరంగమునందు అతని విలుపుచునూ!

సకల జీవులయందు సమత మమతయు గలిగి
వర్తించువానికే వరములొసంగునూ!
ఆత్మయందున జ్యోతి అఖిల జీవులయందు
కనుగొనినవారికే కలిసి దర్శన మిచ్చు!

ఆత్మ సాక్షాత్కారమును నందవలె ముందుగా
అందరిలోగూడ ఆ జ్యోతి గాంచవలె!
విశ్వమంతా జ్యోతి విరిసియున్న దటంచు
కనుగొన్నవాడె సూ! కడుధన్యమగు జీవి!

శ్రీదివ్యదర్శనము దర్శింపవలెనన్న
చిత్తశుద్ధిని గలిగి దీప్తి జెందగనూ!

## విశ్వమంతయు గూడ

విశ్వమంతయు గూడ విమలమగు జ్యోతిలో
కలిసిపోవుటకునై కదులుచున్నదిగా!

అణువణువు వికసించి యతనికై తపియించి
విరహ వేదనతోని వ్యథ జెందుచున్నదీ!

విశ్వమంతయుగూడ విమలమగు జ్యోతిలో
కలిసిపోవుటకునై కదులుచున్నదిగా!

ఆకాశమందునను నలరు తారలు గూడ
సూర్యుడును చంద్రుడును సృజనమంతయుగూడ
పయనించుచున్నదీ బరగ జ్యోతిని గలియ
సంద్రమున గలిసేటి సకల నదులకు వోలె! ॥విశ్వ॥

ఋతువులును, కాలములు, పయనించి జ్యోతికై
కదిలిపోవుచు నుండె కాలగర్భమునందు!
చివురుటాకులు, పూలు చిత్రముగ మాయమై
అలజ్యోతి సన్నిధికి యలరిపోవుచు నుండె! ॥విశ్వ॥

మనసున్న మానవుడు మహనీయ జ్యోతినీ
కలిసిపోవలెను మఱి కనుగొనుచు ఆత్మలో!
జనన మరణములేని జాగృతిని నందగా
యత్నింపవలె సాధు వర్తనము జిందగా!

విశ్వమంతయుగూడ విమలమగు జ్యోతిలో
కలిసిపోవుటకునై కదులుచున్నదిగా!

## బాటసారిగ నేను

బాటసారిగ నేను పయనించు యాత్రలో
దారిలో దొరికావు! దర్శనం బిచ్చి!

మది శ్రద్ధబలముకుని మహనీయ ఫలమనుచు
శాంతి నందుచు నేను సంతసం బందుచును!

బాటసారిగ నేను బయనించు యాత్రలో
దారిలో దొరికితివి! దర్శనం బిచ్చి!

ఆలమందలయందు నలరు పచ్చికలందు
సెలయేటి తీరమున విహరించుచుంటివీ!
పిల్లనాగ్రోవి యా పిలుపులను విని నేను
అల్లనల్లన జేరి యడిగితిని యెవరివని? ॥బాట॥

మురళిపాటను నాపి ముద్దుగా మురళినీ
నాచేతి కిచ్చితివి! నళినాక్ష! దయతోని!
ఆ మురళి గైకొనుచు నటు జూచుచుండగా
మాయమై పోయావు మతి గానరాకుండ! ॥బాట॥

సెలయేటి తీరమున నుంచితిని నీ మురళి
పాడుకో! పరమాత్మ! పగగ జగముల నేలి!
నీరూప మాధురివి నేను గాంచితిగదా!
హృది నిలిపితిని స్వామి మది మఱువ నెన్నటికి!

బాటసారిగ నేను పయనించు యాత్రలో
దారిలో దొరికితివి! దర్శనం బిచ్చి!

# పిలిచి పిలిచీ విభుని

పిలిచి పిలిచీ విభునీ ప్రిదిలిపోయే వేల?
దాపునను యుండి నిను దయదలచు చుండే!

మహనీయ గీతమున మారుమూలల వెదకి
అలసిపోయెదవేల? అంతటా గలడతడు!

పిలిచి పిలిచీ విభుని ప్రిదిలిపోయేవేల?
దాపునను యుండి నిను దయగనుచు నుండే!

గిరులు పర్వతములును విరియు పూపొదలునూ
సెలయేటి జాలులును చిలుకలును కోకిలలు!
ఉదయించు భానుడును వినిపించు రాగమును
ఆతడే యని మదిని యాత్మయందున దలపు! ॥పిలిచి॥

ప్రకృతిని ప్రతికణము పరివర్తనము నంది
పరుగెత్తుచున్నవీ ప్రబలతర శక్తితో!
వినిపించనీ ధ్వనుల వినిపించు రాగమున
పాడుచున్నవి విభుని పరవశము తోడుతను! ॥పిలిచి॥

మౌనముగ పాడుకో! మహనీయ గీతమును
వలదన్న కాదన్న యొడ్డుజేరును పడవ!
చేయూత నిచ్చి నిను జేకొనును దనయందు
మనసు లగ్నముజేసి మాధవుని మది దలపు!

పిలిచి పిలిచీ విభుని ప్రిదిలిపోయే వేల?
దాపునను యుండి నిను దయ దలచుచుండే!

## అందరూ నీ వారె!

అందరూ నీ వారె! యరసి జూడుము జగతి
పరులెవ్వరును లేరు బరగ వెదికిననూ!

అంతరాత్మజ్యోతి అలరి నీవును గాంచి
నీతోటి జీవులకు నిశితముగ జూపుమా!

అందరూ నీవారె! యరని జూడము జగతి
పరులెవ్వరును లేరు బరగ వెదికిననూ!

మదమత్సరములనూ మనసు దూరముజేసి
అందఱిలోనున్న యాత్మ యొక్కటియనీ!
ఆత్మయే పరమాత్మ! అందఱిని రక్షించు
దేవుడని భావించు దేదీప్యమానముగ! ॥అందరూ॥

కవ్వముమ మథియించి గల వెన్న బొందినటు
ఆత్మమథనమునందు నలజ్యోతి గనినటుల!
ఆత్మపరిశోధనే యన్నిటికి మూలమగు
వ్యథజెందినప్పుడే పథము కనులను నిలుచు ॥అందరూ॥

కందినా మనసుతో నిండినా శ్రమజలము
మబ్బులకు వెనుకున్న మాధుర్య కాంతులను!
మనసు పొరలను నున్న మహనీయ జ్యోతినీ
కాన వచ్చును జీవి కమనీయ యత్నమున!

అందఱూ నీవారె! అరసి జూడగ జగతి!
పరులెవ్వగునులేరు బరగ వెదికినమా!

## ఆనంద యాత్ర యిది

ఆనంద యాత్ర యిది! యతనిలో గలియగా
క్షణము నిలువగలేను సఖియరో! నీతో!

మధురమగు స్వప్నాల మనసు నిలిపీ నేను
పరమ పావనుని నే భజియించు చుంటినీ!

ఆనంద యాత్ర యిది! యతనితో గలియగా
క్షణము నిలువగలేను సఖియరో నీతో!

ఆకాశమున హంస యలరి బోయినయటుల
ఉదయ సంధ్యల కాంతు లుదయించినటుల నే
బరగ కిన్నెరతోని బయనించు చుంటినీ
నావిభుని కలియగా నయనాలు మీలించి! ॥ఆనంద॥

తోటలోనీ పూలు దోసిలిని గ్రహియించి
ఆత్మార్పణం బనుచు అతనిలో గలియగా!
మంచు పొగలను దాటి అంచులను సంద్రాన
ముత్యాల హారమును ముదముతో గూర్పగా! ॥ఆనంద॥

హరివిల్లు రంగులను అందాల గీతితో
జతబఱచి హృదియందు మతి నిలిపివేయగా!
పోవుచుంటిని సఖీ! పొలుపుగా పక్షివలె
నిలిపి మాటాడకే! నిలువజాలను క్షణము!

ఆనంద యాత్ర యిది! అతనితో గలియగా
క్షణము నిలువగ లేను సఖియరో! నీతో!

## ముత్యాల జల్లులా

ముత్యాల జల్లులా ముదితరో! గగనాన
తార లుదయించినవి తన్మయముతోనీ!

హరి రాక మది గోరి ఆత్మగీతిక తోని
పాడుచున్నవి సఖీ! బరగ విన రావమ్మ!

ముత్యాలజల్లులా ముదితరో! గగనాన
తార లుదయించినవి తన్మయముతోనీ!

తూర్పు పడమరలకును బాట యేర్పరచినవి!
తోరముగ మల్లెలను తొలకరీ జల్లువలె!
ముత్యాల ముగ్గులను ముదముతో వేసినవి
మల్లెమాలలతోని మధురమగు స్వాగతము! ॥ముత్యాల॥

చందమామను బిలిచి సఖియ లందఱుగూడ
బంగారు పువ్వులను బటుతరముగా రాల్చి!
పృథివి యాకాశములు బొలుపొంద స్వర్గముగ
గిరులు పర్వతములను క్రిక్కిరిసి నిలబడిరి! ॥ముత్యాల॥

నా చిన్ని కుటి నొదిలి నయముగా గిరినెక్కి
గోపాలబాలునీ కూర్మి జూచుచునుంటి!
తారలతో బాటు తన్మయమై నన్ను
సన్ననీ చూపులను బల్లు నేమో యనుచు!

ముత్యాల జల్లులా ముదితరో! గగనాన
తారలు దయించినది తన్మయము తోనీ!

## వాసంత కాలమున

వాసంత కాలమున వన్నెలా పూలన్ని
వికసించినవి ప్రకృతి విమల భాస్వరములా!

రంగురంగుల పూలు రమణీయమగు తావి
హరివిల్లునకు వోలె అలరె జగ మంతమును!

వాసంత కాలమున వన్నెలా పూలన్ని
వికసించినని ప్రకృతి విమల భాస్వరములా! ॥వాసంత॥

చిగురు పూవులతోని చిత్రమగు వేషాల
గొల్లభామల వోలె కూర్మి నుండెను జగతి!
శైలూషినుల వోలె చిత్రముగ నర్తింప
రమ్యముగ కనిపించె రాసక్రీడకు వోలె! ॥వాసంత॥

అడిగేటి వారలకు అలరి సంతసముతో
దోసిలులు నిండగా దోరంపు నొడులతో
నింపేటి పూలతలు ఎంతటీ ధన్యములో!
తావి పుష్పొడులతో దగ తేని యల తోని! ॥వాసంత॥

పూచినా పూవులూ పొలుపుగా గోవిందు
పూజకై నంటివీ! పొరపాటుగా నిటుల!
మనుజులకు నందించి వుహనీయ ధర్మమును
తప్పుదారిని జనుట తగునటే యంటినీ! ॥వాసంత॥

వంగినా పూలతల వలనొప్ప పూదోట
మధుర పుప్పొడి రాల మాధుర్యముగ బలికె!
జీవులందఱిలోని జీవాత్మదే గదా!
పరమాత్మ భావమున బన్నుగా నే దలచి!
అర్పించుచుంటినీ యా పరమాత్మకే
దోసిళ్ళయందునూ! దోరంపు నొడులతో!

## గోదావరి నదీ

గోదావరి నదీ కూర్మి బుట్టితి వెచటొ
కొండలను కోనలను కూర్మి చిత్రముగా!

రామ పాదములనూ రమ్యముగ దర్శింప
భద్రాచలా యాత్ర బరగ జేయుచునూ!

గోదావరీ నదీ కూర్మి బుట్టిలి వెచటొ!
కొండలను కోనలను కూర్మి చిత్రముగా!

దారిలో కనబడిన ధనికులకు బీదలకు
అర్థింప నీవార లందఱకు నిత్యమును!
చలివేంద్రముల రీతి జనుల కందఱకునూ!
నీరదానము జేసి నిరతాన్నదానమును
జేయుచుంటివి నీవు చిరకాల జీవివై! ॥గోదావరీ॥

మైదానముల నన్ని మార్చివేసితివి గద!
చిత్రకూటము వోలె సిరులు నింపితి విచట!
పసిడి పంటలతోని బంగారు సీమగా
తెలుగువారీ యింట యిలవేల్పు వైతివీ! ॥గోదావరీ॥

అని నేను బలుకగా అలరి గోదావరియు
అంజలిని ముకుళించి యలదేవు స్మరియించి!
అలలు తెరలును జిందు అలరి పడవలుగదల!
వలికె నిటు ముత్యాల భావాలు నొలుకగా! ॥గోదావరీ॥

నింగి యరుంధతీ నిలిచి యుండేదాక!
భద్రాద్రి క్షేత్రముమ బరగియుండే దాక!
జీవాత్ములకు సేవ జేయుమనె యీశుండు!
పరమాత్మ యానతిని బాలించుచుంటినీ! ॥గోదావరీ॥

## పశ్చిమా సంద్రాన

పశ్చిమా సంద్రాన భానుడును నిద్రించె
సంధ్యకాంతులుగూడ వింధ్యలను గలిసే!

చీకటీ తెరలవే! చిందె జగమంతయును
మాధవుని కొఱకు నే మది జూచుచుంటినీ!

పశ్చిమా సంద్రాన భానుడును నిద్రించె
సంధ్యకాంతులు గూడి వింధ్యలను గలిసే!

తూరుపున ఉదయించు దోరంపు చుక్కలను
గోపాలు డేడి యని కూర్మి యడిగితినీ
మా వెనుక గను మదే మాధవుడు అల్లదే!
గోపకాంతలతోని కూర్మి వచ్చుచు నుండె! ॥పశ్చి॥

ఆ తూర్పు చుక్కలను అంతరిక్షమునందు
జేరగా నడిగితిని శ్రీకాంతు డెచట యని!
వచ్చుచున్నా డదిగో! వన్నెలా కృష్ణుడూ!
మురళి నూదుచును మది ముద్దుగా నాట్యమున! ॥పశ్చి॥

అంతరిక్షపు తార లటు బోవ పశ్చిమము!
ప్రార్థించి యడిగితిని! పరమేశు డెచట యని!
ఎందఱో భక్తులును వ్యధజెందు వారలును
కన్నీరు తుడుచుచును సన్నని దయబఱపి!
వచ్చుచున్నా డదే వరసగా దయ బఱపి!
నేచి యుండుము సఖీ! వీక్షింపు అతనికై! ॥పశ్చి॥

పశ్చిమా సంద్రాన భానుడును నిద్రించె
సంధ్యకాంతులు గూడ వింధ్యలను గలిసే!

## సన్నని చీకటుల

సన్నని చీకటుల వన్నెలును మాసినవి
తారలును ముసుగులను దగ తరలిపోయే!

తూరుపున ఉదయించె తోరంపు సంధ్యలును
పసుపు కుంకుమలతో బంగారు వన్నెలను!

సన్నని చీకటుల వన్నెలును మాసినవి
తారలును ముసుగులను దగ తరలిపోయే!

శ్రీకాంతు డెచటయని జెలగి నే ప్రశ్నింప
కుంకుమల నొలుకుతూ కూర్మి సంధ్యలు బలికె!
మధుర భావము లొలుక మంజీర ధ్వనులతో
విశ్వమోహనమైన విమలమగు పదములను ॥సన్నని॥

కర్మబంధములన్ని గడతేరు వఱకునూ
ఎదురు చూడగవలయు వ్యథ జెందగా వలయు!
అంతవఱకును నిఖిల యఖిల జగమంతయును
అతని యాజ్ఞల దలచి అనుసరింపగ వలయు! ॥సన్నని॥

తానుగా కన్నీరు తా నొలుకుటయు గాదు
పరుల కన్నీటినీ బరగ తుడువగ వలయు!
వ్యథ జెందుటయుగాదు వేదనల నంచుచును
వ్యథ మాపగా వలయు సుధ నింపగా వలయు!
అదియె అతని యాజ్ఞ అనుసరింపగ వలయు
అతని యాజ్ఞల రీతి అలరి తలదాల్చుదుము!

సన్నని చీకటుల వన్నెలును మాసినవి
తారలును ముసుగులను దగ తరలిపోయే!

## పలుమారు నిను బిలిచి

పలుమారు నిను బిలిచి బాధింపనో స్వామి!
కనులార కనిపించి కరుణింప మనుచూ!

మనసులో కోరికల మన్నింప మనుచునూ
మది కాంక్ష లన్నిటిని మమత బేర్కొసుచునూ!

పలుమారు నిను బిలిచి బాధింపనో స్వామి
కనులార కవిపించి కరుణింప మనుచూ!

కానుకల నిచ్చుచును కమ్మనీ మ్రొక్కులను
ఆశ జూపుచు నిచ్చు అర్థింపబోవనూ!
గొంతెమ్మ కోరికల కొసరి యడుగుచు నిన్ను
మదిలోని యాశలను మనవి జేయను స్వామి! ॥పలు॥

పురుషోత్తమా! యనుచు పూజలను నే జేసి
వరములను నిను గోరి కరము నర్థింపనూ!
స్తోత్రపాఠములతో స్తుతియించి నిన్ను మఱి
అల్పమగు కోరికల యలరి యర్థింపనూ! ॥పలు॥

సకల లజీవులబ్రోచు స్వామివని భావించి
మనసు నిను జేరగా మమతతో యత్నింతు!
కర్మబంధములన్ని కడతేరు వఱకు నే
వేచియుందును స్వామి! విడువకను నిను మదివి!

పలుమారు నిను బిలిచి బాధింపనో స్వామి
కనులార కనిపించి కరుణింప మనుచూ!

## కిన్నెరను చేబూని

కిన్నెరను చేబూని కీర్తనలు బాడుచును
వీధి వీధిని దిరిగి వెత జెందుటయునూ!

తీయనీ కోరికల దీరుగా బొందుటకు
కాదు కాదో ప్రభూ! గడతేఱ యీ జన్మ!

కిన్నెరను చేబూని కీర్తనలు బాడుచును
వీధి వీధిని దిరిగి వెత జెందుటయునూ!

తారగా గగనాన చరియించుటకు గాదు
కోకిలగ వనవీధి కూర్మి బాడగ కాదు!
ఆకాశ హర్మ్యాల యలరుటకు కాదు సుమ?
స్వర్గ సుఖ సౌఖ్యాల సంతరింపగ కాదు! ॥కిన్నెరను॥

కోటి కిరణాలతో నే నొక్క కిరణమును
జనన మరణ జ్వాల తపనలో నుంటినీ!
కర్మబంధముల నే కటిక చీకటి నుండి
దయ దలచి మాధవా! దరిజేర్చు వెలుగునకు! ॥కిన్నెరను॥

కోరికలు యేమనుచు కూర్మి యడిగెద వేమొ
ఒక్కటే నా కోర్కి యోర్మితో వినుమయ్య!
కర్మ బంధము నుండి గటతేర్చి వేగమున
నీ మురళి మధురిమను నిస్వనంబుగ జేయి!

కిన్నెరను చేబూని కీర్తనలు బాడుచును
వీధి వీధిని దిరిగి వెతజెందుటయునూ!

## కనుచూపు మేరలో

కనుచూపు మేరలో గనిపించు చున్నదీ
కాఱు చీకటి యందు కాంతి దీపమునూ!

వినబడుచు నున్నదీ విమల మధుర స్వనము
మాధవుని దనుచు నే మది యందు దలచెదను!

కనుచూపు మేరలో గనిపించుచున్నదీ
కాఱుచీకటి యందు కాంతి దీపమునూ!

ఊర్జస్వలంబైన యున్నతంబదు జ్యోతి
ఆలమందల యందు అగుపించుచున్నదీ!
మురళీ స్వనము గూడ ముద్దుగా దూరమున
పడవలో వినబడుచు బయనించుచున్నదీ! ॥కనుచూపు॥

నా కోసమే యనుచు నయముగా భావింతు
విభుడిటకు వచ్చునని విదిత మగు చున్నదీ!
పధికు లెవ్వరు లేరు; బయనించు వారునూ
ఒక్కడే జనుచుండె చుక్కవలె యెచటికో! ॥కనుచూపు॥

ఆర్తు లెవ్వరో యతని యాదుకొమ్మనుచునూ
పిలిచినారో యేమొ! పిలుపు విని వెంటనే!
పయనించు చుండెనో! బరగ దీనుల గావ
తానుగా స్వయముగా దరలు చుండెనొ యేమొ!

కనుచూపు మేరలో గనిపించు చున్నదీ
కాఱు చీకటి యందు కాంతి దీపమునూ!

## అర్థించు టెందులకు?

అర్థించు టెందులకు? ఆశించు టెందులకు?
ప్రార్థనాపూర్వముగ ప్రణతు లెందులకూ?

కంటిలో కనుపాపగా కలిసియుండినా
నీవు నే నను వేఱు భావ మెందులకూ?

అర్థించు టెందులకు? ఆశించు టెందులకు?
ప్రార్థనాపూర్వముగ ప్రణతు లెందులకూ?

నీ మహాజ్యోతిలో నే నొక్క కిరణమును
నీలోని యంశమును నిజముగద! గోపాల!
నీలోని భాగమును నిఖిల పరమాత్ముడవు!
అర్థించు టెందులకు? అరసి ప్రార్థనలతో! ॥అ॥

నీ మహావృక్షమున నేనొక్క పువ్వునూ
నీ మహా గగనమున నేనొక్కతారనూ!
నీ మహా హరివిల్లు నిండయిన రంగులను
నే నొక్క రంగునూ నింగి నీలము నందు! ॥అ॥

నీ విధేయుడను నే నీయాజ్ఞ వర్తింప
నిశ్చయించిన నన్ను నిర్బంధ పూర్వముగ!
వేఱుజేయకుమయ్య విరులు రాల్పకు మయ్య!
నీ శాశ్వతానంద నిర్మలంబగు జ్యోతి
కిరణముగ నుండనీ! కీర్తనను బాడనీ!

అర్థించు టెందులకు? ఆశించు టెందులకు?
ప్రార్థనా పూర్వముగ ప్రణతు లెందులకు?

## ఏ పుణ్యరాశియును

ఏపుణ్యరాశియును ఏ మహాగుణములను
లేకపోయినగూడ లేశమంతయునూ!

అన్ని యున్నట్లుగా వన్నెలను జిందుచును
పువ్వుగా వికసించి పుప్పొడుల నొలుకుదును!

ఏపుణ్య రాశియును ఏమహా గుణములును
లేకపోయిన గూడ లేశమంతయినా!

కోటికిరణాలతో గూర్మి నే జేరుకుని
ధరణి వ్యోమములందు దగ కాంతి జిందుచును!
చిరకాల దీప్తినై దేజరిల్లుచు నేను
నీ వాడ ననుచు నే నెమ్మదిని దలపోతు! ఏపుణ్య

అట్టి భాగ్యము లేదు అఖిలాత్మ! పరమాత్మ!
కాఱుజీకటి వలను గదులుచుంటిని జిక్కి!
కర్మబంధము దొలగి కడకు జేరేవఱకు
ఇటుల నే జీకటిని నటియింప వలెనేమొ! ॥ఏపుణ్య॥

చీకటులు పైదొలగి చిరకాల వైభవము
అందుకొనగా నాకు అవకాశమును నిమ్ము!
నీమహా జ్యోతిలో నేనొక్క కిరణమై
అలరారగా నాకు అపురూపమును నిమ్ము!

ఏపుణ్య రాశియును ఏమహాగుణములును
లేకపోయినగూడ లేశమంతయునూ!

# లేఖలను వ్రాయుటకు

లేఖలను వ్రాయుటకు లేరెవరు బంధువులు!
ఆత్మీయు లందఱును ఆలరి దర్శింతురూ!

స్నేహ సౌహార్ద్రములు జిత్తమున రంజిలగ
మాటాడి పోవుదురు మఱచిపోకుండగను!

లేఖలను వ్రాయుటకు లేరెవరు బంధువులు
ఆత్మీయు లందఱును ఆలరి దర్శింతురూ!

కొండలను కోనలను గూర్మి సెలయేటి దరి
చిన్ని నా కుటిపైని చిత్రముగ కోకిలలు!
పన్నుగా పాటలను బాడుకొనుచుండునూ
మాటాడు నాతోని మధురముగ చిలుకలూ! ॥లేఖలను॥

అంబరములో నున్న అల తారలన్నియును
ప్రీతితో ననుగాంచి ప్రీతి నొలుకుచునుండు
సన్నని గాలులును సఖ్యముగ నను గాంచు!
ఉభయ సంధ్యలుగూడ నోరిమిని బరికించు! ॥లేఖలను॥

సెలయేటి అలలలో జిత్రముగ రంజిలుచు
నీటిపక్షులు వచ్చి నిర్మలంబగు కుటిని
వీక్షించి జనుచుండు విమలమగు చూపులను
కలువ తామరలునూ గనుచుండు స్నేహమున!

ప్రకృతిహితమై నన్ను బరగ యాత్మీయతను
అన్ని సమకూర్చునూ అసమానమగు ప్రేమ!
మృగ పక్షి సంతతులు మురిపెమున వీక్షించు!
వీరలే ఆత్మీయ విమల ప్రియ బంధువులు!

## హంసలారా! వినుడు!

హంసలారా! వినుడు! అలరి నా విన్నపము!
మాధవుకు దెలిపి నా మన్నలను గొనుడూ!

లేఖలో వ్రాసితిని లీలగా నా వ్యథను
ఖండగతి శైలిలో కమనీయ పదములను!

హంసలారా! వినుడు! అలరి నా విన్నపము
మాధవుకు దెలిపి నా మన్నలను గొనుడూ!

దినములును వారములు ధీరతను మాసములు
ఋతువులెన్నో గడిచె మదిలోని నా వ్యథను
ప్రార్థనాపూర్వముగ ప్రకటించు చుంటినీ
వినలేదు నామొరను విన్నపం బొకటియును! ॥హంస॥

కోనలో మౌనముగ కూర్మి వసియించుచును
ఆలపించుట దెలియు నలరు నావ్యథయునూ!
దోసిలిని పూలన్ని తోరముగ వాడినవి!
కనురెప్పలల్లదే కదలకను నిలిచినవి! ॥హంస॥

వినిపింపదో నాదు విన్నపము విభునికిని
వీక్షింప డెందుకో విమలమగు దయతోని!
కర్మబంధము లింక గడతేర వలె నేమొ!
మర్మమంతా దెలిసి మదిశాంతి బఱపుమా!

అంతరిక్షమునందు నలరు చుక్కలు దాటి
ధ్రువమండలము దాటి తూర్పు దిక్కునయందు
నావిభుడు నుండునట నయముగా వెదుకుమా!
మురళి నూదేవాని మోహనాంగుని కృష్ణు!

## చిలుక కపోతములార!

చిలుక కపోతములార! చిన్నారి కృష్ణునీ
అరసి కనుగొనుడమ్మ! అందాల విభునీ!

అంతరిక్షమునందు నటువెలయు తారలను
భువియందు గల మహా పుణ్యప్రదేశముల!

చిలుక కపోతములార! చిన్నారి కృష్ణునీ
అరసి కనుగొనుడమ్మ అందాల విభునీ!

అఖిల జీవులయందు నలరియుండేవాడు!
అఖిల వస్తువులందు నతికి యుండేవాడు!
అతడు లేనిచోటు లేదుగద! విశ్వమున
అంతటను లీలగా నలరి యుండేవాడు! ॥చిలు॥

ఒకమాట వినుడమ్మ వయ్యారిభామలూ!
అఖిల విశ్వమునందు నావరించినవాడు
నే దెలుపు చోటులను నిలిచి వెదుకండమ్మ!
మారువేషము తోని మసలుతూ వుంటాడు! ॥చిలు॥

ఆకలిని దప్పికను అల్లాడు మానవుల
ఆర్తనాదముతోని దురపిల్లు జీవులను!
కర్మబంధమునుండి గడతేరు వారినీ!
స్వయముగా దా వచ్చి దయను బ్రోచుచునుండు!

కన్నీరు దుడుచుచును ఋన్నుగా కౌగిలిని
జేర్చి బ్రోచుచు నుండు శ్రీకాంతు దతదేను!
నా విభుం దతదేను! ననుబ్రోచు కృష్ణుదే!
చిలుక కపోతములార! జేరి గుర్తింపుడూ!

# కొమ్మపై బాడేటి

కొమ్మపై బాడేటి కోకిలా వినవమ్మ!
నావార్త విభునకును నయముగా దెలుపూ!

నిను గాంచ గోరుచును నిలిచి రాత్రియు బవలు
నీరసించినదనీ నిఖిలేశునకు దెలుపు!

కొమ్మపై బాడేటి కోకిలా వినవమ్మ!
నావార్త విభునకును నయముగా దెలుపూ!

గగనాన తారలును కనురెప్ప వాల్పకను
చందురుని కిరణాలు దగ లెక్క బెట్టుచును!
కొలనిలో గలువలను కూర్మి రాత్రంతయును
నీరాక కొలకునై నిలిచెనని దెలుపుమా! ॥కొమ్మపై॥

కిన్నెరను చేదాల్చి సన్నగా బాడుచును
అరవిరియు కలువలుగ యలరు నేత్రములతో!
జలజలా భాష్పములు తొలకరిగ వర్షించి
కుటియంత నింపెనని కుదురుగా దెలుపుమా! ॥కొమ్మపై॥

వార్త దెలుపుటగాదు వరుసగా నా వ్యధను
పాటగా దెలుపుమా పద్మనాభునకునూ!
మెప్పింపు పాటతో రప్పింపు వేగముగ
మావిచివురుల విందు మానుగా నే జేతు

కొమ్మపైబాడేటి కోకిలా వినవమ్మ
నావార్త విభునకును నయముగా దెలుపూ!

## చిలుక గోరింకలను

చిలుక చోరింకలను చిన్నారి తుమ్మెదల
బంపు చున్నాననుచు బరగ మది దలచి!

కసిరి బొమ్మనకయ్యె కమనీయ నేత్రముల
అరుణ రేఖను జూపి యలరి భయబెట్టుకుము!

చిలుక గోరింకలను చిన్నారి తుమ్మెదల
బంపు చున్నాననుచు బరగ మది దలచి!

చిలుక గోరింకలే చిన్నారి తుమ్మెదలు
అందాల హంసలే యలరేటి కోకిలలు!
అత్యంత ప్రియమైన యలరు సఖియలు కృష్ణ!
నేబంప వచ్చి రటు నిండు ప్రేమను జూపి!

నా విరహ గీతముల నయముగా వినలేక
నాకంటి ధారలను నాథ! గనలేకనూ!
చెదిరినా నామనసు కదిలినా భావముల
గనలేక వచ్చిరీ కమ్మనీ దయజూపి!

హృదయ వేదననంత పదయ? నీకును దెలుప
మనసులో తాపమును మధురముగ దెలుపుగను!
వచ్చినా వారలను మచ్చికను దయజూడు
పలికినా పలుకులను బరగ దయతోని విను!

చిలుక గోరింకలను చిన్నారి తుమ్మెదల
బంపుచున్నా ననుచు బరగ మది దలచి!

## దివ్యమగు నా స్మృతిని

దివ్యమగు నా స్మృతిని దీపమై యుండుటకు
నాకేమి యిచ్చెనని నాదు విభుడడుగా!

చెలులార! దెలుపుడూ! శ్రీకాంతునకు వేగ
తనకున్న దంతయును దగ యిచ్చె ననుచునూ!

దివ్యమగు నా స్మృతిని దీపమై యుండుటకు
నాకేమి యిచ్చెనని నాదు విభు డడుగా!

తనకున్నదంతయును తనువు ధనమును గూడ
తన యూపిరిని గూడ దగ నీకు నిచ్చె మఱి
ఏకాంతభక్తితో నీ విజనమందునను
నినుబాడుతూ బోయె నిఖిల విశ్వమున కని! ॥ది॥

తొంగిచూడుము కుటిని తోరంపు కిన్నెరను
పాడుచున్నది నిన్ను ప్రణవనాదము తోని!
దీపమది వెలుగుచును దివ్యమగు కిరణముల
భాసిల్లుచున్నదని భవునితో బలుకుడూ! ॥ది॥

తరులు పూలతలునూ విరులు లేజిపురులును
కోకిలలు హంసలును కూర్మి సెలయేఱునూ
కోనలో అణువణువు కూర్మి ధ్వనియించుచును
పాడుచున్నది యామె పావనం బగు గీతి!

## పాడుచుండుటగాదు !

పాడుచుండుట గాదు భవ్యగీతము ప్రకృతి
పాడుకొనుచున్నదీ ప్రతిదినము వేదనను!

దీనులను బ్రోచేటి దీన బాంధవుడవూ!
ఏల యిటు జీవులను యిడుమలను ముంచుటో!

పాడుచుండుట గాదు భవ్యగీతము ప్రకృతి
పాడుకొనుచున్నదీ ప్రతిదినము వేదనను!

దేవదానవులపుడు దివ్యమగు పాల్కడలి
మధియింపగా సుధయు మానుగా నుదయించె!
అటులనే తన మదిని అల దాసి మథియించి
అమృత గీతిక నీకు అర్పించె ననుడూ! ॥పా॥

తాటియాకుల కమ్మ తగ విభుని కివ్వండి
అతని స్మృతిపథమందు అలరియుండుదు నేను
నెమిలి పించముతోని నెమ్మదిని కన్నీట
వ్రాసెనని బలుకుడీ పలనొప్ప విభునకును! ॥పా॥

మేమందఱము గూడ మిగుల శ్రద్ధా భక్తి
పాడెదము ప్రతిరోజు ప్రణవ గీతికనూ!
చినిచిన్ని కూనలును చిన్నారి పిట్టలను
పాడుకొనుచున్నవీ పలుమాఱు వల్లించి

పిల్లవాయువులును అల్లనా వీచుచును
వినిపించుచున్నవీ విమల గీతమునూ!
తరులు పూలతలునూ తన్మయంబుగ నూగి
పూవులను రాల్చుచును పులకించు చున్నవీ!

అని పలుకుడో చెలులు అందాల కృష్ణునకు
మధురమగు నాకమ్మ మాధవున కివ్వండి!

## నీభక్తి గీతమును

నీభక్తి గీతమును నిలుపుటయె గాదు ప్రభు!
నీ కిష్టమగు పనులు నిలిపెదను మదిలో!

కరుణార్ద్రి భావమున గనుచుందు జీవులను
ప్రకృతిమాతను గూడ గనుచుందు ప్రేమతో!

నీభక్తి గీతమును నిలుపుటయెగాదు ప్రభు!
నీ కిష్టమగు పనులు నిలిపెదను మదిలో!

చిగురు పూవులతోని చిత్రమగు ఫలములను
మధుర రసములతోని మానవుల కిచ్చునటు!
నేగూడ వికసించి నిర్మాణ పథమందు
మానవుల కుపకృతిని మమత గూర్చుచునుందు! ॥నీ॥

రోదరల వేదనల రోదసీ నిండగా
కన్నీరు దొలికేటి గల అభాగ్యుల ధరణి!
వారిలో నొకడనై వారి బాధలదీర్చి
ప్రాణముల నర్పించి ప్రగతి పథమున నడిచి! ॥నీ॥

ధనమదాంధులకు నే దారి కడ్డము నిలుతు
విలపించు ప్రజలకును విధివ్రాత దుడిపింతు!
కన్నీటిలో మునిగి కలతజెందే జనుల
కలతమా దొలగించి కాంతి రేఖను జేర్తు!

నీభక్తి గీతమును నిలువుటయెగాదు ప్రభు
నీకిష్టమగు పనులు నిలిపెతను మదిలో!

## మహనీయమగు గీతి

మహనీయమగు గీతి మాధవా! రచియించి
నీ కర్పణముసేయ నిండినా మదినీ!

అడ్డంకు లెన్నియో ఆవతరించెను స్వామి!
చంద్రకిరణంబులకు జనుదెంచు మేఘముగ!

మహనీయమగు గీతి! మాధవా రచియించి
నీకర్పణము సేయ నిండినా మదినీ!

మనసులో భావములు మానుగా మాయమై
మాధవా! నీజ్యోతి మాసిపోయెను గనగ!
శ్రీ మనోహరమైన చిందేటి వాణియును
చేతితో ఘంటమును చిత్రముగ యాగెనూ! ॥మహ॥

కిన్నెరా తీవెలును ఖన్నుగా దెగిపోయె
మఱల గూర్చుటలోనె మది యంత స్థిరమాయె!
మఱచిపోయినగీతి మఱి స్మరణ దెచ్చుటకు
జల్లువానలు గురిసి చల్లగా వెలిసినటు! ॥మహ॥

పాటలో నున్నట్టి పదములను మఱచినటు!
పాటలో గలయట్టి భావమును మఱచినటు!
అనిపించుచున్నదీ యఖిలాత్మ నే నెటుల
పాటవ్రాయుదు స్వామి! ఖన్నుగా నిను దలచి!

సమకూర్చు కొనుటలో సమయమంతయు జరిగె
విధివ్రాత నేమందు! విపరీతములు కృష్ణ!
విఘ్నేశ్వరుని బంపు! విఘ్నములు దొలగింప!
ఉంగ్రాళ్ళతో శక్తి ఉల్లాసమున జేతు!

## ఆకాశ చుక్కలా!

ఆకాశ చుక్కలా యలరి పయనించుచును
సంద్రాన రాలగా సహజమగు వాంఛా!

అందాలు చందాలు నలరు ఓ చెలులార!
కలత నలతల నొంది కన్నీరు నింపకుడు!

ఆకాశచుక్కలా యలరి పయనించుచును
సంద్రాన రాలగా సహజమగు వాంఛా!

ఇన్నాళ్ళు మీతోని యింపుగా మెలగుచును
స్నేహ సౌహార్ద్రతలు జిందితిమి మనమంత!
ఇచ్చి పుచ్చుకొనుచు నిందిరా రమణునీ
పాడితిమి యాడితిమి బరగ వనవీధినీ! ॥ఆ॥

కలువ తామరపూల కొలని లోపల దెచ్చి
మాధవుని కర్పించి మనసార భక్తితో!
పూజలను జేసితిమి పున్నమీ రాత్రులను
రాసక్రీడల నాడి రమ్యముగ వనవీధి! ॥ఆ॥

మాధవుని గలియగా మధురమగు కాంక్షతో
బోవుచుంటిని చెలులు! పొందుగా నను గూర్చి!
మదియందు వ్యధనంది మనసులో గుందుచును
కన్నీరు నింపకుడు కదులు ముత్యముల వలె!

ఆకాశ మార్గాన అలరి పయనించుచును!
చుక్కవలె రాలుదును సూటిగా సంద్రాన!
ముత్యమయ్యెదను నే మోదముగ కృష్ణునికి
నాసాగ్రమందునను నవ మౌక్తికము నగుడు!

## బహు దూరమున నున్న

బహు దూరమున నున్న బాంధవా! నీ కడకు
అందాల హంసనూ అలరి బంపితినీ!

విన్నవించును నీకు విమలమగు పదములను
నా విరహవేదనను నళినాక్ష! వినుమా!

బహు దూరమున నున్న బాంధవా! నీ కడకు
అందాల హంసనూ అలరి బంపితినీ!

కొండలను కోనలను కూర్మి మైదానములు
దాటి వచ్చినదిసుమ! దర్శింప నిన్నూ!
నా వేదనలను గని నయముగా దెలుపుటకు
పయనించి వచ్చినది పద్మనాభా! వినుము! ॥బహు॥

హంసపద ధ్వనులతో అలరాగములతోని
అభినయించుచు దెలుపు అలరి నా వేదనను!
మల్లె పూ దండగా మధురముగ ముత్యాలు
దండ చేర్చిన యటుల యండ నీవే యనుచు! ॥బహు॥

ప్రతి నిముసమును గూడ బడు నాదు వేదనను
కన్నీరు ప్రవహించి మున్నీట గలిసినటు!
విరహవేదన నంత విపులముగ దెలుపునూ!
మన్నించి విను కృష్ణ! మధురమగు నా వినతి!

బహుదూరమున నున్న బాంధవా! నీ కడకు
అందాల హంసనూ అలరి బంపితినీ!

## దాపునకు వచ్చి నిను

దాపునకు వచ్చి నిను దర్శింపకున్ననూ
హృదయారవిందమున సదయ! నినుగాంతూ!

కనులెదుట నీ రూపు దర్శింపకున్ననూ
కనులలో నున్న నిను గాంతు శ్రీకృష్ణా!

దాపునకు వచ్చి నిను దర్శింపకున్ననూ
హృదయారవిందమున సదయ! నిను గాంతూ!

గుడిగోపురము అందు జూడ యోపిక లేదు!
కొండ శిఖరంబులకు కోరి జేరగ లేను!
మైదానముల దాటి మరుప్రదేశము అందు
కనలేను నిను కృష్ణ! కమనీయ రూపమును! ॥దాపునకు॥

మహనీయు లందించు మధురమగు సత్యముల
విననోచుకోలేదు గనలేను వారలను!
అన్ని వదిలి నిన్ను సన్నుతించుచు నుంటి!
మనసు మందిరముగా మాధవా! నిను నిలిపి! ॥దాపునకు॥

మనసున్నచో నన్ను మన్నింపగా వచ్చు!
వినదలచుచో మనవి వినవచ్చు మాధవా!
దాపరికం బేల దయలు నీకున్నచో
నీ మురళిలో గలిపి నిఖిల శాంతిని నిమ్ము!

దాపునకు వచ్చి నిను దర్శింపకున్ననూ!
హృదయారవిందమున సదయ నిను గాంతూ!

## కనురెప్పలను దాగి

కనురెప్పలను దాగి కదలకను యుండినా
నిను జూడవలె ననుచు నెమ్మదిని వెదికి!

గిరి నదులు గగనమును సరసులను పూపొదల
వెదుకుచుంటిని స్వామి! విమలమగు తావులను!

కనురెప్పలను దాగి కదలకను యుండినా
నిను జూడవలె ననుచు నెమ్మదిని వెదికి!

నిను వెదుకుచున్నటుల నను వెదుకుచుంటివని
నీ ప్రేమ నందీయ నిఖిల! తన్మయముతో
కలువ తామరలనూ కమనీయ హంసలను
అడుగుచున్నావనుచు అలరి సఖి తెలిపినది! ||కను||

నా ప్రేమ నందీయ నలుగుచుంటినో యెటుల
నీ మురళిలో గలుప నిండు హృదయమునా
నా కిన్నెరను పాట నయముగా వినదలచి
ఆరాట పడుచుంటివని సఖియ పలికినది! ||కను||

ఆత్మీయ బాంధవుని యలరి జూచెడి కోర్కె
చిరకాల మిత్రునీ చేరదలచిన కోర్కె!
ఈ గోప కాంతపై యింపుగా గలదనుచు
స్నేహార్ద్ర భావమున చెలి పలికె మధురముగ!

కనురెప్పలను దాగి కదలకను యుండినా
నిను జూడ వలెననుచు నెమ్మదిని వెదికి!

## అంతటా నిండినా

అంతటా నిండినా అలరు శ్రీకాంతునీ
వెదుకగా నేల? మది వ్యథ జెంద నేలా?

వసుధ గగనమునందు పలనొప్పు తారలను
గాలిలో నీటిలో గలడు అణువణువునను!

అంతటా నిండినా అలరు శ్రీకాంతునీ
వెదుకగా నేల? మది వ్యథ జెందనేలా?

అణువణుపు నిండినా అఖిలేశ్వరుని హరిని
అతని వెదుకగ నేల? అలసిపోవుట యేల?
కనులలో నున్నట్టి కమలాక్షు దర్శింపు!
మనసులో నున్నట్టి మాధవుని దలపూ! ॥అంతటా॥

గిరుల కానలయందు కిన్నెరను జేపట్టి
విలపింప నేమిటికి? వేదనను గనవేల?
కుటియందు ధ్యానింపు కూర్మి జీవులకునూ
బాధలను దొలగించి భద్రమును జేకూర్పు! ॥అంతటా॥

వేదనల రోదనల వెత జెందు వారలకు
కన్నీరు బోదుడిచి కష్టముల దొలగించి!
ఆత్మ విభు జేరుటకు నలరి యత్నింపుమని
కాంతి కిరణము బలికె కమ్మనీ హితవునూ!

అంతటా నిండినా అఖిలేశ్వరుని హరిని
వెదుకగా నేల మఱి వ్యథ జెంద నేలా?

## నా నోటి పాటంటె!

నా నోటి పాటంటె నవనీత యెందుకో!
నీ మనసు కరుగునట నిరవధిక రక్తి!

పాట వినుటకు గాను పరవశముతో వచ్చి
కుటిముందు నిలుతువట! కూర్మి యాసక్తితో!

నా నోటి పాటంటె నవనీత యెందుకో
నీ మనసు కరుగునట నిరవధిక రక్తి!

చిన్నారి పొన్నారి చిట్టి పదముల తోని
మాటలే రానట్టి మధుర శిశువును బోలె
పాడుకొనుచుందునూ పద పొందికయు లేక
ఆ పాటలే నీకు నాత్మీయ మగునటా! ॥నా॥

సెలయేటి యొడ్డులను కొలని గట్టుల పైని
చెట్ల నీడలయందు చిరుగాలి తరగలను
మనసు కొచ్చిన పాట మఱి రాగధ్వనిలేక
పాడుకొను పాటలే పరమ ప్రీతట నీకు!

మనసులో పాడుకొను మధుర గీతము వినక
కుటిముందు నిలుచుండి కూర్మి నైరాశ్యమున
వెడలిపోవుదు వనుచు వేడుకను జెప్పినవి
కొమ్మపై గోరింక కోకిలలు తుమ్మెదలూ!

నా నోటి పాటంటె నవనీత! యెందుకో!
నీ మనసు కరుగునట నిరవధిక రక్తి !

# కన్నీటితో గూడి

కన్నీటితోగూడి కలవరము దొలికేటి
దుఃఖాశ్రు గీతములు దోరముగ యేలా?

మనసు పొంగించేటి మదికింపు గూర్చేటి
ప్రణయగీతము మాకు ప్రీతి కావలెనూ!

కన్నీటితో గూడి కలవరము దొలికేటి
దుఃఖాశ్రు గీతములు దోరముగ యేలా?

అనుచు కోకిల చెలియ యటు కానలకు బోయె
మావి చిగురులు మేయ మధురగీతము బాడ!
చిఱునగవు నవ్వుచును జిందించుచును జిలుక
మాటలే కావలెను మఱి పాట లెందుకని? ॥కన్నీటితో॥

మాట మంతిలేని మౌన గీతము లేల?
సంగీతమును లేని సవ్వడులు లేనట్టి
పాట మేమును గూడ బాడలే మనుచునూ
సెలయేటి తరగలును గలగలా బరుగెత్తె! ॥కన్నీటితో॥

హంసమాత్రము వచ్చి యభినయముతో గూడి
శ్రీకాంతు గీతమును చిత్తమున బాడుకొని!
మధురాశ్రు బిందువుల మానుగా రాల్చినది!
తొలివర్ష బిందువులు దోరముగ నొలికినటు! ॥కన్నీటితో॥

మీ కోసమని నేను మెప్పుగొన పాటలను
బాడుకొనుటయు లేదు! బరగ నా మది యందు!
చిత్తమును అర్పించి శ్రీమనోహరు కొఱకు
పాడుచుంటిని చెలులు ప్రణవ నాదముతోడ! ॥కన్నీటితో॥

## మనసులో నున్నట్టి

మనసులో నున్నట్టి మాధవా! ని న్నెటుల
పూజింతునో స్వామి! పులకరించుచునూ!

అంతటను నిండినా అఖిలేశ్వరుడ వీవు!
మాలికను నర్పించి మమత యెటు పూజింతు?

మననులో నున్నట్టి మాధవా! నిన్నెటుల
పూజింతు నో స్వామి! పులకరించుచునూ!

మాటలను యెటుల నే మనవి జేయుదు కృష్ణ?
అఖిలాత్ముడవు నీవు ఆలరి యుంటివి గదా!
కిన్నెరను మీటుచును కీర్తనను బాడుదును?
ఏ రూప నామముల నింపుగా బేర్కొనుచు? ॥మనసులో॥

ఆత్మలో నున్నట్టి ఆనంద జ్యోతివీ!
మనసు మాలిన్యమును మమతతో బోగొట్టి
నీవు జూపిన దారిలో నేను నడుచుటయు
సరియైన బాట యని చక్కగా గుర్తింతు! ॥మనసులో॥

నీ జ్యోతియే గదా! నిఖిల జీవులయందు
వెలుగుచున్నది గదా! వెన్నెలా రాత్రి వలె!
నే నొక్క కిరణమును నీ మహాయాత్రలో
నీతోని పయనించు నే నొక్క పథికుడను!

మనసులో నున్నట్టి మాధవా! నిన్నెటుల
పూజింతునో స్వామి! పులకరించుచునూ!

## లోకమంతా నిన్ను

లోకమంతా నిన్ను లోలతను వేదనను
పిలుచుచున్నది కృష్ణ! ప్రీతి మై మఱచి!

ఆపదల నుండి మము ఆదుకొమ్మనుచునూ
బహు బాధలను బాపి బరగ రక్షింపుమని!

లోకమంతా నిన్ను లోలతను వేదనను
పిలుచుచున్నది కృష్ణ! ప్రీతి మై మఱచి!

నేను గూడను స్వామి! నిండు హృదయముతోని
పిలుచుచుంటిని యఱచి ప్రీతి రంజిల్లగను
నీ మురళిలో నన్ను నింపుగా గలుపమని
బరువైన కోరికను బరగ యడుగుచు నుంటి! ॥లోక॥

ముందుగా లోకమును మందస్మితముతోని
ఆదరింపుము స్వామి! ఆపదను దొలగింపు!
జనుల కన్నీటినీ జార్చి కరుణను ప్రేమ
తొలగింప శ్రీకృష్ణ! తోరముగ వేదనల! ॥లోక॥

ముందు వారిని గాచి మోదమును జిందుచును
ఆదుకొను పరమాత్మ! అలరి నా కోరికను!
బాధలను సహియింప బలము నా కొసగితివి
స్వేదాశ్రువుల జింత చిఱునవ్వు నొసగితివి!

లోకమంతా నిన్ను లోలతను వేదనను
పిలుచుచున్నది కృష్ణ! ప్రీతి మై మఱచి!

## తరులార! విరులార!

తరులార! విరులార! తన్మయముతో గూడి
కదులు చున్నారలో కమనీయముగనూ!

ఒక్కొక్క పూవునూ యొనరరాల్చుచు భువిని
మచ్చికను బూజింప మది దలచు చుండిరో!

తరులార! విరులార! తన్మయముతో గూడి
కదులు చున్నారలో కమనీయముగనూ!

ఆ దేవ దేవునీ యా వాసు దేవునీ
నే గూడ పూజింప నిరతమును భక్తితో!
అంజలిని పూలతో నలరాదు చుంటినీ
నే గూడ బూజింతు నిఖిలేశ్వరుని హరిని! ॥తరులార॥

కమనీయ తరులతలు కరుణతో నిటు బలుక
తలలొంచి ధరణిపై తగ పూవులను రాల్చి!
అర్పించు చుంటిమీ! యలరి మానసమందు
శ్రీహరిని గాంచుచును చిత్తమును హర్షింప! ॥తరులార॥

ఎచ్చటో లేడు మఱి యేకేశ్వరుడు నతడు
నీలోను నాలోను నిఖిలమందున గలడు!
అంతటా గలవాని యలరి యెటు జూపెదము
మానసము నందునా మౌనముగ పూజింపు!

తరులార! విరులార! తన్మయముతో గూడి
కదులుచున్నారలో కమనీయముగనూ!

## నీలి గగనము కృష్ణ!

నీలి గగనము కృష్ణ! నీ రూపమని దలతు
నీలిమేఘము నాదు నిండు మనసనుచూ!

వర్ష జలధారలను హర్ష పులకితమునౌ
నీ కరుణ ధారలని నెమ్మదిని దలచెదను!

నీలి గగనము కృష్ణ! నీ రూప మని దలతు
నీలిమేఘము నీదు నిండు మనసనుచూ!

పెనుమేఘ గర్జనల ప్రీతి యభయ మటంచు
మెఱుపు దీవెలను నీ మేని భూషణములని!
మెల్లగా వీచేటి చల్లనీ గాలులను
నీ యాగమన మనుచు నిండు మది దలచెదను! ॥నీలి॥

నవధాన్యములు బండు నవఋతువు గల్పించి
వర్షధారలచేత వర్థిల్ల జేయుదువు!
కానరాకుండగనె కానుకలనిచ్చి మఱి
హర్షింపజేయుదువు అఖిల జీవులకునూ!

నాకేమి కావలెనో నళినాక్ష! కోరనూ!
దీపమును వెలిగించి దీక్ష నిను వెదుకనూ!
నాకేమి కావలెనా! నా పను లవేమిటో!
నిర్ణయింవగ నీవె! నిండు హృదయము తోని
భావింతు నీ వెలుగు బాట జూపును నాకు!

నీలి గగనము కృష్ణ! నీ రూపమని దలతు
నీలిమేఘము నీదు నిండు మనసనుచూ!

## కనులలో నుండి నను

కనులలో నుండి నను గాంచు చుందువు కృష్ణ!
కాపాడుమని నిన్ను కరుణ వేడగ నేల?
మనసులో నున్నట్టి మహనీయ రూపమును
గానకను కానలను కలత దిరుగుచునుంటి!

కనులలో నుండి నను గాంచుచుందువు కృష్ణ!
కాపాడుమని నిన్ను కరుణ వేడగనేల?

మధురమగు నీ మురళి మాధుర్యమును వినక
కిన్నెరను మీటుచును కీర్తన లవేలనో!
శ్రీ మనోహరమైన చిద్విలాసము గనక
అందందు ప్రకృతిని యడిచి పిలుచుట యేల? ॥కనులలో॥

కనులలో దొలికేటి కరుణాశ్రు బిందువును
ఆనంద భాష్పముగ యలరింపు మోదమున!
పెదవులలో జిందు ప్రీతితో జిఱునగవు
మనసునందున గనుము! మహనీయ జ్యోతినీ! ॥కనులలో॥

కాఱడవులందునను గదిలిపో! భయపడక
చిమ్మ చీకటులందు జీకు చింతను వదులు!
పరమేశు డంతటను ప్రబలియున్నాడనుచు
గమ్యమును చేరుకో! కామితార్థము నంద!

కనులలో నుండి నను గాంచుచుందువు కృష్ణ!
కాపాడుమని నిన్ను కరుణ దేడగ నేల?

## ఏ దేవ దేవుని

ఏ దేవ దేవునీ యింపుగా భజియించి
పూజించు చుంటివో పొలుపుగా దెలుపూ!

తోడిదెచ్చెద మనుచు దోరముగ హంసయును
మధురముగ బలికినది మాధుర్యమును చింద!

ఏ దేవదేవునీ యింపుగా భజయించి
పూజించుచుంటివో పొలుపుగా దెలుపూ!

ఆడుచును బాడుచును ఆలమందల యందు
మురళి వాయించేటి ముద్దు గోపాలునా?
శబరి కోర్కెను దీర్ప చింది దర్శనమిచ్చి
శ్రీరామచంద్రునీ చిత్తమున దలచితివ? ॥ఏదేవ॥

గంగనూ జటదాల్చి సంగతిగ ధరణికిని
పంపినా పరమేశు బరగ దలచితివా?
పాడుచుంటివి సఖియ! ప్రణవగీతము దెలుపు!
తోడిదెచ్చెద మిపుడు తొలిరేఖలకు ముందు! ॥ఏదేవ॥

అని బలుక హంసతో అలరి బలికితి నేను!
మనసులోనీ చింత మాపుచును చెలియరో!
నా హృదయ జ్యోతిలో నయముగా వారంత
గూడియుండిరి చెలియ! కోరి పిలువగ నేల?

వారందఱును గూడ నా దివ్యజ్యోతిలో
నున్నారు చెలియరో! యొనర పూజించెదను!

# ఆత్మీయ భావమున

ఆత్మీయభావమున యంతటను గనుగొనెడి
చిత్తమును ధరియింపు జివురు పూవులతో!

వేఱు భావములేక వ్యథ జెందువారినీ
కన్నీటి చే దుడిచి గాంచుమా దయతోని!

ఆత్మీయ భావమున యంతటను గనుగొనెడి
చిత్తమును ధరియింపు జివురు పూవులతో!

పయనించువారినీ పరగ గమ్యము జేర్పు!
అలసిపోయినవారి యలసటను దీర్పుమా!
మబ్బులను చంద్రుండు మఱల కనబడినటుల
వెన్నెలను జల్లుమా వినువీధి యంతటను! ॥ఆత్మీయ॥

బ్రదుకు భారముగాగ భారమున గ్రుంగేటి
పేద సాదల నెపుడు బ్రీతిగా గనుగొనుము!
మునిగిపోయే పడవ మఱగేటి జీవులను
చేయూత నిడి వారి జేర దరి జేర్పుచూ! ॥ఆత్మీయ॥

కలిసి పయనింపుమా! కలిమి లేముల యందు
కాఱుమబ్బులయందు విమల పథమును జూపి
వెన్నెలను గురిపింపు విమల పథమును జూపి
మాధవుని దర్శింప మది కలత తొలగింపు!

ఆత్మీయ భావమున యంతటను గనుగొనెడి
చిత్తమును ధరియింపు జివురు పువ్వులతో!

## తొలికాఱు మబ్బులను

తొలికాఱు మబ్బులను దోరంపు నిగ్గులను
అతడుండునే చెలియ అతడుండునే!

వాసంత ఋతువులో వన్నెలా పూవులను
అతడుండునే చెలియ అతడుండునే!

తొలికాఱు మబ్బులను దోరంపు నిగ్గులను
అతడుండునే చెలియ! అతడుండునే!

వర్షఋతువూనందు వన్నెలను చిందేటి
హరివిల్లులో రంగు లాతడేనే చెలీ!
ఏడురంగులలోన విలసిల్లి జగమంత
కానబడు నాతడె కమనీయ రూపమున! ॥తొలికాఱు॥

కలువ తామరలతో కాంతులను విలసిల్లు
శరదాగమంబునూ చారు సుందర శోభ!
అందములు రాజిల్లు నల సూర్యచంద్రులును
అతడేనే చెలియ! ఆ కృష్ణుడేనే! ॥తొలికాఱు॥

ఉభయ సంధ్యలుగూడ నుదయించు తారలును
అన్ని ఋతువులలోని అందాలు అతడే!
అఖిల జీవులయందు అంతర్గత జ్యోతి!
అతడేనే చెలీ! ఆ చిన్ని కృష్ణుడే!

ఆ చిన్ని కృష్ణుడే అఖిల జీవులయందు
జ్యోతిగా వెలుగుచును ప్రీతి జేయునుగదే!
సృష్టిలో సౌందర్య శోభలను వర్థిల్లు
జీవులను ఆతడే తన్మయముతో నుండు!

## అందఱును మన వారె!

అందఱును మనవారె ఆత్మీయ బంధులం
పరులెవ్వరును లేరు బరగ వీక్షింపా!

ఒక జ్యోతిలోనుండి యొనర కిరణాలమై
విశ్వమంతా నిండి యున్నవారందఱును!

అందఱును మనవారె ఆత్మీయ బంధులం!
పరులెవ్వరును లేరు బరగ వీక్షింపా!

మబ్బులలో నుండు మధురమగు జలములను
సంద్రమున నుండేటి చారుముత్యములునూ!
ఉదయించు సూర్యునీ సదయ కిరణంబులును
చంద్రునీ వెన్నెలలు చారు పర్వతములును! ॥అందఱును॥

సృష్టిలో గలయట్టి చోద్యములు అన్నియును
రంగురంగుల యందు రమణీయ మంతయును!
ఒక్కటే ఒక్కటె ఒక్కటే మనమంత
ఒక్కటే పరమాత్మ! యొనర జీవాత్మలము! ॥అందఱును॥

ఒక కుదురుగా నుండి వన్నెలను జిందితిమి!
సృష్టి యంతయు చూడ సురచిరంబుగ మనం!
ఒక్క కుటుంబము మనది యొకరగా మనమంత
అన్నదమ్ములము మఱి యాత్మీయ బంధులం!

అందఱును మనవారె! ఆత్మీయ బంధులం!
పరులెవ్వరును లేరు! బరగ వీక్షింపా!

## గుడిమెట్ల క్రిందనే

గుడిమెట్లక్రింద నే గూర్చుంటి దూరమున
కొంగుజాపి నీదు గోరుచును భిక్షా!

మాసినా వలువతో మలినమగు రూపైన
నిను వేడుచుంటినీ నీపాట పాడుతూ!

గుడిమెట్ల క్రింద నే గూర్చుంటి దూరమున
కొంగుజాపి నీదు గోరుచును భిక్షా!

జనమంత గుడిజేరి జాజులను మల్లెలను
నీ పూజలను జేసి! నిండు నైవేద్యముల!
అర్పించి గృహములకు అలరి పళ్లెములతో
నను జూచి దూరముగ నడిచిపోవుచు నుండె! ॥గుడి॥

గుడిదీపములు వెలిగె కూర్మి జన మంతయును
గృహములకు జనిరి వే సహనమును గోల్పోయి!
ఆటులనే నేనుండి ఆలయము జూచుదును
కన్నులను భాష్పాలు గదులుచుండగ వేగ! ॥గుడి॥

సంధ్య చీకటులాయె చక్కనీ చుక్కలును
వికసించె గగనమున విరుల తోటకు మల్లె!
కుటి జేరి జూతుగద! కూర్మితో నా వాడిని
మందార పుష్పమును సుంధరంబుగ నుండె!

గనలేక పోతి నిను కన్నులతో పరమాత్మ!
నీ ప్రేమ భిక్ష యని నిండుగా దలచితిని!

## ఎచటికని ప్రశ్నించి

ఎచటికని ప్రశ్నించి వేధింప బోకుడూ
ఏ దేశమని బలికి యిమ్ముగా నడిగి!

గాయబరుపకుడమ్మ కమిలినా నా మదిని
వేయి సూదులు గ్రుచ్చి వికలతను గూర్పకుడు!

ఎచటికని ప్రశ్నించి వేధింప బోకుడూ!
ఏ దేశమని బలికి యిమ్ముగా నడిగి!

హరికి నా మనసిచ్చి యారాటమును జెంది
పుడమి నంతయు వెదికి పౌలుపుగా గగనమును
వెదుకుటకు సిద్ధపడి విమలతను తారలను
వీక్షించు చుంటినీ విమలమగు గగనమును! ॥ఎచటికని॥

కనులు మూసినగూడ కనుదెఱచి చూచినా
అతడే కనిపించు అందాల మురళితో!
తారలును చంద్రుడును దగ సూర్యకాంతులును
సంధ్యలగుపింపవే చారు సుందరముతో! ॥ఎచటికను॥

ఆకాశ మల్లియగ యటు నేను రాలినా
నన్ను స్పృశియింపుడూ నా పూర్వ చెలులార!
కుటిలోని కిన్నెరను కూర్మి తోడను దెచ్చి
పాడు డెవరయిననూ పద్మనాభుని గీతి!

ఎచటికని ప్రశ్నించి వేధింప బొకుడూ!
ఏ దేశమని బలికి యిమ్ముగా నడిగి!

## విభుని కౌఁగిలికై నేను

విభుని కౌఁగిలికై నేను వినువీధి యందునా
పయనించుచుంటినీ బరగ వినరమ్మా!

చుక్కలను రిక్కలను చోద్యముగ గ్రహములను
అధిగమించుచు నుంటి అందాల జ్యోతివలె!

విభుని కౌఁగిలికై నేను వినువీధియందునా
పయనించు చుంటిసే బరగ వినరమ్మా!

మనసు లగ్నముజేసి మాధుర్యమును జింద
విభుని రూపమును నా మదియందు నిలుపుకొని!
పయనించు కాంతివలె బరగ బోవుచునుంటి
అడ్డెవరు రాకండి! అలరి నన్నాపకుడు! ॥విభుని॥

నా విభుడు గూడనూ నా కౌఁగిలికు జూచుచును
మురళిలో గలుపుకొన మోదమున నిలిచెనట!
అంతరంగమునందు నార్ద్రితను గలుపుకొన
వేచియున్నాడనుచు విమల జ్యోత్స్నలు దెలిపె! ॥విభుని॥

ఎన్ని జన్మలు గడిచే యెన్నెన్ని పుట్టువులు
తిన్నగా హరి గలియ దీరుగా యత్నించి!
ఈ బ్రతుకులో నతని నింపుగా గలిసికొని
ధన్య నగుదును చెలులు తలవని తలంపుగా!

విభుని కౌఁగిలికై నేను వినువీధి యందునా
పయనించుచుంటినీ బరగ వినరమ్మా!

అంతర్గతంబయిన ఆ జ్యోతి యుండగా
దీపాల నెందుకూ? దివిటీ లవేలా?

కారడవి లోపలను కటిక చీకటి యందు
నా హృదయ జ్యోతియే నయముగా దరిజేర్చు!

అంతర్గతంబయిన ఆ జ్యోతి యుండగా
దీపాల వెందుకూ? దివిటీ లవేలా ?

సూర్యు డొచ్చేదాక చంద్రుడుచ్చేదాక
కను లప్పగించి నే గాంచుచుండగ లేను!
మిణుగురులే నాకు మిన్నుగా స్నేహితులు!
తారలే నాకు మరి దారి జూపేవారు! ॥అం॥

తగు యత్నమును జేసి దారి నే దెలిసికొని
పయనింతు పరమాత్మ పరగ నీ దగ్గఱకు
పరులయాచన జేసి పరుల సాయముతోని
కనలేను నిను స్వామి! కమనీయ రూపమును! ॥అం॥

వెదుకగా లేను నే వేల దీపాలతో
సూర్యకాంతులతోని సురుచిరంబుగు కాంతి!
నా హృదయ కిరణమున నయముగా నిను జూతు!
ఏ లోకమున నున్న యెంత దూరంబునను
ఆత్మసాధన తోడ యరిరి నిను గాంచెదను!

అంతర్గతంబయిన యాజ్యోతి యుండగా
దీపా లవెందుకూ? దివిటీ లవేలా?

## గొప్పవారల స్నేహ

గొప్పవారల స్నేహ మొప్పుగా గోరనూ!
దుక్కలందున నిలిచి నిక్కి యుండెదరూ!

డాంబికము జూపుచును దగ్గఱకు రాకుండ
దూరదూరము నుండి దోసముల గనుచుంద్రు!

గొప్పవారల స్నేహ మొప్పుగా గోరనూ
చుక్కలందున నిలిచి నిక్కియుండెదరూ!

మమతతో ప్రేమించి మాటాడ బోరుగద!
తిన్ననీ దయజూపి సన్ననీ చూపులను!
అధికార గర్వమున యలరుచుందురు వారు
గొప్పవారల మనుచు నొప్పుగా మది దలచి!

గొల్ల పిల్లలతోని కూర్మి స్నేహము జేసి
ఆటపాటలతోని యాడుకున్నట్లుగా!
కోతులను గూడికొని కూర్మి చరియించినటు
అటువంటివారితో నలరి చరియించెదను!

పయనించు సమయమున బరగ సములగు వారి
సాహచర్యమునందు దగ కృతార్థుడ నౌదు!
అన్యోన్య స్నేహమున అలరి యాత్రను జేతు
ఆదుకొను స్నేహితులు ఆత్మబంధులు వారు

గొప్పవారల స్నేహ మొప్పుగా కోరనూ!
చుక్కలందున నిలిచి నిక్కియుండెదరూ!

## నిండారు అర్హతయు

నిండారు అర్హతయు దండిగా నాయందు
ఉన్నదియు లేనిదియు నూహింపలేనూ!

కడలందు నిలిచెదను గడగి ఆలయమందు
నీదు రాకడలనూ నిలిచి గనుచుండెదను!

నిండారు అర్హతయు దండిగా నాయందు
ఉన్నదియు లేనిదియు నూహింపలేనూ!

సంధ్యకాంతులయందు దగ నేను గలియుటకు
అర్హమగు స్థానమును నందుకో లేనేమొ!
నీ పాదపద్మముల నీరాజనం బగుచు
వెలుగుచుండగ కోర్కె వేల దీపాలలో! ॥నిండారు॥

భాస్వరంబగు నీదు భవ్య దివ్యజ్యోతి
కలియుటకు నర్హతయు గలదొ లేదో మఱి!
గుడి శిఖరమందునా గూడి యొక కిరణమై
వర్తింప జేయుమా వనర చిఱు కాంతిగా! ॥నిండారు॥

నీ పూర్ణ బింబమున నిలిచి యుండగ నేను
పదునాఱు కళలతో బరగ వర్తింపగా
అట్టి భాగ్యము లేమ అందుకే గోపాల!
నెలవంక బాలునిగ నెలవింక నిప్పింపు!

నిండారు అర్హతయు దండిగా నాయందు
ఉన్నదియు లేనిదియు నూహింపలేనూ!

## హరి యేపుడు వచ్చునని

హరి యెపుడు వచ్చునని యాశతో నడిగితిని
కొమ్మపై కోకిలను గూర్మి ప్రశ్నించి!

సంగీత ధ్వనులతో చక్కనీ గీతమున
పాడుచును నడిగితిని పరమేశు వార్తా!

హరియెపుడు వచ్చునని యాశతో నడిగితిని
కొమ్మపై కోకిలను గూర్మి ప్రశ్నించి!

నాట్య మయూరమును నయముగా నడిగితిని!
రమ్యనర్తనలతో నావిభుని గూర్చి!
ఎదురుజూచుచు వాని విమలమగు పద ధ్వనుల
వినగోరుచుంటినని విమలమగు వచనముల! ॥హరి॥

సెలయేటి సవ్వడుల చారుసుందర ధ్వనుల
తపియించుచును మదికి తత్తరం బగుచునూ!
ఎంతదూరమున నా విభుడున్న వాడనుచు
నిలిపి ప్రశ్నించితిని నీరవంబగు ధ్వనుల! ॥హరి॥

అడిగినా వారంత యంతరంగము నందు
అలత కలతయు జెంది అలరి పలికిరి చెలులు!
నీయంతరంగమున నిఖిలేశు డట గలడు!
విశ్వమంతా వెదికి వెతజెందగా నేల?

హరి యెపుడు వచ్చునని యాశతో నడిగితిని
కొమ్మపై కోకిలను గూర్మి ప్రశ్నించి!

## గుడిమెట్ల క్రింద నే

గుడిమెట్ల క్రింద నే కూర్చొని యుంటినీ
నీప్రేమభిక్షకై నిండారు భక్తి!

రాలేను నీదరికి రమ్యమగు గుడిలోకి
నీవె దిగి రావలెను నిండారు దయతోని!

గుడిమెట్ల క్రింద నే కూర్చొని యుంటినీ
నీప్రేమ భిక్షకై నిండారు భక్తి!

కనుల నాలికే నీరు కనులలో దాచెదను
వెలికి గనబడనీక, విమలమగు నాహృదిని!
వెలువడే వేదనను వెలువడక యణచెదను
పొంపొంగార్చినటు బన్నుగా నీటితో! ॥గుడి॥

పథికు లెవరైనను పన్నుగా దరికొచ్చి
ఎవరివని ప్రశ్నింప వివరింపకను మదిని
వెలువడే వేదనను వెలుపలకు రానీక
మౌనమూనెద స్వామి! మాటాడ కుండగను! ॥గుడి॥

నీవె గుడిమెట్లన్ని నిండినా ప్రేమతో
దిగి నడిచి రావలెను దీనురాలిని గావ!
అనాటివఱకు నే నటులనే కన్నీరు
హృదయవేదన నంత సదయ దాచెద మదిని!

గుడిమెట్ల క్రింద నే కూర్చొని యుంటినీ!
నీప్రేమ భిక్షకై నిండారు భక్తి!

## ఆరుద్ర కార్తె యిదె!

ఆరుద్రకార్తె యిదె! యరుదెంచె ప్రకృతిని!
వర్ష మేఘముతోని వన్నెలను జిందే!

ఆకాశమంతయును నలరె మేఘములతో
ఉరుములను మెఱుపులను నుల్లాసభరితమై!

ఆరుద్రకార్తె యిది! యరుదెంచె ప్రకృతిని
వర్షమేఘముతోని వన్నెలను జిందే!

పచ్చనీ పచ్చికల పరిమళము వ్యాపించె
విచ్చినా మొగిలిరేకులుగూడ తలలూపె!
చల్లనీ గాలులను తరులతలు అన్నియును
చిత్రముగ తలలూపి శిరులు నింపుచునుండె! ॥ఆరుద్ర॥

ఆరుద్ర పురుగులును అంతటను ధరణిపై
చిత్రకంబళులనూ చెన్నుగా జిత్రించె!
వెండి మతాబులను వేడుకను వెలిగించి
గగనమంతయుగూడ కడు సంతసము నందె! ॥ఆరుద్ర॥

ఏ దిక్కునుండియో! యేదిశల నుండియో
వినబడుచునున్నదీ వేణుగానపు రవళి!
నావిభుడు వచ్చునని నామదికి దోచెడిని
భువియు దివియును గూడ పులకరించెను నేడు!

ఆరుద్రకార్తె యిదె! యరుదెంచె ప్రకృతిని!
వర్షమేఘములతో వన్నెలను జిందే!

## మావికొమ్మల నిలిచి

మావికొమ్మల నిలిచి మధురముగ బాడేటి
కోకిలమ్మలుగూడ కూర్మి వచ్చెడినీ!

నా విరహమును దెలుప నా వ్యధను వివరింప
వచ్చుచున్నవి ప్రభూ! మచ్చికను నీ కడకు!

మావికొమ్మల నిలిచి మధురముగ బాడేటి
కోకిలమ్మలు గూడ కూర్మి వచ్చెడినీ!

మధురముగ బాడేటి మధురగీతము గాదు
కష్టగాధను దెలుపు కరుణగీతము స్వామి!
పాడేటిపాటలో భావమును గ్రహియించి
నిర్ణయింపుము స్వామి! నీ హృదయ ఫలకమున! ॥మావి॥

నల్లనీ రూపముల నళినాక్ష! గనుగొనుచు
నల్లగాదని దెలిపి వెళ్ళమన బోకుమా!
నామీద ప్రేమతో నీమీద భక్తితో
విన్నవించుచునున్న వినువీధి పక్షులవి! ॥మావి॥

పక్షులకు గూడ మది బరగ వ్యాకులమాయె
నానేత్ర బాష్పముల నయముగా గనలేక!
బహుదూర పయనమును బరగ జేసినవి ప్రభు!
మన్నింపు వాని మొఱ మది విచారింపుమా!

మావి కొమ్మలపైవి మధురముగ బాడేటి
కోకిలమ్మలుగూడ కూర్మి వచ్చెడినీ!

## ఒడి జాపుచుంటినీ

ఒడి జూపుచుంటినీ! యొనరగా నీయెదుట
ఇష్టమైనది యిమ్ము! యింపుగా దయనూ!

నీచేతి భిక్షయని నిండుగా మది దలచి
గ్రహియింతు ఘనముగా కమ్మనీ కానుకగ!

ఒడి జాపు చుంటినీ! యొనరుగా నీ యెదుట
ఇష్టమైనది యిమ్ము! యింపుగా దయనూ!

కటికచీకటియందు కాఱడవి యందునను
పయనింపుమని నన్ను బరంగ యానతి నిచ్చి!
పంపినను గూడ నే పయనింతు శీఘ్రముగ
కమనీయ మార్గమని గాంతు నే హృదయమున! ॥ఒడి॥

వేదనలనిచ్చి నను వెతలనిచ్చినగూడ
కన్నీటి వరదలను గల్పించిననుగూడ
చిఱునవ్వు నవ్వుతూ చిత్తమున హర్షమున
నీవు నడిపిన బాట నిలిచి పయనించెదను! ॥ఒడి॥

కోర్కెలేవియు లేవు గోవిందు నాదు మది
అంతరిక్షము నందు అల తారలకు వోలె!
పయనింతు మౌనమున బరగ కాంతులతోని
సెలయేటి తరగలుగ చిఱునవ్వు నవ్వుతూ!

ఒడి జూపు చుంటినీ! ఒనరగా నీ యెదుట
ఇష్టమైనది యిమ్ము! యింపుగా దయనూ!

## విశ్వమంతా నిన్ను

విశ్వమంతా నిన్ను వెదకి వేసారితిని
కనిపింపలేదు గద! కమనీయ మూర్తీ!

ఆత్మలో గల దంచు నల ప్రకృతియు దెలిపె
అంతర్మథనముచే నగుపించునని దెలిపె!

విశ్వమంతా నిన్ను వెదకి వేసారితిని
కనిపింపలేదు గద! కమనీయ మూర్తీ

భువియంత వెదికితిని భూరి గిరి శిఖరములు
కొండ కోనల యందు కూర్మి సరసులనన్ని
వెదికితిని గాని నీ విమల స్వరూపమును
కన్నులకు విందువుగ కనిపింపదాయె గద! ॥విశ్వ॥

వాడ వాడల నన్ని వీధి వీధుల యందు
కన్నీరను బాడుచును కీర్తించు చుంటినీ!
నిండు గొంతుకతోని నిను బిలిచితిని స్వామి
'ఓ'యనుచు బలుకవూ యోర్మి గోల్పోయితిని ॥విశ్వ॥

మనసులో నా ఆత్మ మర్మముగ బలికినది
హరి యెచటనో లేడు అరరి నీ యాత్మలో
సకల జీవుల యందు సహజముగ గల తతడు
అంతర్మథనముచే అగుపించు నా జ్యోతి
జ్యోతిలో అగుపించు ప్రీతి నీ వల్లభుడు!

విశ్వమంతా నిన్ను వెదికి వేసారితిని
కనిపింపలేదు గద! కమనీయమూర్తీ!

## లోకమంతా వ్యథను

లోకమంతా వ్యథను లోలతను నిండినది
చిగురులును, పువ్వులును, చిన్నారి తరువులును!

ఆలకింపు మటంచు అలరి నిను బిలుచుచును
మనసులో వేదనను మనవిసేయుచు నుండె!

లోకమంతా వ్యథను లోలతను నిండినది
చిగురులును పువ్వులును చిన్నారి తరువులును!

గిరి శిఖరముల నుండి ధరణి బడుచును వేగ
గల గలా ప్రవహించు సెలయేఱులును గూడ
హరి హరీ యని బిలిచి యాత్మ మథనముతోని
నిను బిలుచు చున్నవి నిరజాక్షా! గనుము! ॥లోక॥

చివురు పూవులతోని చిత్రముగ పుష్పించి
ఒక్కొక్క పువ్వునూ యొనర ధర రాల్చుచును!
తలలొంచి నను దలచి తగమనసు మథనమున
విలపించుచున్నవి విమలనుగు మౌనమున! ॥లోక॥

నీలాంబరములోని నీలి మబ్బులు గూడ
ఉరుములను మెఱుపులను యూహ కందని రీతి
మనసునను మథియించి మర్మముగ నీ జాడ
గనజూచు చున్నవి కల్యాణ గుణధామ! ॥లోక॥

మనసున మథియించి మర్మముగ నీ రూపు
ఆత్మయందున గనగ అరయ నీ దర్శనము
నిష్కామ కర్మమున నిరతితో జగమందు
వర్తింతు పరమాత్మ! వనర ముక్తిని జెంద ॥లోక॥

## అంతరంగము నున్న

అంతరంగముకున్న యలరు దివ్యజ్యోతి
వెదుకబోవుచు నుంటి వేణుమాధవునీ

బహుదూర యాత్ర యిది బరగబోవుచు నుంటి!
ఆశీస్సు లందించి యలరి బంపుడు చెలులు!

అంతరంగము నున్న యలరు దివ్యజ్యోతి
వెదుక బోవుచునుంటి వేణుమాధవునీ!

గాలికెరటాలలో కదిలేటి పూలతలు
కదిలేటి యలలవలె కదలనీయను మనసు!
శిలవోలె నుంచుదును చిత్తమును పరమాత్మ!
అరచేత నుంచుదును అబ్బురముగా చెలులు! ॥అంత॥

గోపాల బాలు డిదె కూర్మి నడుచుచునుండ
ఏ కష్టములు రావు! యే నష్టములు రావు!
పద్మవ్యూహము నందు బరగ అభిమన్యువలె!
చెరచెరా బోవుదును దిరిగి రాకుండగను! ॥అంత॥

జ్యోతి దర్శించి నే ప్రీతిహర్షము తోని
ఆ జ్యోతిలో నుంతు అలరి నా మాధవుని
కలత నలతలు లేక కలిసిపోవుదు నందు
ఆత్మ జ్యోతిని నిలుచు అరవింద లోచనుని!
ఇంతకాలము మీరు నింపుగా నను గూడి

ఆడినది పాడినది హరిని స్మరియింపు టది!
సార్థకం బైనదియు సంతోష భరితమై
గోపాల బాలు డిదె కూర్మి నా ముందుండి
నడిపించు చున్నాడు! నా గమ్య పథమునకు!

## పడవపై యొంటరిగ

పడవపై యొంటరిగ పయనించు చుంటినీ
పడవ నడిపేవాడు బరగ లేకుండా!

తెరచాపయును లేదు దీరుగా చుక్కాని
బట్టి దీరముజేర్చు పథికుడును లేడూ!

పడవపై యొంటరిగ పయనించు చుంటినీ
పడవ నడిపేవాడు పథికుడును లేడూ!

దరిజేరి యల్లదిగో! దాపుగల కోవెలను
నీ దర్శనముజేయ నిండు మానసముతో!
పయనించుచుంటినీ పన్నుగా దరిజేర్చి
నీ దర్శనం బంద నిండు దయ వర్షింపు! ॥పడవపై॥

కోరికలతో నిన్ను కొసరి యాచింపనూ!
మానసములో నున్న మటి నీకు దెలియదా?
కోవెలలో నున్న కూర్మి నీ మూర్తినీ
దర్శింప తలపుతో దగ మనసు మక్కువము! ॥పడవపై॥

పడవ నీవే నడిపి బరగ దరి జేర్పనూ!
నీ దర్శనం బంద నిండు కోరిక దీర్చు!
జనులతో బాటుగా జనుదెంచి నీ గుడికి
మౌన ప్రార్థన సేతు మాటాడకుండగను!

నా హృదయ జ్యోతిలో నయముగా నిను నిలిపి
హృదయారవిందమున సదయ మిము దిలకింతు
సప్తవర్ణములతో సరిజూచి హృదయమున
ఆనంద అర్ణవపు అలలలో మునుగుదును!

## రాత్రంత గడిచినది

రాత్రంత గడిచినది రమ్యమగు ప్రభు రాక
వేచి చూచుచు నుంటి వినయాంజలులతో!

తెలిరేక లుదయించి తూర్పునను కుంకుమలు
మందారములు పూచె మాధవుని జాడలుగ!

రాత్రంత గడిచినది రమ్యమగు ప్రభురాక
వేచి జూచుచునుంటి వినయాంజలులతో!

సప్తాశ్వ రథమునను జనుదెంచె భాస్కరుడు
అరుణారుణములగు అలరు కాంతులు విరిసె!
లోకమున తమసమను లోలతను బోగొట్టి
బంగారు కాంతులను బరిఢవిల్లగజేసె! ॥రాత్రంత॥

నీ వెనుకనే గలడు నీ ప్రభువు నీ విభుడు
ఆది అంతములేని ఆత్మజ్యోతిని గూడి!
ఆ జ్యోతి కిరణాలు అఖిల జీవులయందు
చైతన్య రాశిగా జేరెయున్నవి గనుము! ॥రాత్రంత॥

అఖిల జీవులయందు నలరు చైతన్యమును
ఆతనిగా భావించి యలరింపు స్నేహమును!
ఆత్మార్పణము జేసి యఖిల విశ్వమునకును
సేవించు నాతడే సిద్ధి బొందును జగతి!
అని బలికె భాస్కరుడు అంబరంబున నుండి
సప్తవర్ణములతో దగకాంతు లొలుకుచును!

రాత్రంత గడిచినది! రమ్యమగు ప్రభు రాక
వేచి చూచుచునుంటి వినయాంజలులతో!

## ఉదయ రాగమునందు

ఉధయ రాగమునందు నువ్వెత్తు కాంతులను
కలిసిపోవాలనీ కాంక్ష పరమాత్మా!

కోట్లాది కిరణాల కూర్మి భాస్వరజ్యోతి
నా కాంతి కిరణమును నయముగా కలువనీ!

ఉదయ రాగమునందు నువ్వెత్తు కాంతులను
కలిసిపోవాలనీ కాంక్ష పరమాత్మా!

ఆకాశమున వెలుగు నలరు చుక్కలయందు
రజిత కిరణాలలో రమ్యముగ నే నొక్క
రమణీయ కిరణమై రమ్యముగ దానిలో
కలిసిపోవాలనీ కమనీయమగు కాంక్ష! ॥ఉదయ॥

సంద్రాన యుప్పొంగు సాంద్రమగు అలలలో
నేనొక్క తరగనై నిండు చైతన్యమున
దరిజేరి నీపదము లంటినా రీలిగా
దగనాదు శీర్షమును ధన్యతను జేకూర్చు! ॥ఉదయ॥

వర్షధారలుగురిసి వనసీమ పర్ధిలగ
జేసినటు నేగూడ చెదిరినా చినుకునై
పచ్చనీ చిగురుపై పడి రాలి వసుధపై
భూమాత వొడియందు పూర్ణమున జేరగా!

ఉదయరాగమునందు ఉవ్వెత్తు కాంతులను,
కలిసిపోవాలనీ కాంక్ష పరమాత్మా!

## సెలయేటి జాలులో

సెలయేటి జాలులో చిఱు తరగగా నగుచు
గలగలా ధ్వనులతో గదులుచును భువికీ!

చల్లనీ గాలులను మెల్లనీ ధ్వనులతో
అప్సరస కన్యగా అగుపింప జేయుమా!

సెలయేటి జాలులో చిఱుతరగగా నగుచు
గలగలా ధ్వనులతో గదులుచును భువికీ!

హంస కన్నియలంత యలరి యభినయములను
నీటి పక్షులుగూడ నిలిచి నాట్యము సేయ!
దూరాన కోకిలలు దోరముగ బాడగా
శిలలన్నియునుగూడ సింగార మొనరింప! ॥సెలయేటి॥

దరినున్న తరులతలు దగ పూలు రాల్చగా
చిఱుచేప లన్నియును చిత్రముగ యెగురుచును
రజిత కాంతులు జిమ్మి రమ్య నర్తన సేయ
నేగూడ వానితో నిలిచి నర్తింపగా! ॥సెలయేటి॥

ధరణిపై ప్రవహించి పగ బోవుచుండగా
శివదీయ భక్తుడొక పడవపై పయనింప!
అతని పదముల దాకి అందాల సెలయేట
చిని చిన్ని తుంపురులు జేయి నమ జెదరగా!

సెలయేటి జాలులో జిఱు తరగగా నగుచు
గలగలా ధ్వనులమా గదులుచుమ భువికీ!

## అల భాస్కరునిలోని

అల భాస్కరుని లోని అందాల రంగులే
హరివిల్లు లోపలను అందాలు విరిసే!

అతులనే లోకాల అందాలు చందాలు
వివిధ రూపాలతో వికసించె జగమంత!

అల భాస్కరుడిలోని అందాల రంగులే
హరివిల్లు లోపలను అందాలు విరిసే!

భూమిలో కనిపించు భూతకోటియు గూడ
రంగు రంగులయందు రమణీయ రూపమున!
చెట్టుచేమలు లతలు చిత్రముగ మానవులు
పశుపక్షి సంతతియును బరగు మృగ సర్పములు! ॥అల॥

సంద్రాన కనిపించు తరగనీ నిధులెన్నొ
ముత్యాలు రత్నాలు మురిపెముగ ఖనిజములు
అపురూపమగు జీవ కోటియును సృజియించె
అలలలో తెరలలో అల భూమి పొరలందు ॥అల॥

గగనమున కనిపించు ఖద్యోత రాశియును
నక్షత్రములు తార అంతటను గ్రహములును
జ్యోతి ప్రకాశమగు సూర్యచంద్రులు గూడ
అతడే సృజియించె అల విశ్వ చిత్రములు! ॥అల॥

కోట్లాది కిరణముల కొలువులో నే నొక్క
కిరణముగ భావించి కీర్తించు చుంటినీ!
ఆ మహాజ్యోతిలో అంతర్హితముగాగ
తపియించు చుంటినీ తపసులో నుంటినీ! ॥అల॥

## అందఱూ మన వారె

అందఱూ మనవారె! అందఱూ నీవారె!
వేధింప కెవరినీ వెత గూర్ప రాదూ!

అందఱీ లోపలను నా దేవదేవుడే
ఆ జ్యోతి గలదంచు ఆత్మలో గనుమా!

అందఱూ మనవారె! అందఱూ నీవారె!
వేధింప కెవరినీ! వెత గూర్ప రాదూ!

కఠినమగు పలుకులను గలత జెందింపకుము
మధురతను విడనాడి మాటలాడకుమా!
దూరముగ బొమ్మనుచు దూషణము. లాడకుము
మాధవుడు గలడచట మర్యాద వీడకుము ॥అం॥

పశు పక్షి మృగములును బరగ జీవులు గాద!
తూలనాడీ వాని దూషింప బోకుమా!
అవిగూడ జీవులే యా విశ్వవిభునికిని
మధురమగు ప్రకృతికి మహనీయ సంతతీ! ॥అం॥

అంతరాత్మను గనుము అఖిల విశ్వమునంత
నీయందు గల వెలుగు వానిలో గలనంచు
మక్కువను దయజూచి మధురానుభూతులను
ప్రేమభావము జూపి ప్రీతి గురిపింపుమా!

అందఱూ మనవారె! అందఱు నీవారె!
వేధింప కెవరినీ! వెత గూర్ప రాదూ!

## చిమ్మచీకటి యందు

చిమ్మచీకటి యందు చిట్టడవి లోపలను
కనిపింపదూ దారి గమ్యమును జేర్పవూ!

చిఱుదీప మెలిగించి దీప్తిలో గనుగొనుము
కాంతిలో కనిపించు కమనీయమగు కాంక్ష!

చిమ్మచీకటి యందు చిట్టడవి లోపలను
కనిపింపదూ దారి గమ్యమును జేర్పవూ!

సూర్యకిరణములందు సూటిగా గనుగొనుము
సప్తవర్ణంబులును దగ యొదిగి భాసించు!
అఖిలజీవులు గూడ యటులనే యొప్పారు
ఒకజ్యోతి కిరణాలు యొదిగి యున్నట్లుగా! ॥చిమ్మ॥

విశ్వమంతా జనులు వివిధ భావాలతో
వేర్వేరు మతములను వేర్వేరు రంగులను!
సృజియింప మానవుడు శూన్యమునకును బోయి
వెగటు వైరాలతో వెతల నొందగనేల? ॥చిమ్మ॥

మనసులో జ్యోతినీ మానుగా దర్శింపు
అంతటా గలదంచు ఆ విశ్వ జ్యోతినే
ఆ పరమేశ్వరుండని మదిని జింతిలుచు
ఆత్మార్పణము జేసి అందఱిని మేల్కొలుపు!

చిమ్మచీకటి యందు చిట్టడవి లోపలను
కనిపింపదూ దారి గమ్యమును జేర్పవూ!

# ప్రకృతిని యందాలు

ప్రకృతిని యందాలు బరగ విధ్వంసమును
జరిగినట్లే జీవి చరియించి నటులా!

నే గూడ భావింతు నిర్మలాంతరమందు
కష్ట సుఖములు రెండు గలిసి వర్తించునని!

ప్రకృతిని యందాలు బరగ విధ్వంసమును
జరిగినట్లే జీవి చరియించినటులా

మధురిమలు జిందేటి మావి కొమ్మలు పూయు
వాసంతమును వచ్చు ఒకసారి ప్రకృతిని!
ప్రళయ మార్తాండునీ భీకర జ్వాలలును
తపియించు గ్రీష్మమును దగ వచ్చు నొక ఋతువు! ॥ప్రకృతి॥

శారదా రాత్రులును చలికాలమును దొరలు
ఆకురాలేటి యా యల శిశిర ఋతువునూ!
కష్టసుఖములు రెండు గడగి వర్తించును
మధురాను భూతులను మానుగా వర్తించు! ॥ప్రకృతి॥

ప్రకృతిని బుట్టినా బరగ జీవులుగూడ
కష్ట సుఖములతోని కలిసి పయనింతురూ!
రాత్రింబవళులు వోలె రమ్యముగ జగమందు
వెలుగు చీకటులలో విలసిల్లు జీవులును! ॥ప్రకృతి॥

ఋతు కాలముల వోలె రూఢిగా నే గూడ
కష్టసుఖములతోని కలిసి పయనించెదను!
ఆ కష్ట సుఖములను అతి సహజమని దలచి
తలవంచి సహియింతు కలకాలంబు భావించి! ॥ప్రకృతి॥

## మాధవా! ననుఁగూర్చి

మాధవా! ననుగూర్చి మదిని జింతింపకుమా
సమయ మొచ్చిన యపుడు దగ దయను గనుమా!

అల ద్రౌపదీదేవి కలరు వస్త్రము నిచ్చి
కాపాడినా రీతి కలత నలతను దీర్పు!

మాధవా! నను గూర్చి మదిని జింతింపకుమా
సమయ మొచ్చిన యపుడు దగ దయను గనుమా!

నే నెవరో దెలిసికొని నిర్మలాంతరమందు
వగజెందకను కూర్మి వర్తిలుచు సహజమున
చలివేంద్రమున నుండు చల్లనీ కుంభవలె
తాపమును జల్లార్చు దగ జేరు పథికులకు! ॥మాధవా॥

నీ మురళినాదాల నేను కలవాలనీ
ఆరాటమును లేదు ఆర్భాటమును లేదు!
నీ దయాకిరణాలు నింపుగా నామీద
ప్రసరించి నన్నుడే బరగ జ్యోతిని గలుపు! ॥మాధవా॥

ప్రారబ్ధ కర్మములు బరిపక్వ మైనపుడు
అలరి నీ జ్యోతిలో అంతర్హితుడ నౌదు!
అందాక నే గూడ అరసి నే నెవరినో
ఆత్మచింతన జేతు నలరి మౌనముతోని!

మాధవా! నను గూర్చి మదిని జింతింపకుమా
సమయ మొచ్చినయపుడు దగ దయను గనుమా!

## అటు జూచినా గూడ

ఆటుజూతెనా గూడ యిటు గాంచినా గూడ
ఆతడే కనిపించు అన్ని తావులనూ!

జ్యోతి స్వరూపుడై ప్రీలితో మాధవుడు
మురళి నూదుచునుందు ముద్దుగా నవ్వునూ!

ఆటు జూచినాగూడ యిటు గాంచినాగూడ
ఆతడే కనిపించు అన్ని తావులనూ!

సకలజీవులయందు సాక్షిగా తానుండి
కనబడక మాధవుడు కనుల వీక్షించుచును!
నాటకము నాడించు రమ్య నర్తనశాల
రాజా పేదా యనెడి రమ్య భూమికలతో! ॥అటు॥

రాజు రాజూ గారు పేద పేదా గాదు;
నటియించు పాత్రవివి రమ్య నాటక మందు!
అందఱూ నటులేను నా విశ్వరంగమున
నూటిగా కథపిడుపు సూత్రధారుం డతడు! ॥అటు॥

ప్రతిజీవ కణములో ప్రభువు వర్తించునూ
ఆతడే సర్వమును నాతడే అణువణువు!
అడవిలో కలియుచే యవని యంబరములను
సకలజీవులకోర్కె సహజమగు వాంఛయును!

అటు జూచినా గూడ యిటు గాంచినా గూడ
ఆతడే కనిపించు అన్ని తావుల యతడు!

## ఇంత ప్రేమెందుకో?

ఇంత ప్రేమెందుకో? యిల నాదు తనువుపై
దయను జూపుటయేల? దాక్షిణ్యమేలా?

ఎపుడేమి కావలెనో వివరింపనుండగనె
అందించుచుండెదవు అపరిమిత ప్రేమతో!

ఇంత ప్రేమెందుకో? యిల నాదు తనువుపై
దయను జూపుటయేల? దాక్షిణ్య మేలా?

తలిదండ్రి బంధువులు దగ ప్రేమతో యేమి
సంపదలు ద్రవ్యములు దగ యివ్వగా లేదు!
నీకు జానిస నైతి నీవె నా సకలమై
అందించు చుంటివీ అవసరము లన్నియును; ॥ఇంత॥

అపరిమితమైనట్టి అలరు ద్రవ్యమువిచ్చి
బీదతనమును బాపి భిన్న ప్రకృతి నిచ్చి
నీవిచ్చినట్టి యా నిధినంతయును నీకు
మరల నిచ్చిలిని గద మాధవా తెలియు నిది! ॥ఇంత॥

దేహ సుఖముల కొరకు జేయలే దింతయును
ఆత్మ సుఖమునకునై అర్చనల జేసితిని!
ఒకటడుగ ఒకటిచ్చు వయ్యారమును మాను
సూటిగా నే నడుగు శుభము దయ సేయుమా!
నీ మురళితో గలియు నిండు కోర్కెను నిమ్మ!
జ్యోతితో గలుపునూ ప్రీతి నా కిరణమును!

ఇంత ప్రేమెందుకో? యిల నాదు తనువుపై
దయను జూపుటయేల? దాక్షిణ్యమేలా?

## ఆలమందను గాయు

ఆలమందను గాయు అల గోపబాలునిగ
అగుపింతువేల మది అందాల కృష్ణా!

ఘన శంఖ చక్రముల కనకాంబరములతో
కనులకును గనబడవు గామితార్థము నీయ?

ఆలమందమ గాయు అల గోపబాలునిగ
అగుపింతు వేల మది అందాలకృష్ణా?

నల్లనీ రూపాన నాథ! తులసీమాల
ధరియించి యుందువూ! దగ నెమిలి పింఛమును
పద్మనయనములతో బరగ కనబడుచుండి
నవ్వు రాజిల్లుచును కవ్వింతు వెందుకో? ॥ఆల॥

అన్నిపనులను నేను నలరి జేయుతు ననుచు
నా పనుల కడ్డముగ నళినాక్ష! వచ్చెదవు!
విద్యార్థి రూపమై విపులమగు సేవలను
గడగి జేయుదువేల కట్టుబానిసవోలె! ॥ఆల॥

ఇంతకాలము బ్రదుక నేల నన్నుంచితివి?
ఇలయెన్ని యాపదల యేల రక్షించితివి?
శిథిలమై దేహమును బదిలముగ మనసులో
మధుర గీతము వ్రాయు మాధుర్య మొంచితివి! ॥ఆల॥

నీ మధుర గీతములు నిన్ను వర్ణింపగా
గోపికగ అలనాటి కోర్కె జ్ఞప్తిని నేయ!
అలనాటి స్మృతులు నీ కలరి జ్ఞప్తికి దేగ
అందుకే ధరణిలో జింద నన్నుంచితివి! ॥ఆల॥

## అంతులేని పయన

అంతులేని పయన మలరి జేసితిని నే
అలసి పోతిని నేను ఆగిపోయెదనూ!

కాలుముందుకు వేసి కదలజాలను యింక
మన్నించి నాకోర్కె మది సమీక్షింపుమా!

అంతులేని పయన మలరి జేసితిని నే
అలసిపోతిని నేను ఆగిపోయెదనూ!

కిన్నెరను జేబూని కీర్తనల బాడుచును
వీధులన్నియు దిరిగి వేసారితివి కృష్ణ!
మందారమాలనూ మధురముగ చేబూని
జరుద్ర పురుగుగా నైతి గనుమో కృష్ణ! ॥అంతులేనీ॥

చివటి దిన మని దలతు దీరుగా యీనాడు
కనుపింపుమో కృష్ణ! కనులపండువు గాగ!
నా పుణ్య ఫలరాశి నయముగా నర్పింతు!
మనసు మూలమునందు మానుగా గలుపుచును! ॥అంతులేనీ॥

నాలోవి భావముల నయముగా గూర్చితిని!
అందాల పదములను పొందికగ జేర్చితిని!
చివటి పాటగ దలచి శీఘ్రముగ దయజేసి
ప్రేమ వాత్సల్యముల ప్రీతిగా గలుపుకొను!

అంతులేనీ పయన మలరి జేసితిని నే
అలసిపోతిని నేను ఆగిపోయెదనూ!

## కలడు గలడనువాడు

కలడు గలడనువాడు గలడొ లేడోయనుచు
మదిశంక జేయనూ మాధవా! యెపుడూ!

అఖిల మంతా నిండి యున్నవాడవు నీవు
అణువణువు నంతటా యలరి యుంటివి నీవు!

కలడు గలడనువాడు గలడొ లేడో యనుచు
మదిశంక జేయనూ మాధవా! యెపుడూ!

గగన భాగమునందు గల తారలన్నియును
సూర్యచంద్రులుగూడ సూటిగా గ్రహములును!
నక్షత్రములుగూడ నయముగా జ్యోతియును
నీవుగా భావింతు నిఖిల మంతయుగూడ! ॥కలడు॥

ప్రతి జీవియందునను ఐన్నుగా కిరణముగ
వసియించుచుండెదవు వనర శుభకర్మముల
జేయించుచుండెదవు శ్రీకరంబుగ భువిని
అలరి ప్రతిజీవియును ఆనంద మొందగను!

చివురులే యాకులును చిత్రమగు పూలుగా
పూవులే ఫలములును బొలుపుగా రాలు భువి!
మానవుడు నటులనే మాధవుని గుర్తించి,
సేవలో సకలమును శ్రీఘముగ నర్పింప
మాధవుండే వచ్చి మరి హర్షమును జేయు!

కలడు గలడనువాడు గలడొ లేడో యనుచు
మదిశంక జేయనూ మాధవా! యెపుడూ!

## వ్యథ జెంద బోకుమా!

వ్యథ జెందబోకుమా! వేదనలలో మునిగి
కన్నీటి జాలులను కడలి గలుపకుమా!

చిఱునవ్వుతో నీదు చిరకాల వాంఛితము
మన్నింపుమని కోరు మాధవుని దయతోని!

వ్యథ జెంద బోకుమా! వేదనలలో మునిగి
కన్నీటి జాలులను కడలి గలుపకుమా!

ఆత డిచ్చిన పనిని అలసతను విడనాడి
కర్తవ్యమని దలచి కానుకగ భావించి!
ప్రీతితో సహదరుల ప్రేమతో బంధువుల
నీవలెను కనుగొనుము నిఖిలమగు జీవులను! ॥వ్యథ॥

నదులు ప్రవహించెడిని నాదములు జేయుచును
కోకిలలు అల్లదిగో కూర్మి పాడుచునుండె!
గిరి పర్వతములునూ కోరి స్థిరముగ నిలిచి
మధురముగ మౌనముగ మనసు దలచుచు నుండె! ॥వ్యథ॥

కంటి నీరొలుకకుము కాఱు మబ్బుల రీతి
మనసు కాటుకతోని మలచి యుంచగ బోకు!
నవ్వుతూ మాధవుని నళినాక్షు దలచుచును
ఆత్మానుభూతినీ అలరించుకొను జగతి!

వ్యథ జెంద బోకుమా! వేదనలలో మునిగి
కన్నీటిజాలులను కడలి గలుపకుమా!

## నీ పయన మెచటికో!

నీ పయన మెచటికో! నీగమ్య మెచటికో!
ఏ విశ్వ విభు గాంచ ఎలమి జనుచుంటివో!

ఆ విశ్వ విభుడునూ అలరి ప్రేమదు జింద
వచ్చుచున్నాడదే వనరి చేజాచీ!

నీ పయన మెచటికో! నీగమ్య మెచ్చటికో!
ఏ విశ్వ విభుగాంచ ఎలమి జనుచుంటివో!

నిండారు ప్రేమతో నిర్మలంబగు భక్తి
ప్రార్థించుచుంటివో బన్నుగా నాతడును!
కరుణ ప్రేమలతోని కమ్మనీ దయతోని
వచ్చుచున్నాడదే వనర కౌగిలి జేర్ప!

చిరకాల బంధువని జేర యాతనితోని
మమత మాధుర్యమున మాధవుని దలచితో
అతడును తన ప్రేమ నందింపగా నీకు
వచ్చుచున్నా డదే వనర మురళిని గలుప!

సమత మమతలతోని సాధుజన మైత్రియును
సకల జీవులతోని సాంగత్యమును గలుగు!
అట్టి సుకృతిపైని అలరి కృప జిందగా
వేచియుండును గదా! విమలమగు ప్రేమతో!

నీ పయన మెచటికో! నీగమ్య మెచటికో!
ఏ విశ్వవిభు గాంచ నెలమి జనుచుంటివో!

## నిను సదా జూచేటి

నిను సదా జూచేటి నిర్మలంబగు కనులు
మూయగా లేవుగా మోదమున కృష్ణా!

అలరి శ్రీమురళితో ఆడేటి పాడేటి
అందాల రూపమును నాపగా లేవుగా!

నిను సదా జూచేటి నిర్మలంబగు కనులు
మూయగా లేవుగా మోదమున కృష్ణా!

కస్తూరి తిలకమును కమనీయ కౌస్తుభమును
బంగారు కంకణము బన్నుగా కనబడవు!
ఆలమందను గాచు నలగొల్లనిగ నీవు
కంటి కగుపించుదువు కమనీయ రూపమున! ॥నిను॥

ఆర్తయగు ద్రౌపదికి యలరి వస్త్రములిచ్చి
మధుర మూర్తియు మదిని మానమును గాచినా
పేద కుచేలునికి పెన్నిధిని దయచేసి
దారిద్రమును బాపు దాక్షిణ్య మూర్తినే! ॥నిను॥

అల గజేంద్రుని మొరలు ఆలించి బ్రోచినా
చక్రధరుడే నాకు కనిపించు చిత్తమున!
గోపికలతోగూడి కూర్మి ఇలకములాడు
గొల్లబుడుతల తోని కూడి యాడినవాడె

రాజకీయము నడిపి రణ విశారదునిగా
దుష్ట శిక్షణ జరిపి శిష్టులను రక్షించు!
అవతార మూర్తిగా అగుపించి కన్నులకు
ఆనందమునుగూర్చి అలరింప వెందుకో!

## ఎక్కడో కృష్ణుడూ!

ఎక్కడో కృష్ణుడూ వేణువును నూదుచును
నను బిలుచుచున్నాడు నాట్యమాడగనూ!

కోన కోకిలలన్ని కూర్మి బాడిన యటుల
అనిపించు చున్నదీ యలరి నా చెవులకును

ఎక్కడో కృష్ణుడూ వేణువును నూదుచును
నను బిలుచుచున్నాడు నాట్యమాడగను!

అల నదీ తీరమున యదె కడిమిచెట్టుపై
కూర్చొనియు మురళినీ కూర్మి పాడుచు నుండె
నల్లనీ మేఘమున తెల్లనీ మెఱుపువలె
అగుపించుచున్నదదె అందాల పింఛమును ॥ఎక్కడో॥

కడిమి పూవులతోని కమ్మనీ నేమ్మోము
అగుపింప కున్నదీ అందాల రూపమును!
అలమందంతయును నలరి కడిమినిజుట్టి
మొగములను పైకెత్తి మోద మందుచునుండె! ॥ఎక్కడో॥

కోనలో వసియించు కూర్మి మృగ పక్షులును
అచటికేతెంచెనే అందాల మురళి విన!
నే బోవుచుంటినీ నిండు చైతన్యమున
నాట్యమాడెదను నే నవజ్యోత్స్న రేఖగా

ఎక్కడో కృష్ణుడూ వేణువును నూచుచును
నను బిలుచుచున్నాడు నాట్య మాడగనూ!

## నలుగురూ నవ్వినా

నలుగురూ నవ్వినా నగుబాటు నొందినా
చింతాకు అంతయిన చింత నొందనుగా!

సకల మర్పించితిని స్వామి నీవే యనుచు
మాట లింకేల మఱి మరియాద లేలా!

నలుగురూ నవ్వినా నగుబాటు నొందినా
చింతాకు అంతయిన చింత నొందనుగా!

కోరికలు అన్నియును కొస వఱకు త్రుంచితిని
నీవు నా దిక్కనుచు నిఖిలమును వదిలితిని!
కాంతిలో కాంతిగా కలిసిపోవగ కృష్ణ!
ఎన్నెన్ని మారులో విన్నవించితి గదా! ॥నలుగురూ॥

చిన్న నా కుటియందు జిఱుదీప మునిబెట్టి
పాటబాడుచునుంటి పరగ నీ రాకకై!
కనురెప్ప లార్పకను గనుచుంటి నాకసము
మురళి నూదుచు రమ్ము! మోదమున నను బ్రోవ ॥నలుగురూ॥

కొండపై కోవెలను కట్టియుంటివి స్వామి
గగనమున తారలను గలిపియుంటివి గదా!
పుడమిలో యణువణువు పూర్ణముగ యుంటివి
నన్నేల గనలేవు? నాథ! నీ కిది తగున?

నలుగురూ నవ్వినా నగుబాటు నొందినా
చింతాకు అంతయిన చింత నొందనుగా!

## చింతింప బోకుమా!

చింతింపబోకుమా! చిఱునగవు తొలి కించు
మదిచింత నొందకుము! మాధవా! నను గూర్చి!

కర్మబంధములన్ని గడ తేరినా వెనుక
నను నీలో గలుపుకొను నాథ! యిదె నా వినతి!

చింతింప బోకుమా! చిఱునగవు తొలికించు
మది చింత నొందకుము! మాధవా! నను గూర్చి!

నీ యిష్టమైనపుడె నిఖిలేశ! గలుపుకొను
నీ మురళి స్వనములను విర్మలంబగు దీప్తి!
అందాక నిను జాతు ఆత్మేశ్వరుడ వైన
ఆనంద జ్యోతిగా అలరి నా మదియందు!

జప తపస్సులతోని చారు మంత్రములతో
పూజింపగా లేను పురుషోత్తమా నిన్ను!
ధ్యానమున భక్తితో ధ్యానింతు శ్రీకృష్ణ!
ముక్తి మార్గముత్రోవ ముదముతో బయనింతు!

నీ యిష్ట మొచ్చినా నిఖిలేశ! దయతోని
నీ తోన కలుపుకో! నీరధిని అలవోలె!
చివటి వానిగ నన్ను చేర్చుకో! పరమాత్మ!
నీ కాంతి పుంజమున నీ మురళి స్వనములను!

చింతింప బోకుమా! చిఱునవ్వు చిలికించు
మదికలత నొందకుము మాధవా! నను గూర్చి!

ప్రీతి పూర్వకమైన పిలుపు వినబడుతుంది!
ఆవలొడ్డున నుండి యార్ద్రీతయు బొంగా!

ఈవలొడ్డున నుంటి నే బిలుచు చుంటునూ
రమణీయ గీతమున రాగ సుధ లొలుకా!

ప్రీతి పూర్వకమైన పిలుపు వినబడుతుంది
ఆవలొడ్డున నుంటి యార్ద్రీతయు బొంగా!

ఏనాటిదో గదా! యీ రాగ బంధమూ
ఎన్ని జన్మల నాటి యా ప్రేమ సూత్రమో!
విడిపోదు, తెగిపోదు కడలి యలలకు వోలె
వినబడుచు నుంటునూ! కనబడక కన్నులకు ॥ప్రీతి॥

కొండ శిఖరము నెక్కి కూర్మి నే బిలువగా
కొండ క్రిందను నుండి కూర్మి మురళిని బిలిచి
రాగాల రాశితో నను ముంచి వేస్తాడు
తీయనీ మురళితో తేనె లొలికిస్తాడు! ॥ప్రీతి॥

ఎన్ని జన్మలు నిటుల సన్నుతింపను స్వామి?
వీధి వీధుల యందు విమలతను వెదుకుచును!
మబ్బు చాటున నుండి మధురిమలు నొలుకుచును
ఆటలాడించేవు నలరు దాగుడు మూత!

ప్రీతి పూర్వకమైన పిలుపు వినబడుతోంది
ఆవలొడ్డున నుండి యార్ద్రీతయు బొంగా!

# కొండలను కోనలను

కొండలను కోనలను కూర్మి గల గల బాఱు
సెలయేటి తీరమున చిగురుటాకుల పూల

కుటియందు నేనుంటి కూర్మి నీ ధ్యానమున
సహజ స్సమాధితో చలి యింపకను స్వామి!

కొండలను కోనలను కూర్మి గలగల బాఱు
సెలయేటి తీరమున చిగురుటాకుల పూల

అఖిల జగమంతయును నలరి నీ వుంటివని
సకల జీవుల యందు స్వామి నీ వుంటివని
మదియందు దలచుచును మాధవా! ని న్నెపుడు
భక్తితో మది యందు భవ్యమ్ముగ దలచుచును! ॥కొండ॥

చింతనలు విడనాడి చిగురాకునకు బోలె
మధురాత్మ పుష్పమున మానసము జొప్పించి!
శివాత్మ జ్యోతిలో జీవాత్మ గలుపగా
యత్నించు చుంటినీ యతివోలె మౌనముగ! ॥కొండ॥

కాంతి కిరణము వోలె కలిసిపోనీ నీలో
మోదమున నా పాట మూర్ఛనతో గలియనీ!
అంతటా నిండినా అలరు విశ్వమ్మునందు
నీ పాట కమలమున తేఱువుగ నిలువనీ!

కొండలను కోనలను కూర్మి గలగల బాఱు
సెలయేటి తీరమున చిగురుటాకుల పూల!

## కలసి పయనింపనీ

కలిసి పయనింపనీ! కమలాక్ష! జనముతో
కష్ట సుఖముల యందు కలిసి వర్తింపనీ!

ఆనంద రేఖలను నలరి పర్తింపనీ
కష్టాల కావడిని కలిసి నిను మోయనీ!

కలిసి పయనింపనీ! కమలాక్ష! జనముతో
కష్ట సుఖముల యందు కలిసి వర్తింపనీ!

అతడు విధియించినా అపురూప కార్యముల
ఘన విజయముల నంది కదిలేటి జనములో!
ననుగూడ కలుపుమా! నాథ! వెనుకాడకను
నే గూడ కదిలెదను నిండారు దీప్తితో! ॥కలిసి॥

కష్టముల సుడిగాలి కదిలి వచ్చే వేళ
సహాయించు జనముతో సరిగ నను ముందుంచు!
ఆత్మాహుతిని నేను ఆలరి మృతినొందగా
వసుధపై శయనించు వనర భాగ్యము నిమ్ము ॥కలిసి॥

జనముతో నను బంపు జనములో నుండనీ!
జనము పాడే పాట జాగృతిని బాడనీ!
నీ దూతగా బంపు నిఖిలమును జేయగా
కల్యాణ కుంకుమలు గగనమున వెలుగునటు!

కలిసి పయనింపనీ కమలాక్ష! జనముతో
కష్ట సుఖముల యందు కలిసి వర్తింపనీ!

## ఎన్ని యాపదలు నను

ఎన్ని యాపదలు నను వెన్నాడినను గూడ
ఎన్ని యాటంకములు సన్నిహితమైనా!

నిను మఱువకుండగా నీరజాక్షా! దయను
కనికరింపగ నాదు కమనీయ కాంక్షా!

ఎన్ని యాపదలు నను వెన్నాడినను గూడ
ఎన్ని యాటంకములు సన్నిహితమైనా!

ఎన్నియుగముల నాటి ఎన్ని జన్మల నాటి
యీ ప్రేమ యింతమో యెఱుగ జాలనుగా!
కనిపింపకున్ననూ కనిపించినటు దలతు
మాటాడకున్ననూ మాటాడినటు దలతు! ॥ఎన్ని॥

నీ మురళి వినినటుల నిర్మలాంతరమందు
నీ జ్యోతి కనినటుల నిఖిలేశ యనిపించు!
కోరినా కోరికల కొమరొప్ప దీర్చినటు
కల్పవృక్షము వోలె కామితార్థము లిచ్చి! ॥ఎన్ని॥

కోరికలు ఎందులకు? కొమరొప్ప దీవెనలు?
మబ్బులో మెఱుపులవి మాణిక్య కాంతులవి!
ఎన్ని జన్మలు యిటుల జన్మపదా జరగనీ!
నిన్ను నే మఱువకను సన్నుతింపగ జేయి!
నను మఱువకుండగా మాతవై యెపుడుండు!

ఎన్ని యాపదలు నను వెన్నాడినను గూడ
ఎన్ని యాటంకములు సన్నిహితమైనా!

ఈనాటి గీతాలు యానాటి రాగాలు
యీనాటి భావాలు యింపుగా మదిలో!

తలపులో నుంచుకో! ధగ నాథు వినతులను
మదియందు పాడుకో! మధురమగు గీతముల!

ఈనాటి గీతాలు యీనాటి రాగాలు
యీనాటి భావాలు యింపుగా మదిలో!

రస హృదయు డనుచు నే రమణీయ గీతముల
ఆలపించితి స్వామి! అలరి మృదు జ్రీలితో!
సూటిగా నిను బిలిచి చోద్యముగ గోపికగ
అలనాటి స్మృతులనూ అడి పాడితి స్వామి! ॥ఈనాటి॥

భద్రముగ దాచుకో! బహుమానముగ దలచి
రాగి రేకుల యందు రమణీయముగ వ్రాసి!
నెమిలి పింఛమునందు నేర్పుగా దాచుకో!
కమనీయ మురళితో కథలుగా బాడుకో! ॥ఈనాటి॥

కొండ కోనలు మఱియు కూర్మితో సెలయేఱు
బాడుకొనుచున్నవి! బరగ నా పాటలను
నను బ్రోవకున్ననూ నా ప్రాణ సఖియలను
కరుణతో వీక్షించు కఠినత్వమును వీడి!

ఈనాటి గీతాలు! యీనాటి రాగాలు!
యీనాటి భావాలు! యింపుగా మదిలో!

## సద్దు జేయకుడమ్మ

సద్దు జేయకుడమ్మ! సఖియలారా వినుడు!
మాధవునితో నేను మాటాడునపుడూ!

ఆత్మలో లీనమై అతని దలచే టపుడు
రణగొణ ధ్వనులతో రవలు జేయకుడమ్మ!

సద్దు జేయకుడమ్మ సఖియలారా! వినుడు!
మాధవునితో నేను మాటాడునపుడూ!

అడ్డు రాకండమ్మ! యలరి నా ధ్యానమున
ఆత్మతో లీనమై యలరినా మనసునూ!
వెలుపలికి బిలిచి నను వేదనలలో ముంచి
ధ్యాన భంగము జేయ దగునమ్మ యారీతి? ॥సద్దు॥

మౌనధారణజేసి మాటాడకను మనసు
ఆత్మ జ్యోతిని నిలిపి అలరేటి సమయాన!
కలకలా రవములను కవ్వింపులను గూడి
వాదులాడుట తగునె? వరుసగా నలుచుచును! ॥సద్దు॥

ఆత్మానుభూతితో ఆనంద జ్యోతినీ
దర్శించు సమయాన తరగనీ ధ్వనులతో
వగలాడి పాటలను వన్నెలా నృత్యముల
వ్రతభంగమును జేయ వనర తగునా చెలులు?

కలలనీ కొలనులా కనులు కలిపి నేను
విరిసినా పద్మముగ వికసించు సమయాన
అలరి లేపకుడమ్మ అందాల ప్రొద్దుటూన
పూవు లాకులు రాల్చి చూస్తి తూగకుడమ్మ!

## రాత్రంత వీక్షించి

రాత్రంత వీక్షించి రమ్య నిరీక్షణము
నీ దర్శనము కొఱకు నిండారు మదినీ!

కలువలవె ముకుళించె! కమలములు వికసించె
రావుగద! గోపాల! రమణీయ మురళితో!

రాత్రంత వీక్షించి రమ్య నిరీక్షణము
నీ దర్శనము కొఱకు నిండారు మదినీ!

గగనభాగమునందు కాంతి ముత్తెములన్ని
తెలతెల్లబోయినవి విలపించి నావోలె!
చంద్రకాంతులుగూడ యింద్రధనుసుకు వోలె
అంతర్హితంబయ్యె ఆ సంధ్య కాంతులను! ॥రాత్రంత॥

హిమబిందువుల వోలె కమనీయ బాష్పములు
కనుల జారుచునుండె కాంతిముత్యాల వలె!
దూరమున వనరేఖ జేరి పొగమబ్బులను
ననుజూచి జాలితో నాథ కనిపింపకను! ॥రాత్రంత॥

కనులలో నుంటావు కరంటి కగపడ వేల?
హృదయమున నుంటావు సదయ బయటికి రావు!
మురళిలో గలియగా ముద్దు నా కోరికను
చెల్లింప వేలనో చిరదాసి నేను గద!

రాత్రంత వీక్షించి రమ్య నిరీక్షణము
నీ దర్శనము గోరి నిండారు మదినీ!

మురళీ స్వనమునందు మోదమున జేర్చుకో!
అవసాన కాలమిది యలరు కోరికనూ!

నెమిలి పించమునందు నెమ్మనము నందునను
కలియగోరుట లేదు కమనీయ కోరికల!

మురళీ స్వనమునందు మోదమున జేర్చుకో!
అవసాన కాలమిది అలరు కోరికనూ!

అట్టి సౌభాగ్యమును నలరి కలదో లేదొ
నీ హృదయ పద్మమున నీరగా జేరుటకు!
శిరసునను గలయట్టి సింగార మొలికించు
నెమిలి పించమునందు నేర్పుగా గలియగా! ॥మురళీ॥

నీ మధుర గానమును విందుగా బాడేటి
మురళియందున గూడ మోదమున జేరుటకు!
కలదొ లేదో భాగ్య మది యందులకు నన్ను
మురళీ ధ్వనుల యందు ముద్దుగా నుండనీ! ॥మురళీ॥

అంతులేనీ యాత్ర యలరి జేసితి నేను
నీ కౌలతు వెదికితిని నిఖిలమంతా కృష్ణ!
మదియందు నుండినను మాటాడ వెందుకో!
పలుకు బంగారమా! శుభదీయ దర్శనము
అందింప వెందుకో అలరి నా కన్నులకు?

మురళీ స్వనమునందు ముద్దుగా జేర్చుకో!
అవసాన కాలమిది యలరు కోరికనూ!

## కొండ లధిరోహింప

కొండ లధిరోహింప కోవెలల జూడకను
మనసు మాటను నేను మన్నింపబోమా!

కాంతారములు నన్ని కడు వేడ్కతో వెదికి
విభుని దర్శింపమను విన్నపము విననూ!

కొండ లధిరోహింప కోవెలల జూడమను
మనసు మాటను నేను మన్నింపబోమా!

కనులతో నున్న నిను కాంక్ష దర్శింపకను
మనసులోనున్న నిను మానుగా జూడకను!
చెట్టు పుట్టలయందు జేరగా సరసులను
మనసు నిర్బంధించు మానుగా దేహమును! ॥కొండ॥

జప తపంబుల జేయ చెన్నుగా స్తోత్రముల
మనసు నిలకడలేక మాధవా! వల్లించు!
ఆత్మతో విలువకను అద్దుదారుల బోయి
నేనె ఆత్మ నటందు నిల్గు స్థిరమును తేక! ॥కొండ॥

నీవు నీడవు గదా నిఖిలాత్మ పరమాత్మ!
ఆత్మయే ననుచు మది యలరు జ్ఞానములేక!
తనుగూడ ఆత్మకును దగ సేవకుడ నంచు
భావింప దది యేమొ! దివ్యచిత్రము గాగ!

కుటియందు గలడను సుమ్ము కూర్మావతారుడూ!
ఆదుకొనువా డతడు నలరు జగ మంతయును!
నిండినా వాడతడు నిరసంతడు మదిని
కఠినముగ శాపించు కల్మషము లేకుండ!

## దేహాత్మ బుద్ధితో

దేహాత్మబుద్ధితో దిశలు జూచుచునుంటి
అంతటా నిండినా యా పరంజ్యోతినీ!

విశ్వాత్మగా నీవు వెలసియున్నావనీ
అంతరంగమునందు నలరి దెలిసితినీ!

దేహాత్మ బుద్ధితో దిశలు జూచుచునుంటి
అంతటా నిండినా యా పరంజ్యోతినీ!

గగనమున చుక్కలను కాంతి రేఖల నెట్లు
లెక్కింపగలను మది లీలగా నైననూ?
సంద్రాన ముత్యముల సరి లెక్కలమ వేసి
తీరమున నే జేర్చి దేల్చెదను గుణియించి! ॥దేహాత్మ॥

మావిచిగురుల నన్ని మానునా లెక్కించి
యిన్నియని దెలుపుదును వెన్నెలా రేఖలను?
వాసంత ఋతువులో వన్నెలా పూవులను
లెక్కింపగలను ప్రతి పుక్కిటను బట్టి? ॥దేహాత్మ॥

జలధిలో అలలెన్నొ చాలు సుందరములును
సంధ్యకాంతులలోని చారుకుంకుమలనూ!
నీవులేవీ కావు నిఖిల విశ్వమునందు
కంటికగపడకుగద! గలవు అణువణువునను!

దేహాత్మబుద్ధితో దిశలు జూచుచునుంటి
అంతటా నిండనా యా పరంజ్యోతిని!

## పాడినా పాటలను

పాడినా పాటలను బరగ పాడగ లేను!
మాధవా కిన్నెరను మ్రుఅల మీటగలేను!

హంసగానములు అవిగో! అలరి వ్రాసినవి ప్రభు!
పాడిందుకో ప్రభూ! పరగ కోకిలలతో!

పాడినా పాటలను బరగ పాడగ లేను
మాధవా కిన్నెరను మఱల బాడగలేను!

యాచింపగా లేదు అలరి కోరికలతో
దేహాత్మ బుద్ధితో దిశలు జూడగలేదు!
విశ్వాత్మ బుద్ధితో వేడితిని పరమాత్మ!
చైతన్య మార్గమున చిరకాల కోరికను! ॥పా॥

విశ్వమంతా శాంతి వెల్లివెరిసే ట్లు
జన సంఘ మంతయును జాగరిత మగునటుల!
జీవకోటియుగూడ దీప్తిలో రాజిల్లి
వసుధ సుఖశాంతులను వర్ధిల్లు నట్లుగా! ॥పా॥

నీ మురళి స్వనముతో నిండుగా నే జేరి
శాంతిగీతము బాడ క్రాంతి నా కొసగుమా!
విశ్వమంతా జనులు వేదనలు లేకుండ
ఒక ప్రభుత్వము నిరత వర్ధిల్లు నట్లుగా!

పాడనా పాటలను బరగ పాడగలేను
మాధవా! కిన్నెరను మ్రుఅల మీటగ లేను!

# ఆత్మతో నణువనుచు

ఆత్మతో ఫణువనుచు నలరి భావింపకను
పొంగుచున్నది మనసు రింగుమని తిరుగుతూ!

తానె యజమానినని తలపోయు చున్నదీ
గాలిమబ్బుకు వోలె గగనమున దిరుగుతూ!

ఆత్మతో నణు వనుచు నలరి భావింపకను
గాలిమబ్బుకు వోలె గగనమున దిరుగునూ!

సప్తవర్ణములతో దగ నున్న జ్యోతినీ
ఆత్మబంధువవోలె అలరి ప్రీతిని గనక!
మద మత్సరములతో మానుగా దెలలతో
చరియించుచున్నదీ చాతకపు పక్షివలె! ॥ఆత్మతో॥

దీపశిఖ చుట్టునూ దిరుగుచు పతంగమును
వెలుగునే శాసింప వికలముగ యత్నించి
తాను దగ్ధంబగుట తన గర్వ ముడుగుటయు
కనడుగా తన గతిని కాలవాహిని యందు! ॥ఆత్మతో॥

ఆత్మ సన్నిధియందు అలరి సేవకునిగా
పరిచర్య చేయవలె పన్నుగా వినయమున!
మద మత్సరంబులను మానుగా తొలగించి
జ్యోతిలో జేరుటకు ప్రీతి యత్నింపవలె!

ఆత్మతో నణువనుచు నలరి భావింపకను
పొంగుచున్నది మనసు రింగుమని దిరుగుతూ!

## అఖిల జీవులయందు

అఖిల జీవులయందు నాత్మగా జ్యోతిగా
అలరి యుంటివి స్వామి! ఆనందమూర్తిగా!

నా హృదయమునగూడ నవకిరణమును బోలె
వెలసియున్నావనుచు వెలమి దెలిసితిని!

అఖిల జీవులయందు నాత్మగా జ్యోతిగా
అలరి యుంటివి స్వామి ఆనందమూర్తిగా

కనులతో నున్న నిను కనజాలకను నేను
అంతంధు వెదికితివి అర్చకుని వలెనూ!
మదియందు నున్న నిను మానుగా గనలేక
తీర్థయాత్రల నన్ని సేవించితిని స్వామి!

ప్రేమామృతపు పాత్ర ప్రీతిగా నిచ్చితివి!
అందరికి యందించి యలరి తృప్తులజేయ!
మబ్బులో మెఱుపులను మణిగియుండిన యటుల
సకల జీవులయందు సహజముగ గల వీవు!

ఆపాల సంద్రాన అల సురలు రాక్షసులు
మథియింప యమృతమును మానుగా పొందినటు!
జ్యోతిగా నున్న యాజ్యోతి స్వరూపునీ
గోపాలబాలునీ కూర్మి గన వచ్చునని
మనసునకు దోచినది మహనీయ భావమును!

అఖిల జీవులయందు నాత్మగా జ్యోతిగా
అలరి యుంటివి స్వామి ఆనందమూర్తిగా!

## పూర్ణిమా నిశియందు

పూర్ణిమా నిశియందు పులకించు వెన్నెలలో
నీ నిరీక్షణ కొఱకు నిఖిల మంతయునూ!

కన్నీరు దొలుకుచును కలతతో నే గూడ
వేచియుంటిని స్వామి! విమల దర్శనమునకు!

పూర్ణిమా నిశియందు పులకించు వెన్నెలలో
నీ నిరీక్షణ కొఱకు నిఖిల మంతయునూ!

కమనీయ గీతమును కలతతో బాడుచును
నీనామ రూపముల నిండు మదిలో దలచి
తెలవారె తూర్పు దెస తెలికాంతులను విరిసె
రావు గద! శ్రీరమణ రమణీయ ప్రేమతో ॥పూ॥

తరులన్ని బాష్పములు దగ విడుచుచుండెనూ
పత్రాంతముల నుండి బరగ దుఃఖాశ్రువులు!
నేలపై పచ్చికలు నిండు ముత్యాల వలె
శోక బాష్పములనూ తొలకించుచుండెనూ! ॥పూ॥

తరుల బాష్పములన్ని దగ వసుధ అందుకొనె
పచ్చికల కన్నీరు మచ్చికను రవిరశ్మి
తుడుచు చుండెనుగాని తోరముగ నా హృదిని
తొలికెడి బాష్పముల తుడువ రెవ్వరు స్వామి?

పూర్ణిమా నిశియందు పులకించు వెన్నెలలో
వేచియుంటిని స్వామి! విమల దర్శనమునకు!

## నా గొంతు బాడేది

నాగొంతు బాడేది నవనీత! ఒకనాడు
మధుర సుస్వనములను మానుగా నొలికి!

కోకిలలుగూడ మది కూర్మి సిగ్గులతోని
పాట బాడుట మానె బరగ మౌనము దాల్చె!

నాగొంతు బాడేది నవనీత! ఒకనాడు
మధుర సుస్వరములను మానుగా నొలికి!

గర్వించితిని నాదు కంఠమును జూచుకొని
మధురాక్షర ధ్వనుల మాటిమాటికి బాడి!
విధి విలాసమువలన వికలమై నాగొంతు
కరుణా విలాపముల కలగుండు బడె నేడు!

వ్రాసినా గీతముల రమణీయ నాదాల
పాడలేను గదయ్య! పరుగెత్తు జాలులా!
హృదయమే బాడుకొను మదిని ఆనందమున
ఎవరు వినని పాట! నీవె విందువు గదా!

నాపాట ఎవ్వరును పరులు వినకుండగా
నీవె వినునట్లుగా నిఖిల! శాసించితివి!
అందుకే యీ విధిని చందముగ బాడకను
మది బాడుచుంటినీ మధుర గీతాలనూ!

నా గొంతు బాడేది నవనీత ఒకనాడు
మధుర సుస్వరములను మానుగా నొలికి!

## గొంతుతో బాడకను

గొంతుతో బాడకను కూర్మి హృదయముతోని
బాడేటి గీతమును బరగ మెచ్చుకొనీ!

ముత్యాల హారమును ముదముతో కంఠాన
బహుమతిగ వేసితివి బన్నుగా హర్షమున

గొంతుతో బాడకను గూర్మి హృదయముతోని
బాడేటి గీతమును బరగ మెచ్చుకొనీ!

పొందుగా ద్వారమున అందముగ కోకిలయు
పాడింది పాటను బన్నుగా హర్షమున!
హంసచేడియగూడి అభినయంబులతోని
అంబాలు చిందినది చందాలు నొలుకగా! ॥గొం॥

నెమ్మి నర్తకి గూడ నిమ్ముగా నాట్యాలు
శాస్త్ర సమ్మతముగా సరినొప్ప జేసినది!
చిలుక గోరింకలును జేరి తుమ్మెదతోని
తమ విద్యలను జాటు తరుణమున నే గూడ! ॥గొం॥

కిన్నెరను మీటుచును వన్నెలా గీతమును
మదియందు బాడితిని మానుగా శ్రీకృష్ణ!
పుష్పోప హారమును బొందుగా నను మెచ్చి
కంఠమున వేసితివి! కరుణతో కలయందు

గొంతుతో బాడకను కూర్మి హృదయముతోనె
బాడేటి గీతమును బరగ మెచ్చితివీ!

## ఏవేవొ చింతనలు

ఏవేవొ చింతనలు ఏవేవొ యూహలను
చేయుచుందునుగాని చిత్తమున దేలీ!

మనసులో దలచినది మానుగా కాదుగద!
అతడు దలచిన రీతి యా నిర్ణయం బగును

ఏవేవో చింతనలు ఏవేవో యూహలను
చేయుచుందునుగాని చిత్తమున దేలీ!

చింతనలః జేయకను శ్రీరమా విభునిపై
భారమును వేసితిని బన్నుగా తీర్పగను!
ఆత్మ సమర్పణము ఆత్మ విభునకు జేసి
ఎటు దారి జూపినను అటు బోదునే చెలీ!

మంచి చెడుగులు అన్ని మాధవుడు నెఱుగునే
మంచి మార్గమునందు మాధవుడు నను నడుపు!
ఏది కావలయునో వేడుకను దయజేసి
అట్టి సమయములందు అందించునే చెలీ!

ప్రారబ్ధ వశమునను బరగ జరుగుచునుండు
మంచి చెడుగులు కర్మ మార్గమున వర్తిల్లు!
పురుష ప్రయత్నమున పూనికను చేయుదును
ఆడంబరములేక అతి మౌన శైలిలో!

ఏవేవొ చింతసలు యేవేవొ యూహలను
చేయుచుందును గాని చిత్తమున దేలీ!

## అతి విశాలంబైన

అతి విశాలంబైన యలరు విశ్వమునందు
నాట్యవేదిక యందు నటులుగా జేసీ

ఆడించుచుంటివీ ఆటబొమ్మలు గాగ
నన్నొక్క పాత్రగా నాథ! పోషించితివి!

అతి విశాలంబైన యలరు విశ్వమునందు
నాట్యవేదిక యందు నటులుగా జేసీ!

కోట్లాది ప్రజలుగల కూర్మి నాటకమందు
ఒక్కొక్క పాత్రనూ యొనర రచియించితివి!
ప్రతిపాత్ర రంగమున బరగ నటియించుచును
పాత్రలే నిజమనుచు భ్రమ జెందుచున్నవీ!

నవ్వుతూ తూలుతూ నాట్యాలు సలుపుచును
కవ్వింపు కలతయును కమనీయ హర్షమును!
ముదమునను, రోదనల మూర్ఛనలు బోవుచును
కనులు మూయుచునుండె గలపాత్ర ముగియగా!

సూత్రధారిని మఱచి సూటిగా రంగమున
కథ కష్టముగ దిరుగు కదిలేటి పాత్రలను!
మెట్టబట్టి వేదికను మెసలకను బడద్రోయు
గర్వాంధులను ద్రోయు గానబడకను మఱల!

నాట్య వేదికయందు నటునిగా నేనుండి
నీవు నటిపినరీతి నిలిచి నడుచుచు నుంటి
ఒకనాడు దలపనూ యొనర నిజమనుచు యిది
నాట్యాభినయ మనుచు నయముగా భావింతు!

## మనసుతో మాధవుని

మనసులో మాధవుని మర్మముగ వీక్షింపు
జ్యోతిలో జ్యోతిగా దీప్తిజెందుచు నుండు!

ఆంతర్విలోకనం బవసరంబని గాద
మునులు జెప్పిన మాట మోదమున బరికింపు!

మనసులో మాధవుని మర్మముగ వీక్షింపు
జ్యోతిలో జ్యోతిగా దీప్తి జెందుచునుండు!

ఎచ్చోట వెదకినను అచ్చోటనే యుండు
ఏ రూపమున గాంచ ఆ రూపుకనిపించు!
అన్నిరూపులు వాడె ఆత్మయందున నిలుపు
జ్యోతి స్వరూపమున ప్రీతి జిందుచు నుండు!

అందాల ప్రకృతిని యలరారుచుండెపుడు
వివిధ రూపాలతో విలసిల్లు జగమంత!
మబ్బులో మెఱుపులో మధుర వెన్నెలలందు
సంధ్య కాంతులయందు సాధు హృదయుల యందు!

అంతర్విలోకనంబున గానబడు ననుచు
మౌన ప్రార్థనలతో మాటాడుచుండునట!
దేహమే దేవాలయం బనుచు భావించినే
జీవునే దేవునిగ భావమున తలచెదను!

మనసుతో మాధవుని మర్మముగ వీక్షింపు!
జ్యోనిలో జ్యోతిగా దీప్తి జెందుచునుండు!

## వేదనను జెందునూ!

వేదనను జెందనూ! విధివ్రాత బాదనను!
ఏ దారి నడిచినను నీదారి నడుతూ!

సుఖదుఃఖములు రెండు సూటిగా నొకటనుచు
నాటకపు పాత్రవలె నటియింతు సహజముగ!

వేదనను జెందనూ విధివ్రాత కాదనను
ఏదారి నడిచినను నీదారి నడుతూ!

చింతించి నా మనసు తొందరను బడబోను!
మబ్బులో మెఱుపుగా మాసిపోవగలేను!
చిఱు దీపమునువోలె చిన్నారి కాంతులను
బాటలో నడచెదను భయ మింతయును లేక!

కష్టములు దుఃఖములు కఠినమగు వేదనలు
కావడిగ నేమోసి కడకు జేరెద స్వామి!
మదిని శ్రమజెందనూ మానుగా కష్టములు
సంద్రాన యలలవలె శమియించు నని దలతు!

సత్ప్రవర్తనయందు సాధు మార్గమునందు
ఒరుల కన్యాయమును వర్తకంబుగ జేసి!
ప్రజల పీడనజేయు బ్రతుకు నే బ్రతుకనూ!
పూలమొక్కకు వోలె బొలుపు జిందుచు నెప్పుడు!

వేదనమ జెందనూ! విధి వ్రాత కాదనను!
ఏదారి నడిచినను నీదారి నడుతూ!

## ఈ విశ్వమంతటను

ఈ విశ్వ మంతటను నింపొందు జీవులును
నీ రూపమే గదా! నిఖిలేశ! జూడగా
జీవాత్ములకు జేయు శ్రీకరంబగు సేవ
బరమాత్మునకు జెందు బరగ నీకే గదా!
ఈ విశ్వమంతటను నిఖిల జీవులు గూడ
నీ రూపమే గదా నిఖిలేశ! జూడా!

ఆకలిని దప్పికను నల్లాడు జీవులకు
పట్టెడన్నము బెట్టి బరగ శ్రమ దీర్చుటయు!
ఆ మూల పురుషునకు యర్పించినటు నేను
భావించెదను మదిని బన్నుగా సేవయని!

చీకటిని యల్లాడు చింతలను మునుగుచును
నిరుపేద జీవులకు నిండారు దయతోని
ఆదుకొను వాడు సుమ! యలరి పరమేశ్వరుని
భావించెదను మదిని బరగ సేవకుడనుచు!

వెలుగు బాటలు జూపి విమలమగు పథమునను
నడిపించు మానవుల నాథ! నీ రూపముగ
భావించెదను మదిని బరగ యంజలితోని
పూజించి నట్లుగా పూజింతు నెల్లపుడు!

ఈ విశ్వ మంతటను నింపొందు జీవులును
నీ రూపమే గదా! నిఖిలేశ! జూడా!

## నీ మహా జ్యోతిలో

నీ మహాజ్యోతిలో నిండారు కిరణమును
కలుపుకో పరమాత్మ! కమనీయ రూపమున!

ఎన్నాళ్ళు నీ విధిని సన్నుతింతును కృష్ణ!
కిన్నెరను మీటుచును కీర్తనలు బాడుచును!

నీ మహా జ్యోతిలో నిండారు కిరణమును
కలుపుకో పరమాత్మ! కమనీయ రూపమున!

నీ మహా పద్మమున విరిసినా పత్రమును
వీడిపోయితిని స్వామి! కడదారులను నడిచి!
దూరమున నుంటినీ దురితములతో గూడి
అంట ముట్టక నన్ను నావలుంచితివయ్య!

మఱల నిను జేరగా మహనీయ చింతనను
సహజ స్సమాధిలో చరియించుచుంటినీ!
మనను చేష్టల నాపి మహనీయమగు నాత్మ
కమలమున జేర్చితిని కానుకగ నిచ్చితిని!

నీవు గూడను నన్ను నిండారు దయతోని
కరుణజూచుము కృష్ణ! కాంక్షతో నెల్లపుడు!
కర్మ బంధము అన్ని కడదేరినాకనే
నను జేర్పు నీ జ్యోతి నాథ! శ్రీ కరుణతో!

నీ మహాజ్యోతిలో నిండారు కిరణమును
కలుపుకో పరమాత్మ! కమనీయ రూపమున!

## పెరుగు తఱచిన రీతి

పెరుగు తఱచిన రీతి ప్రేమతో హృదయమును
మథియింపు! మథియింపు మానసము దొలుకా!

సర్వేశుడను వెన్న చక్కగా చేజిక్కి
ఆత్మ సాక్షాత్కార మందెదవు ప్రియముగా!

పెరుగు తఱచిన రీతి ప్రేమతో హృదయమును
మథియింపు! మథియింపు! మానసము దొలుకా!

పయపించు ముందుగా ప్రగతి పథముల యందు
ఆనంద జ్యోతినీ యలరి కనుగొనుటకై!
సన్మార్గవర్తనులు సహచరులు నెందఱో
దారిలో కలిసెదరు! దర్శనం బిచ్చెదరు!

తోటలో కాలిడుము! దోరముగ శోధింప
పూవు లెన్నో దొరుకు పూజకై నీ కచట!
మాతృ పూజకు వెడలు మధురమగు యాత్రలో
గమ్యమును జేరుదువు గలత నలతలు లేక!

అంతరిక్షమునందు నటు గనుము దీక్షతో
చుక్కలన్నీ నీకు సుందరంబగు సఖులు!
ఆత్మదర్శనమునకు నటు సాయబడగలరు
పయనించు పయనించు భయపడక ముందునకు!

పెరుగు తఱచిన రీతి ప్రేమతో హదృయమును
మథియింపు! మధియింపు! మానసము దొలుకా!

## ఆత్మలో నున్నట్టి

ఆత్మలో నున్నట్టి ఆల యీశ్వరుని గనక
అలత కలతలవేల? ఆరాట మేలా?

హృదయ మందిర మందు సదయుడదె జ్యోతిగా
వేచియున్నాడు గద! వేల కిరణాలతో!

ఆత్మలో నున్నట్టి అల యీశ్వరుని గనక
అలత కలత లవేల ఆరాట మేలా?

నిను ప్రేమ రాశిలో నిండార నింపగా
దన కరుణ వారాశి దగ నిన్ను జిలుకగా!
కనులెత్తి కనవు గద! కమ్మనీ దలపుతో
పితృ వాత్సల్యమున బ్రీతి జూడవు గదా!

వాత్సల్య కరుణలను వనర దోసిలిబట్టి
నీ శీర్షమున నొలుక నిండారు ప్రీతితో!
నిలిచినా జ్యోతినీ నిండార దర్శించి
కౌగలింపవదేల కారుణ్య మూర్తినీ!

ఆరాధనయు మఱియు అర్పించుటయు లేక
పేదబంధువు వోలె పెరటిలో నున్నాడు!
తన ప్రేమ కరుణలను దగ నీకు నందింప
వేచియున్నాడు గద! వేదనలతో గూడి

ఆత్మలో నున్నట్టి అల యీశ్వరుని గనక
అలత కలత వేల? యారట మేలా?

## పాల బుగ్గల నాటి

పాల బుగ్గలనాటి పసితనము నుండియును
నిన్ను దలచుచునుంటి నిఖిలాత్మ మదినీ!

కష్ట సుఖముల యందు కలిసియుండెద వనుచు
మాధవా! నిన్నెపుడు మది యందు నుంచితిని!

పాల బుగ్గల నాటి పసితనము నుండియును
నిన్ను దలచుచునుంటి నిఖిలాత్మ మదినీ!

ఆకాశ పథమందు అలరు చుక్కలకు వలె
ఎన్నెన్నొ ఆపదలు చిన్నతనమున నుండి!
అన్ని తొలగించి నను ఆదుకుంటివి స్వామి
తిన్ననీ మార్గాన దిశను జూపించితివి!

రచనా విధానమును రమ్యముగ దయచేసి
లోకోప కృతిసేయ లోల బోధించితివి!
ఖ్యాతి దెప్పించితివి కమనీయ కవితనూ
నిను దెలిసికొంటినీ నిఖిలాత్మ వాసివని!

పనులన్ని ముగిసినవి బరగ నే జేయగా
కార్య మేమియు లేదు కమలాక్ష! శ్రీకృష్ణ!
పాత్ర ముగిసేవేళ బరగ నన్నే విధిని
కనులు మూయింతువో కమనీయ ప్రకృతిని!

పాల బుగ్గల నాటి పసితనము నుండియును
నిన్నుదలచుచు నుంటి నిఖిలాత్మ మదినీ!

## విశ్వవేదిక యందు

విశ్వ వేదిక యంచు విమల నాటక మందు
బహు చిన్ని పాత్రనూ బరగ నిచ్చితివీ!

ఆటుపోటు లవెన్ని అలరి వచ్చిన గూడ
భద్రముగ జేర్చితిని బరగ జీవిత నౌక!

విశ్వవేదిక యందు విమల నాటక మందు
బహూ చిన్న పాత్రనూ బరగ నిచ్చితివీ!

పుట్టు దారిద్ర్యమున బులకరింపగ జేసి
అష్ట కష్టములతో నలరింప జేసితిని!
అవమానములతోని యలమటింపగ జేసి
బ్రతుకు 'ఛీ!' యనిపించె ప్రబల విధి వ్రాతలకు ॥విశ్వ॥

అయిన నిన్నెల్లపుడు ఆరాధనలతోని
మనసులో నుంచితిని మానకను ఆత్మేశ!
హర్ష విషాదముల అలరేటి భాష్పముల
రెండు కన్నులతోని నొలికితిని పరమేశ! ॥విశ్వ॥

విధి విచిత్రము గదా! విపులముగ ధనరాశి
నాకెందు కిచ్చితివి నను బరీక్షింపనా?
నా సంపదంతయును నీకె యర్పించితిని
దారిద్ర జీవితము దగ జరుపుచుంటినీ!

విశ్వ వేదిక యందు విమల నాటకమందు
బహు చిన్ని పాత్రనూ బరగ నిచ్చితివీ!

## అంతులేని యాత్ర

అందులేనీ యాత్ర! యలరి జేయుచునుంటి
ఎచటాగునో యేమొ! యేగిరుల దాపునో!

గమ్యమన్నదిలేదు కథ ముగింపును లేను!
అతి దీర్ఘ యాత్రయిది! యలరి యెపుడాగునో!

అంతులేని యాత్ర! యలరి జేయుచు నుంటి
ఎచటాగునో యేమొ! యే గిరుల దాపునో!

ఛదువు సంధ్యలులేని చాకి మూటను నేను
విధివ్రాత వలన నే విపదలకు లోనైతి!
అపరంజ్యోతినీ ఆత్మలో దలచుచును
విధివ్రాత దుడిచితిని విమలమగు పథమందు!

ఆకాశ మార్గమున హంస చరియించినటు
భగవంతు కవితలో భక్తితో మునిగితిని!
అంతరంగమునందు నలరు జ్యోతిని గాంచ
తపియించుచుంటినీ తప్తకాంచనము వలె!

కనగలనా! లేనా! యా కమనీయజ్యోతినీ
వినగలనా! లేనా! యా విమల మురళీస్వనము!
ప్రశ్నింపబోను నే ప్రబల కారణములను
అచలముగ మౌనముగ యలరుదును గిరివోలె!

అంతులేనీ యాత్ర! అలరి జేయుచు నుంటి!
ఎచటాగునో యేమొ! యేగిరుల దాపునో!

## క్రొన్నెలను గాంచి నే

క్రొన్నెలను గాంచి నే కుదురుగా అలనాటి
బాల్య జీవితమునూ బరగ మది కొచ్చే!

ఆట పాటలతోని అలరేటి దినము లవి
కనులలో కనిపించె కలవోలె మధురముగ!

క్రొన్నెలను గాంచి నే కుదురుగా అలనాటి
బాల్యజీవితమునూ బరగ మది కొచ్చే!

ఆట పాటలతోని ఆలయంబుల యందు
సఖులతో ప్రియముగా చక్కదనముగ నాడి!
తీర్థ ప్రసాదముల దీరుగా బుచ్చుకొని
ఇంటికొచ్చెడి వాడ నింపుగా సఖులతో!

సంక్రాంతి మాసమున చక్కనీ పాటలను
జియ్యరులు బాడగా దిశలన్ని మ్రోగగా!
వారితోగూడ నే వొద్దికను నడుచుచును
పాటలను విని నేను బరగ వచ్చెడివాడ!

కృష్ణయొడ్డున జేరి కుదురుగా నొంటరిగ
అలల సుస్వరములను నలరుచును నే గూడ!
పాడుకొనువాడనూ బరగ కంఠము నెత్తి
ఆ రోజు లిక రావు ఆ మధుర జీవితము!

క్రొన్నెలను గాంచి నే కుదురుగా అలనాటి
బాల్య జీవితమును బరగ మది కొచ్చే

## ఆత్మ సాక్షాత్కార

ఆత్మ సాక్షాత్కార మందుకొన దయతోని
నను కృతార్థుని జేయి! నందగోపాలా!

నీ మురళి స్వనములను నే లీనమగునటుల
ఆశీర్వదింపుమా! అందాల గోపాల!

ఆత్మసాక్షాత్కార మందుకొన దయతోని
నను కృతార్థుని జేయి! నందగోపాలా!

బ్రతుకంత నిను బాడి భవ్య గీతములతో
రాసక్రీడల నాడి రమ్యమగు గోపికగ!
అలనాడు గోపికలు ఆటిపాడిన రీతి
నే గూడ బాడితిని నిండారు మదితోని!

ఏ పాట పాడినా నీపాట మది యందు
ఏరూపు గాంచెనా నీ రూపు మది దోచు!
నీ నెమిలి పింఛమే నిండారు హృదియందు
నీయడుగు మువ్వలే నినదించు కర్ణముల!

ఆత్మస్వరూపుడవు అఖిల జీవుల యందు
జ్యోతిగా నుండేటి జ్యోతి స్వరూపుడవు!
నాలోనె నిను జూతు నా యంతరంగమున
అఖిల జీవులయందు నలరి యున్నట్లుగా!

ఆత్మసాక్షాత్కార మందుకొన దయతోని
నను కృతార్థుని జేయి నందగోపాలా!

## నాకున్న సొగసులను

నాకున్న సొగసులను నాకున్న మధురిమలు
చెలుల కిచ్చితి స్వామి! చేరగా మురళీ!
నామౌన గీతమును నాథ! నే బాడుచును
వెంట వచ్చుచునుంటి చంటిపాపకు వోలె!

నాకున్న సొగసులను నాకున్న మధురిమల
చెలుల కిచ్చితిస్వామి! జేరగా మురళీ!

మధుర కంఠమును మఱి మధురసుస్వనములను
కోకిలకు నిచ్చితిని కూడినా ప్రేమతో!
అభినయంబంతయును నల హంస కిచ్చితిని
రిక్తహస్తముంతో భక్తి వచ్చుచు నుంటి!

నాట్యసారము నంత రమణి నెమిలికినిచ్చి
తూలి పాడెడి పాట తుమ్మెదల కిచ్చితిని!
రక్తి నీకివ్వగా నవరత్నములు లేవు
మౌనధ్యానము తోని మదియందు నిలుపుకొని!

నీవెచట నిలుతువో! నే నచట నిలిచెదను!
నీవెటకు బోదువో! నే నటకు వచ్చెదను!
ఒకటికిని ప్రశ్నింప యెందుకని యడుగనూ
కన్నీటి బిందువుల గల భక్తి నొలుకుచును!

నాకున్న సొగసులను నాకున్న మధురిమల
చెలుల కిచ్చితి స్వామి! జేరగా మురళీ!

## మనసులో భావాలు

మనసులో భావాలు మధురమగు నాదాల
పాడగాలేను గద! భవ్య కంఠమునా!

వెలుపరింపగలేను విశదమగు రాగాల
చెవులకింపును గలుగ తేటతెల్లముగా!

మనసులో భావాలు మధురమగు నాదాల
పాడగాలేను గద! భవ్య కంఠమునా!

పిలిచి పిలిచీ నిన్ను ప్రేమతో రాగాల
అలసిపోతిని స్వామి! సొలసి పోతిని మిగుల!
మధురకంఠము గాంచి మధుపములు నీర్ష్యతో
గూడుకట్టినవేమొ! కుదురుగా గోపాల!

నా కంఠమును జూచి నల్లనీ కోకిలలు
వల్లమాలిన సిగ్గు పల్లవింపగ లజ్జ!
నల్లనీ కలువలను తెల్లనీ మల్లెలను
మంత్రించినవి యేమొ మధురిమలు రాకుండ!

నా హృదయ రాగమును నా కంఠ గానమును
ఎవరికిని వినబడదు యే పాపమోగాని!
నీకె వినిపించునూ నీడవలె వెన్నాడి
హంసపద ధ్వనికివలె అలరారు నాగీతి!

మనసులో భావాలు మధురమగు నాదాల
పాడగాలేనుగద! భవ్య కంఠముతోని!

# పండుటాకును బోలె

పండుటాకును బోలె పండి తెలతెలనైతి
రాలుటకు సిద్ధమై రవ జేయుచుంటి!

సంభ్రమున అలవోలె సరసతను దరికొచ్చి
మాయమైపోవుటకు మనసు నిశ్చయ మాయె!

పండుటాకును బోలె పండి తెల తెలనైతి
రాలుటకు సిద్ధమై రవ జేయుచుంటి!

అంతరిక్షమునందు నలరు చుక్కల్లార!
కనబడను నే నికను! కదిలిపోవుచు నుంటి!
విభుని సన్నిధి కేగి విపులమౌ పాదముల
స్పృశియింప గోరుచును భ్రమశిపడుచుంటినీ!

చిగురుటాకుగ వెలసి చివ్వారి పాటలను
మీనుండి నేర్చితిని! మేలిమిగ వనమందు!
పాడితిని కోకిలా! పద్మనాభుని గూర్చి
రాలుటకు సిద్ధమై రవలు జేయుచునుంటి!

కర్మ పరిపూర్తియై కార్యమును సిద్ధించి
వ్రత సమాప్తంబునై వన్నెలన్నియు దరిగి!
చివరిదశ ప్రాప్తించె చెన్నుగా దీపమును
కొడిగట్టినది కృష్ణ! కూర్మి యవసానదశ!

పండుటాకును బోలె పండి తెలతెలనైతి
రాలుటకు సిద్ధమై రవ జేయుచుంటి!

## నిను వెదుకు వారినీ

నిను వెదకు వారినీ నిలిచి కనిపింపకను
తప్పించుకొని తిరిగి దగ మోసగింలెదవు!

తప్పించుకొనలేవు! తగ నన్ను మురిపించి
పదములను బంధించి భద్రముగ దాచెదను!

నిను వెదుకు వారినీ నిలిచి కనిపింపకను
తప్పించుకొని తిరిగి దగ మోసగించెదవు!

తీరముగ కోకిలలు దోరముగ పాడుచును
వనవీధి దాగినా వన్నెలవి సాగవు!
చిగురాకు పువ్వులను చిత్రముగ బంధించి
మావికొమ్మను నిన్ను మధురముగ నుంచెదను!

మబ్బులో మెఱుపుగా నూయగా నుండగను
నీలి గగనము నందు నిలిపెదను గదలకను!
మనసు దారాలతో మర్మముగ ముడివేసి
దాచుకుందును కృష్ణ! తరిలేని ప్రీతితో!

నీకు నాకున్నదీ నిరవధిక మగు ప్రేమ
అంతులేని యాత్ర యలరి జేసితిమి కద!
నీ మర్మమంతయును నిండుగా తెలిసితిని!
నను దాటి పోలేవు! నాథ! యేనాటికిని!

నిను వెదుకు వారినీ విలిచి కనిపింపకను
తప్పించుకొని తిరిగి రగ మోసగించెదవు!

## ఈ విశ్వ జీవులను

ఈ విశ్వజీవులను ఈ కాంతి కిరణాల
వేఱుగా భావించి వెతను గలిగిస్తాను!

అన్నదమ్ములవోలె! యలరి జూడక నేను
ఆత్మీయతను వీడి యందఱును వేఱనుచు

ఈ విశ్వ జీవులను యీ కాంతి కిరణాల
వేఱుగా భావించి వెతను గలిగిస్తాను!

ఒకచెట్టు పూవులని ఒక పూవు రేఖలని
కమనీయ కాంతిలో కాంతి మొలకల చునుచు
మనసునను దలపకను మహనీయ తత్త్వమున
వేరుగా దలచుచును విమలతను గోల్పోయి! ॥ఈ॥

ఒక్కొక్క బిందువే యొనర యలయగు గాద!
ఒక్కొక్క యలతోని యొనర సంద్రంబగును!
ఒక్కొక్క పూరేఖ యొనర పుష్పంబగును
ఒక్కొక్క వర్ణమే యొనర హరివిల్లగును! ॥ఈ॥

జీవులన్నియుగూడ స్థిరముగా కిరణములు
విశ్వజ్యోతిని గూడి విలసిల్లుచున్నవి!
జ్యోతినీ విడివడిన జ్యోతి స్వరూపులము
జ్యోతిలో గలియగా ప్రీతి వర్తింపవలె!

ఈ విశ్వ జీవులను ఈ కాంతి కిరణాల
వేఱుగా భావించి వెతను గలిగిస్తాను!

## ౨ నిరీక్షణ మందు

నీ నిరీక్షణ మందు నిలిచితిని రాత్రంత
వెన్నెలా తీవెలను వెత నొందుచును కృష్ణ!

కొండ శిఖరముసందు కోవెలను గాంచుచును
కన్నులను నిండినా కలత భాష్పములతో!

నీ నిరీక్షణ యందు నిలిచితిని రాత్రంత
వెన్నెలా తీవెలను వెతనందుచును కృష్ణ!

అపుడపుడు కిన్నెరను నలతి మ్రోగించుచును
గొంతెత్తి బాడుచును గోరి నిను బిలుచుచును!
సన్నగాలులు జేయు సవ్వడిని వినుచునూ
ఆశా నిరాశలూ నల్లుకొన హృదయమున! ॥నీ॥

చీమ చిటుకన్నను చెట్టుపై గోరింక
రెక్క కదిపిన గూడ చిక్కనీ వెన్నెలను!
చంద్రకిరణము సోకి సాంద్రమగు కొలనులో
అలల కదలిక గూడ అలరుదును నీ వనుచు! ॥నీ॥

వికలమై నా మనసు వేయివిథములు గాగ
నీ దర్శనము కొఱకు నిరతమును గాంచుచును!
తొలిరేఖ లుదయించె దోరముగ తూర్పుదెస
రావుగద! శ్రీకాంత! రమ్యముగ నను దేల్ప!

నీ నిరీక్షణమందు నిలిచితిని రాత్రంత!
వెన్నెలా తీవెలను వెత నొందుచును కృష్ణ!

## అంతులేనీ పయన

అంతులేనీ పయన మాగునో శ్రీకృష్ణ!
తుదిలేని నాపాట తీరముగ యాగునో!

కమనీయ మురళితో కనుదోయి కనిపించి
నన్ను మన్నింతువో విన్నపము నాలించీ!

అంతులేనీ పయన మాగునా శ్రీకృష్ణ!
తుదిలేని నాపాట తీరముగ నాగునో!

ముందు నడిచెద వెప్పుడు కందిపోవగ నేను
చిందినా వేదనను జేర వత్తును నిన్ను!
మబ్బులో చంద్రుడును మాయమగు రీతినీ
కనిపింప వెందుకో! కనులార నినుగాంచ! ॥అంతు॥

అలరి హృదయముతోని ఆరాధనను జేసి
పూజింపనీయవూ పులకరింపగ నేను!
చుక్కవలె కనిపించి చూడరాకుండగను
మటుమాయ మయ్యెదవు మాయగా గోపాల! ॥అంతు॥

దూరముగ కనిపించి దోబూచు లాడెదవు!
మన్నింప వెందుకో మధుర గోపిక నేను!
పయనమును ఆపినను పలుకరింపగరాద!
ప్రేమతో మురళిలో ప్రీతి జేర్పగ రాధ?

అంతులేనీ పయన మాగునో శ్రీకృష్ణ!
తుదిలేని నాపాట తీరముగ యాగునో!

# నిదురలో నను ముంచు

నిదురతో నను ముంచు నింపార కలలలో
నను దేల్పు మో స్వామి! నవనీత భావాల!

జాగృతిని వ్యధలతో శిథిలితను మది క్రుంగి
కన్నీటి ధారలను కదలి నొంపగలేను!

నిదురతో నను ముంచు నింపార కలలలో
ననుదేల్పు మో స్వామి! నవనీత భావాల!

అలమటింపగ లేను అరాట పడలేను
అడుగడుగు నిను బిలిచి కదలి యలిచిన య ల!
బిలువగా లేను మఱి పెను భూతమును వోలె
మందహాసముతోని మది యందు నిను గాంతు!

తీయనీ నిదురలో దీరుగా కలయందు
మధుర రూపముతోని మాటాడు చుండెదను!
గగనమందున నిన్ను గాంచుచును సఖునివలె
చిరకాల పరిచితుగ జేరుదును నీతోని!

నిదురలో నను ముంచు నిస్తేజమును నంద
కలలలో నను దేల్పు కాంచనా ద్వారాల!
నీతోని చరియింతు నఖిల లోకములందు!
బంగారు దీవులను రంగారు దృశ్యముల!

నిదురతో నను ముంచు నింపార కలలలో
నను దెల్పుమో స్వామి నవనీత భావాల!

## మనసుతో భావాలు

మనసులో భావాలు మధురమగు నాదాలు
పాడగా లేను గద! భవ్య కంఠమునా!

వెలువరింపగలేను! విశదిమగు రాగాల
చెవులకింపును గలుగ తేటతెల్లముగా!

మనసులో భావాలు మధురమగు నాదాలు
పాడగాలేను గద! భవ్యకంఠమునా!

పిలిచి పిలిచీ నిన్ను ప్రేమతో గీతాల
అలసిపోతిని స్వామి! సొలసిపోతిని మిగుల!
మధుర కంఠముగాంచి మధుపములు నీర్ష్యతో
గూడు కట్టిన వేమొ కుదురుగా గోపాల!

నా కంఠమును గాంచి నల్లనీ కోకిలలు
వల్లమాలిన సిగ్గు పల్లవింపగ లజ్జ!
వల్లనీ కలువలను మల్లెలను కలబోసి
మంత్రించినవి యేమొ మధురిములు రాకుండ!

నా హృదయ రాగమును నామది సుగానమును
ఏ పాపమోగాని యెవరికిని వినబడదు!
నీకె వినిపించునూ నీడవలె వెన్నాడి
హంస పద ధ్వనికివలె అలరారు నా గీతి!

మనసులో భావాలు మధురమగు నాదాలు
పాడగా లేను గద! భవ్య కంఠమునా!

## కిన్నెరను మీటుచును

కిన్నెరను మీటుచును కీర్తనలు బాడుచును
ఊరువాడలు వెదికి పేరుతో బిలువనూ!

అంతరంగమునున్న అఖిలేశ్వరుడ వీవు
అఖిల జగమంతయును నావరించిన నిన్ను!

కిన్నెరను మీటుచును కీర్తనలు బాడుచును
ఊరువాడలు వెదికి పేరుతో బిలువనూ!

ఉదయ సంధ్యలయందు సదయ కుంకుమలనూ
వెదజల్లుదువు గదా! వేడుకను జగమంత!
నిను జూడకున్ననూ మము గాంతు వందలను
సన్నని గాలులను సయ్యాట లాడుచును!

చంద్రకాంతులతోని సాంద్ర కిరణములతో
వెదజిల్లుదువు గదా! వేడుకను వెన్నెలల!
పూజింపకున్ననూ పొలుపుగా నాశీస్సు
అలరి యిచ్చెదవు గద! హర్ష భాష్పములతో!

అధివసించెద వెపుడు అంతరంగమునందు
ఏది కావలయునో వేడుకను గనుగొనుచు!
అందించు చుందువూ అఖిల కోరికల వే
స్పందించు చుందునూ సరసముగ పరమాత్మ!

కిన్నెరను మీటుచును కీర్తనలు బాడుచును
ఊరు వాడలు వెదికి పేరుతో బిలువనూ!

## ఎవరులేనట్టి యీ

ఎవరులేనట్టి యా యేకాంత దేశమున
పాడుకోనీ నన్ను పరవశము జెందా!

అందాల బొమ్మతో చందాల చినిపాప
ఆడుకున్నట్లు నన్నాడుకోనిమ్మా!

ఎవరు లేనట్టి యా యేకాంతదేశమున
పాడుకోనీ నన్ను పరవశము జెందా!

ప్రాణ స్నేహితునికి వలె బరగ నిను నమ్ముకొని
తెలియనీ దేశాల జేరగా నిమ్మా!
నదుల పర్వతములను నడయాడనిమ్ము నను
కాఱడవులను నన్ను కదిలిపోనిమ్మా!

వృక్షమూలము అందు నొరిగి నిద్దురబోయి
మైదావములయిందు మఱల పయనము జేసి!
గిరి గుహల యందునా కిన్నెరలు బాడేటి
వన దుర్గములయందు నొరిగి పోనిమ్మా!

ఎవరనీ దారిలో నెచ్చటికని ప్రశ్నింప
మబ్బులావల యున్న మాధవుని కడకునని!
దన లేఖ అందునా వెన్నెలా రంగులను
కలిసిపోవుట కనుచు కాఖితము దెలిపెదను!

ఎవరులేనట్టి యా య్యేకాంత దేశమున
పాడుకోనీ నన్ను పరవశము జెందా!

## సంగీత ధ్వనులతో

సంగీత ధ్వనులతో సయ్యాట లాడేటి
గొంతు గలిపితివి గద కూర్మి గోపాలా!

గొంతు కడ్డము నిలిచి కూర్మి హృదయముతోని
పాడమని పాట నను బరగ గానించితివి!

సంగీత ధ్వనులతో సయ్యాట లాడేటి
గొంతు నాపితివి గద! కూర్మి గోపాలా!

హృదయ రాగమునందు వెలసినా పద్మమును
మధుర సుస్వనములను మాధుర్యమును వెలయ!
తూనీగ తుట్టెలను దోరముగ బెంచి నను
అడవులకు దోలుటను అన్యాయమును గాద!

పంజరములో జిలుక బరగ బయటకు బంపి
సరసిలో హంసనూ దగ కానలకు నెట్టి!
కొమ్మపై నున్న యా కోకిలను బడ్రదోసి
పడవపై తెరచాప బరగ దించితి వేల?

కరుణా సముద్రుడని కమనీయ జ్యోతివని
వింటినీ శాస్త్రముల వేద పాఠము లందు!
ఇంత కఠినుండవనీ సుంత దెలియను గదా!
అంతు తెలియ్యదు నీదు అల్లరి పనులకును!

సంగీత ధ్వనులతో సయ్యాట లాడేటి
గొంతు నాపితివి గద! కూర్మి గోపాలా!

## చాలు! చాలును స్వామి!

చాలు చాలును స్వామి! సయ్యాట లిక చాలు!
తోలు బొమ్మగ నన్ను దూలగా జేసి!

చివటి యంకము దాక చిత్రముగ నను నడిపి
వదిలివేసితి వేల? యూహ కందని రీతి!

చాలు చాలును స్వామి! సయ్యాట లిక చాలు
తోలు బొమ్మగ నన్ను తూలగా జేసి!

కాఱు జీకటి యందు కఱకు బాటల యందు
పయనింప జేసితివి బరగ కన్నీ రొలుక!
అవమానముల తోని యటు నీటూ నొఱిగితిని
నీవు నడిపిన రీతి నిలిచితిని రంగమున!

కంటినీ రొలకితిని కరుణారసము దొలుక
ఆకలీ వేదనల యలసటను గ్రుంగితిని!
లక్షాధికారిగా లావుగా నను జేసి
గిరిదాటగా నన్ను గిలిగింత బెట్టితివి!

హర్ష విషాదముల ఆనంద సమయముల
నిను మఱువ లేదుగా! నీతి దప్పగలేదు!
పాత్ర నిమగ్నమై పరవశము గాలేదు
ఏమిజేయుదువో తుది విమలమగు నా పాత్ర?

చాలు! చాలును స్వామి! సయ్యాట లిక చాలు!
తోలు బొమ్మగ నన్ను దూలగా జేసి!

## కలగుండు బడలేదు!

కలగుండు బడలేదు! కష్టాలు బడలేదు!
కన్నీటి బాష్పములు కదలి నొలుకగ లేదు!

విధివ్రాత జవదాటి విరులలో దేనియల
ద్రావగా జనలేదు! జవదాటి నీయాన!

కలగుండు బడలేదు! కష్టాలు బడలేదు
కన్నీటి భాష్పములు కదలి నొలుకగ లేదు!

పద్మవ్యూహము వోలె బరగు కష్టాలనూ
నవ్వుతూ దాల్చితిని నాథ! శిర మందునా!
అడుగడుగు నాపదల యలరు పూ మాలలుగ
ఎదయందు ధరియించి మది సంతసించితిని!

దారిద్ర్య రేఖలో దగ నేను పయనించి
ఆపదల గీతలో నలరితిని కొన్నాళ్ళ!
అవమానముల బ్రతుకు నటులనే గడిపితిని
హేమంతయును బోలె విరిసితిని కన్నీళ్ళ!

మఱువలేదు గదయ్య మాటలందున గూడ
నీ మధుర నామమును నీ మురళి ధ్వనులనూ!
తుది కెటుల జేతువో! తోలముగ నా పాత్ర
నీకె తెలియును స్వామి! నీ రచన శిల్పములు!

కలగుండు బోలేదు! కష్టాలు బడలేదు
కన్నీటి భాష్పములు కదలి నొలుకగ లేదు!

## హృదయ మందిరమందు!

హృదయ మందిరమందు సదయ ఒక కిరణముగ
అలరి యున్నావు గద! అమృతాంశు రేఖగా!

పిలుచుచున్నాను నిను ప్రీతిగా రమ్మనుచు
ఉన్న నిను గానకను నూరెల్ల వెదికినట!

హృదయ మందిరమందు సదయ ఒక కిరణముగ
అలరి యున్నావు గద! అమృతాంశు రేఖగా!

వ్రాయు గీతికల నే వ్రాయు కవితలను
వినుచుంటివే గాని వేడుకను ప్రేమతో!
మంచి చెడుగులను మఱి మదినైన దెలుపవూ
ఆదరం బింతైన యరసి జూపింపవూ!

నా మంత్ర జపములను నా ధ్యాన ముద్రలను
గమనింతునే గని కౌగలింపవు నన్ను!
శారీర కూపమున పడియుండు టెన్నాళ్ళు?
నాకాంతి కిరణమును నాథ! జ్యోతిని గలుపు!

భవబంధముల నుండి బయటకును రప్పించి
నీ మహా జ్యోతిలో నిర్మలముగా గలుపు!
కంటనీరును లేదు కన్నీళ్ళు లొలుకగా
వేదనల నుండెపుడొ వేరైతి పరమాత్మ!

హృదయ కమలమునందు సదయ ఒక కిరణముగ
అలరియున్నావు గద! అమృతాంశు రేఖగా!

# ఆరాధనను జేయు

ఆరాధనను జేయు నలరి తుది దినమనుచు
పన్నుగా దలచెదను భావమున నేడూ!

చుక్కలందున నొక్క చుక్కనై గగనమున
పయనిందు చున్నటుల బరవశించుచు నుంటి!

ఆరాధనను జేయు నలరి తుది దినమనుచు
పన్నుగా దలచెదను భావమున నేడూ!

భువన మోహనమైన మురళిలో రవమునై
కలిసిపోదు నటంచు కల దోచుచున్నదీ!
చివరి పూజకు నేను చిత్తమున భక్తితో
సింధూర కుంకుమలు చెన్నుగా దెచ్చినటు!

వెలిగింపకుండగనె వెలిగినది దీపమును
చిఱు దీప కాంతులును చిత్రముగ దోచినవి!
మీటకను కిన్నెరయు మేలిమిని స్వనములును
లయ తాళ ధ్వనులతో రాగాలు విరియగా!

అలరి నా హృది కిరణ మద్వైతభావమున
పాడుచున్నది పాట పరమేశ్వరుని గూర్చి!
ఓంకార నాద మెదొ యొనరగా వచ్చి నను
కౌగలించిన యటుల గానబడుచున్నదీ!

ఆరాధనను జేయు నలరి తుది దినమనుచు
పన్నుగా దలచెదను భావమున నేడూ!

## దేహాత్మ బుద్ధితో

దేహాత్మ బుద్ధితో దిశలు దిరుగుచునుంటి
అంతరాత్మను నిన్ను అరసి గనరేకా!

హృదయ మందిరమందు సదయ నిలిచిన నిన్ను
కానలను కోనలను కదిలి వెదుకుతునుంటి!

దేహాత్మబుద్ధితో దిశలు దిరుగుచు నుంటి
అంతరాత్మను నిన్ను నరసి గనలేకా!

చిఱు దీప కిరణముగ చిన్నారి హృదయమున
అలరియుండుట నిన్ను ఆనంద మూర్తిగా!
గనలేకపోయితిని కదలికొండల నెక్కి
నిను బిలిచితిని స్వామి!నీరధిని యలలవలె!

ఆరుద్ర పురుగువలె యఖిల జీవులయందు
అలరియుంటిని స్వామి అది నేను గనలేక!
కిన్నెరను మీటుచును కీర్తనల బాడుచును
ఊరూరు దిరిగితిని వరుసగా బిలుచుచును!

ఆత్మశాశ్వతము మఱి అల దేహ మస్థిరము
అందుకే కనబడవు అలరు నా కన్నులకు!
ఆత్మలో కనబడుచు ఆనంద రూపమున
కరుణ కటాక్షించి కాపాడు చుందువూ!

దేహాత్మ బుద్ధితో దిశలు దిరుగుచు నుంటి
అంతరాత్మను నిన్ను నిరసి గనలేకా!

# విశ్వవేదిక - విభుని విలాసం
## (లలిత గీతాలు)

### మత్తభ్రమరమువోలె

మత్త భ్రమరమువోలె మాధుర్య మొలుకుచూ
విభుని సందేశమును వినువీధు లంతటను!

చాటుచుంటిని సకల సరులందు గిరులందు
పూవుపూవున నిలిచి పులకరించుచునూ!

మత్తభ్రమరమువోలె మాధుర్యమొలుకుచూ
విభుని సందేశమును వినువీధులంతటను!

ఝుమ్మనుచు నాదమున శ్రుతిలయల బాడుచును
వనవీధి యంతటను వరుసగా దిరుగుచును!
తీవెలను గదిలించి తీరుగా పూవులకు
విభుని సందేశమును వినిపించుచును నుంటి! ॥మత్త॥

అందాలు కొన్నాళ్ళు అలరియుండుట భువిని
పరిమళము కొన్నాళ్ళు పరగ నశియించునూ!
తీవెలను కొన్నాళ్ళు తీరుగా నుండుటయు
రాలిపోవుట నిజము రహి నిశ్చయమ్ము సుమి! ॥మత్త॥

బ్రతికినన్నాళ్ళు నా పరమ పావను దలచి
పరుల సుఖమునకు నై పాటుబడుటయు మేలు!
ఆత్మలో శ్రీహరిని అలరి దర్శించుటకు
యత్నించు చుంటినీ పత్నివలె భర్తకును!

మత్త భ్రమరమువోలె మాధుర్య మొలుకుచును
విభుని సందేశమును వినువీధు లంతటా!

## అల యశోదాదేవి

అల యశోదాదేవి అలరి జోలునకు నిను
కట్టివేసినదిగద కనలి చిలిపిపనుల!

అట్టి జోలును నీవు నలమద్ది తరువులకు
మధ్యగా లాగితివి మద్ది వృక్షములుబడ!

అల యశోదాదేవి అలరి జోలునకునిను
కట్టివేసినది గద! కనలి చిలిపి పనుల!

హృదయారవిందమున సదయ నిను బంధించి
మధుర గీతములతో మానుగా గీర్తింప!
మధుకరమువలె నీవు మానుగా దూరమున
పాడుచున్నావుగద! పరవశింవగ మురళి!

అలనాటి గోపికను ఆర్తిబాపు మటంచు
తీయనీ వినతులను దీరుగా జేయగను!
కొండ కోనలయందు కోనేరులందునను
ద్రిప్పుచుంటివి స్వామి! తీయనీ పలుకులను! ॥అల॥

నీ మురళి రవములను నీజ్యోతి కాంతులను
కలుపుకొనుమని నేను కరము ప్రార్థింపగా
కరములందింపవూ కనికరింపవు స్ఫూర్తి
నిండార హృదయాన నిలిచి కరుణింపవూ!

అల యశోదాదేవి యలరి జోలునకు నిను
కనలి చిలిపిపనుల కట్టివేసినదిగద!

## శిశిర ఋతువునువోలె

శిశిర ఋతువునువోలె చిరకాల దుఃఖమున
విరహతాపమున నే వేదనను మునిగి!

పరితపించుచునుండ భవ్యమగు వాసంత
ఋతువుతో నోదార్చి బ్రతుకు మార్చెదవూ!

శిశిర ఋతువును వోలె చిరకాల దుఃఖమున
విరహ తాపమున నే వేదనను మునిగి!

కన్నీటిముత్యాలు కడలి గలుపుచు నుండ
శోకవారాశిలో దూలిపోవుచు నుండ!
పత్రపుష్పములతో బరగ ప్రకృతియంత
మధుర దృక్యములతో మానుగా నిలిపెదవు! ॥శిశిర॥

చిలుక గోరింకలను చిన్నారి తుమ్మెదల
మధుర గీతముబాడు మాధుర్యమును జిందు
కోకిలను బంపేవు కుహూ కుహూ నాదముల
సన్నని యేటిలో చరియించు పక్షులను! ॥శిశిర॥

నా దుఃఖశోకముల నాథ! జూడగ లేవు!
నా హృదయ వేదనను నవనీత హరియింప!
వింత పరిచర్యలను విమల మాధుర్యముల
సమకూర్చి జేయుదువు సంగీత ధ్వనులతో!

శిశిర ఋతువును వోలె చిరకాల దుఃఖమున
విరహతాపమున వే వేదనను మునిగి!

## సుఖ దుఃఖములతోని

సుఖ దుఃఖముల లోని సుందరంబగు యాత్ర
మనసుకింపును గూర్చి మాధుర్య మొలుకూ!

కొండ శిలువకు వోలె బండవలె ఒకచోట
పండి నిద్దురబోవ బరగ యది సుఖమా?

సుఖదు:ఖముల తోని సుందరంబగు యాత్ర
మనసు కింపును గూర్చి మాధుర్య మొలుకూ!

లేడివలె బరుగెత్తి లీలగా వనమంత
సంచరించుట వింత కాంతులను గాంచుటను!
ప్రకృతి యందాలతో బడి లేచుటయు కూడ
ఆనందమా గాద! అది జీవితము గదా! ॥సుఖ॥

హెచ్చు తగ్గులతోని వెన్నెలల గురిపించి
అమవసను మాయమై యారిపోవుట మఱియు
పున్నమీ వెన్నెలను స్ఫూర్తితో జరియించు
చందమామయె సాక్షి! అందమా బగతికిని! ॥సుఖ॥

సుఖదుఃఖముల గాంచి నురిగిపోవుట యేల?
రెండు ఒకచేగాద! దండిగా బరికింప!
అన్నిటిని నూథవుడు నలరి నడిపేవాడు!
పయనించు బొమ్మలము బంగారు వ్రాళ్ళతో!

సుఖ దుఃఖలతోని మందరంబగు యాత్ర
మనసు కింపును నింపి మాధుర్య మొలుకూ!

## నల్లని కోకిలకు

నల్లనీ కోకిలకు నాథ! కంఠమునిచ్చి
తీయగా పాడగా దీరుగా నేర్పితివి!

అతి లోక సుందరంబగు స్వరము గూర్చికొని
పాడుచున్నది జగతి భ్రమలు దొలగగనూ!

నల్లనీ కోకిలకు నాథ! కంఠము నిచ్చి
తీయగా బాడగా దీరుగా నేర్పితివి!

పిల్లనాగ్రోవితో మెల్లగా బాడేటి
నీపాట సొంపులను కోకిలకు నిచ్చితివి!
మావి కొమ్మను నిలిపి మధురమౌ వేదికను
పాడుచున్నది జగతి భ్రమర గీలిక వోలె! ॥నల్లనీ॥

ఎన్నెన్నొ రంగులను వేడుకను ధరియించి
వన్నెలను చిన్నెలను వర భూషణములనూ!
ధరియించిననుగూడ దగ కోకిలకు సాటి
రావు; నీ దయగదా! రమ్య వీక్షణమునూ! ॥నల్లనీ॥

నల్లనీ రూపమే నాథ! యా కోకిలది!
దగ నెంచుకుంటివీ! దగనీకు సాటిగా!
అందమగు కంఠమును, నమర గానము నిచ్చి
రూప మదియేల యని రూఢిలరచితివిగద!

నల్లనీ కోకిలకు నాథ! కంఠము నిచ్చి
తీయగా బాడగా దీరుగా నేర్పితివి!

## పరితపించుచు నేను

నిరితపించుతు నేను ఖారమగు గ్రీష్మమున
మసిలిబోవుచు నుండ మాధవా! నిను దలప!

చల్లనీ గాలులను మెల్ల మెల్లగ బంపి
దేహ తాపముదీర స్థిర శాంతి నిచ్చెదవు!

పరితపించుచు నేను ఖారమగు గ్రీష్మమున
మసిలిపోవుచు నుండ మాధవా! నిను దలప!

వేడిగాడ్పుల మధ్య విలపింధు నా మదిని
విసన కర్రలతోని విమల హర్షము గూర్చి!
చందనపు బూతలను దగ హర్షమున ముంచి
ఆనంద వీచికల నలసటను దీర్చేవు! ॥పరి॥

ఉఱుము మెఱువులతోని యుల్లాసమును గూర్చి
వడగండ్లవానతో వలయముగ నను జుట్టి
మఱల నా మనసులో మధురతను నింపేవు!
పూలుపూచిన కడిమి పులకరించిన రీతి! ॥పరి॥

మనసుతో నిను మఱచి మాదుర్యమును వీడి
పొగలలో సెగలలో సొగయు సమయము నందు!
హరివిల్లుతో గూడ అవతరింతువు నింగి
హంస రాజిలుకలను అలరి నిలిపెదు వెదుట!

పరితపించుతు నేను ఖారమగు గ్రీష్మమున
మసిలిపోవుచునుండ మాధవా! నిను దలప!

## కష్టాలు-సౌఖ్యాలు

కష్టాలు సౌఖ్యాలు కలిసి పయనించునూ
విడివడని బంధ మది కదలి యలలకు వోలె!

కావడి కుండలవి కన్నీరు పన్నీరు
కనిపించు వేరుగా వివిపించు నొకటిగా!

కష్టాలు సౌఖ్యాలు కలిసి పయనించునూ
విడివడని బంధ మది కదలి యలలకు వోలె

జీవితము గానడని దీరుగా తెలిపితిని
కన్నీరు పన్నీరు గలిగేటి మార్పులవి!
మోయువా డాతడే మోహనాంగుడు కర్త
హెచ్చుతగ్గులు లేక మచ్చికను నడుపునూ! ॥కష్టాలు॥

ఎత్తుపల్లములమను సత్తువగ జనుచుండ
ఒక కుండ మీదికిని ఒకకుండ క్రిందికిని
యొరుగుచుండును గాద! యొనరి సుఖ కష్టములు
సంప్రాప్తమగుటలో సంతాప పడనేల? ॥కష్టాలు॥

సుఖదుఃఖ భ్రమలతో చూర్ణమగు టేలనో
కావడియు నతనిదే గడగి మోయున దతడె!
మనిషి బ్రదుకంతయును మటి ఋతువులకువోలె
కలిమి లేములయందు కదిలేటి డేఋగద!

కష్టాలు సౌఖ్యాలు కలిసి పయనించునూ!
విడవడని బంధ మది కదలి యలలకు వోలె!

## సుఖ దుఃఖములు రెండు

సుఖదుఃఖములు రెండు సూటిగా లోకమున
వేఱువేఱనుచునూ వేడుకను జూచెదరు!

కలసి పయనించేటి కమనీయ కావ్యమున
ప్రేయసీ ప్రియులనుచు ప్రీతి కనుగొనవలెను!

సుఖదుఃఖములు రెండు సూటిగా లోకమున
వేఱువేఱనుచునూ వేడుకను జూచెదరు!

హర్ష విషాదాలు అలరేటి సమయున
గనులలో నుండియే కదలాడు భాష్పములు!
వేదనాశ్రువులునూ, విమల హర్షాశ్రువులు
ఆ కనులనుండియే అలరి జారును వేగ! ॥సుఖ॥

హర్షశోకములతో అలరేటి జీవితము
మధుర జీవిత మౌను మహనీయ యమృతమును!
శోకమన్నది లేని షోడశాలంకార
మధుర జీవితమె గద! మర్మముగ యోజింప! ॥సుఖ॥

దుఃఖాశ్రువులె గదా! దురితముల హరియింప
అడ్డంకులే గదా! అతిరథుల విజయములు!
రెండింటి నొక్కటని నిండుగా భావించు
పరమాత్మ రూపులుగ భక్తి నే పూజింతు!

సుఖ దుఃఖములు రెండు సూటిగా లోకమున
వేఱు వేఱునుచునూ వేడుకను జూచెదరు!

## ఒక జాతి పూలతో

ఒక జాతి పూలతో నొక రంగు పూలతో
జతగూర్చినది కాదు; సౌరభము వెలయా!

రాలినా పువ్వులను రమ్యముగ గుదిగ్రుచ్చి
భక్తితో తెచ్చితిని పరమాత్మ గ్రహియింపు!

ఒక జాతి పూలతో నొక రంగు పూలతో
జత గూర్చినది కాదు; సౌరభము దెలయా!

క్రయము జేయగలేను! కాసు దగ్గఱ లేదు
వనమాలి వెంటబడి యొడి జాపగాలేను!
రాలినా పువ్వులను రంగు తొలగిన పూలు
రెక్కలూడిన పూలు చక్కనీ దండగా! ఒక॥

పరిమళము లేదు గద! పడియుండి ధరణిపై
వన్నెలన్నియు దరిగి సన్నబడినా పూలు!
గ్రుడ్డి పూవుల నిదిగో! గడ్డిలో దాగినవి
ఏఱి దెచ్చితి నయ్య! నింపొంద ధరణిపై! ॥ఒక॥

భక్తితో దెచ్చితిని పరమ పావన కృష్ణ
చిన్నారి బాలుడను చిఱునగవుతో దెలుపు!
గోప బాలురతోని గూడి చరియించితివి
నన్నాదరింపవా! నా ముద్దు గోపాల!

ఒక జాతి పూలతో నొక రంగు పూలతో
జతగూర్చినది కాదు; సౌరభము వెలయా!

## పాటను నే బాడుచునుంటిని

ఆ పాటను నే బాడుచునుంటిని
అల్లనాడు నే బాడినదీ!
ఆలమందలను మేపుచు కృష్ణా
ఆడుచు యమునా తీరమునా! ॥ఆ పాటను॥

కడిమిచెట్టుపై గూర్చుని నీవును
కమ్మనీ మురళీ స్వనములతో!
పాడుచుండగా పరవశ మైతిమి
పన్నుగ గోపకు లందఱమూ! ॥ఆ పాటను॥

వేడుకతో గూర్చుండి యందఱము
విమల హర్ష వాక్యంబులతో!
చద్ది మూటలను విప్పి భుజింపగ
చక్కని యమునా తీరమునా! ॥ఆ పాటను॥

వెన్నముద్దలను వ్రేళ్ళ సందునను
వేడుకతో ధరియించుచునూ!
ఊరగాయలను వెన్న పూసలను
ఉసురుసురుగ భుజియించితిమీ! ॥ఆ పాటను॥

ఆటలాడిచిమి పాటలు బాడీ
పరవసించితిమి! అలసితిమీ!
సంధ్యా ధూళిని సరసా లాడుచు
సరగున గృహముల కొచ్చితిమీ! ॥ఆ పాటను॥

భక్తి పరవశత పాట బాడినది
నేనే నేనే! గోపాలా!
మఱచి పోయితివి! మధుర స్మృతులను
మఱి నే నొక గోపాలుతమా!

## వివిధ భాషల తోని

వివిధ భాషలతోని వివిధ సంస్కృతులతో
విలసిల్లు దేశమే విఖ్యాతమగు భువిని!

రంగు రంగుల పూల రమణీయమగు మాల
విభుని కంఠము గూర్పు విలసిల్లు శాశ్వతము!

వివిధ భాషలతోని వివిధ సంస్కృతులతో
విలసిల్లు దేశమే విఖ్యాతమగు భువిని!

రంగు రంగుల పూలు రమణీయ ద్వారమున
గుది గ్రుచ్చబడినటుల కూర్మి యొదిగుండవలె!
అన్నదమ్ముల వోలె యలరవలె మోదమున
మాతృభూమిని గొలిచి మదియాన నందవలె! ॥వివిధ॥

వివిధమగు వాసనల వివిధమగు సొగసులను
వన్నెలను జిందవలె వనమయూరికి వోలె
నాట్యమాడగవలెను నవ నవోజ్జ్వలముగా
మాతృమూర్తికి కీర్తి మహియందు నిలుపవలె! ॥వివిధ॥

అందఱము నొకటనే సుందర సుభావమును
మహనీయ సంస్కృతుల మాలగా సమకూర్చి!
పేదరికమని యెడి పెనుచీకటిని బాపి
సౌభాగ్యభారతిని జాగృతిని జేయుదము!

వివిధ భాషలతోని వివిధ సంస్కృతులతో
విలసిల్లు దేశమే విఖ్యాతమగు భువిని!

## సప్తప్రాకారాలు

సప్త ప్రాకారాల సదనములు నాకేల?
చందనాదులతోని సఖ్య మది యేలా?

పన్నీటి జల్లులను బరవశము నాకేల?
విభుని కలయిక గోరు విమల గోపికనూ!

సప్త ప్రాకారాలు సదనములు నాకేల?
చందనాదులతోని సఖ్య మది యేలా?

సప్త స్వరములు బలుకు సాంద్ర వీణియలేల?
నాట్యమయూరికి వోలె రమ్యతలు యెందుకూ?
కిన్నెరను మీటుచును కీర్తనలు బాడుచును
యేటి దరి కుటియందు పాటబాడే నాకు? ॥సప్త॥

భగవంతు డెదటనో బరగ యున్నాడనుచు
కొండలను కోనలను కోనేరులను వెదకి!
అలిసిపోలేమ నే నారాట బడబోను
హృది నున్న జ్యోతిలో మాధవుని దర్శింతు! ॥సప్త॥

నాకు జతగా బాడు నారాగ ధ్వనులతో
మధురాక్షర ధ్వనుల మాధుర్యమును జింద!
వెదుకగా బోనులే విమల స్వరూపునీ
నా ద్వార కుటి యందు నళినాక్షుడుండగా!

సప్తప్రాకారాలు సదనములు నాకేల?
చందనాదుల తోని సఖ్యమది యేలా?

## కలలోని సంగతులు

కలలోని సంగతులు కాంత! నే మఱచితిని
కలవరపు బ్రతుకులో కలత నిద్దురలో!

అద్దమున చందురుడు నగపడిన రీతిగా
విభుని దర్శించితిని విమల భాస్వరముగా!

కలలోని సంగతులు కాంత! నే మఱచితిని
కలవరపు బ్రతుకులో కలత నిద్దురలో!

రత్నకిరీటముల లాంచనంబులు లేవు
పట్టు పీతాంబరము గట్టుకొనలేదు గద!
మురళిచేత ధరించి ముద్దుగా పింఛమున
ఆటలాడేవాడు ఆ గోప బాలకుడు! ॥కల॥

ఆలమందల మేపు నలరు గోపాలుడే
రాసక్రీడలనాడు రమణీయ బాలకుడు
మనసులో నున్నట్టి మాధవుని రూపమే!
నాకు దర్శనమిచ్చె నవనీతుడును కలను! ॥కల॥

ననుజూచి పోవుటకు నా పాట వినుటకై
ద్వారమున నిలుచుండి దర్శించి పోవునట!
ప్రతిరోజు వచ్చునట పరగ మలిసంధ్యలను
గోధూళివలె నతడు కూర్మి కుటి కొచ్చునట!

మనసులో పాడుకొను మధుర గీతము వినుచు
తపియించిపోవునట తన్మయముగా మదిని!
మఱల గోధూళిలో మాయమై పోవునట
మఱచిపోతిని చెలియ! మాధవుడు బలికినది

## పాటతో నింపావు!

పాటతో నింపావు! ప్రకృతి యంతయుగూడ
పాడుఁకొను జగమంత ప్రణవ గీతమునూ!

శోక హర్షములందు చోద్యముగ తనలోనె
పాటబాడుచు నుండు బన్నుగా నణువణువు!

పాటతో నింపావు! ప్రకృతి యంతయుగూడ
పాడుకొను జగమంత ప్రణవగీతమునూ!

సన్నని సెలయేఱు మెల్లగా బాడుకొను
సన్నని వీచికలు ఝల్లుగా శబ్దించు!
ఉభయ సంధ్యలుగూడ ఉసురుసురు మనుచునూ!
వినబడని స్వర్గీయ విమలగీతము బాడు! ॥పాటతో॥

వేలాది చుక్కలును వేడుకను బాడుకొను
చందమామయుగూడ సరసగీతముబాడు
దూరాన వనరేఖ దుర్వార సంగీత
రాగమాలిక బాడు రమణీయ ఛందమున ॥పాటతో॥

పాటబాడని జీవి ప్రకృతియందున లేదు!
తల్లిఒడి నిదురించు చిన్ని పాపయుగూడ
పాటతోనే జీవి బరగ జన్మించునూ!
మృత్యువును జేరుకొను ముదుసలియు గూడనూ!

పాటలో నింపావు! ప్రకృతి యంతయుగూడ
పాడుకొను జగమంత ప్రణవ గీతమునూ!

## రాలినా పత్రముల

రాలినా పత్రముల రమణీయ స్థానమున
క్రొత్త చివురాకులను కూర్మి నిలిపెదవూ!

క్రొత్తపాటల స్థానమున క్రొత్తపాటలను
జివురింపజేసెదవు జిత్తమానందింప!

రాలినా పత్రముల రమణీయ స్థానమున
క్రొత్త చివురాకులను కూర్మి నిలిపెదవూ!

మధుమాసమునుగూడ మాపెదవు గ్రీష్మమున
క్రొత్త యందాలనూ కూర్మి యందించెదవు!
మల్లెలను మాపెదవు మాధవా సరికొత్త
కలువ తామరలనూ కొలకులను నింపేవు! ॥రా॥

పాడేటి కోకిలను పాట మాన్పించేవు
నాట్యమయూరాల నటన ప్రారంభించి!
నీలి మబ్బులతోని నిగనిగలతో గూడ
హరివిల్లు చిత్రించి అందాలు గురిసెదవు! ॥రా॥

ప్రాతవస్తువులనే క్రొత్తగా జూపించి
మురిపింప జేసెదవు ముద్దుగా లోకమును!
నేమోసబోనులే నీ చతుర కర్మలకు
భ్రమరమునకును వోలె బాడుతూ మక్కువను!

రాలినా పత్రముల రమణీయ స్థానమున
క్రొంగ్రొత్త జివురులను గూర్మి నిలిపెదవూ!

## ఏపాట పాడినా

ఏపాట పాడినా ఆపాట తుదియందు!
నీవుండెదవు గదా! నిఖిలాత్మ పరమాత్మ!

గుండెలో నున్నట్టి గూఢచారివి నీవు
దెరవెనుక దాగినా సూత్రధారివి నీవు!

ఏపాట బాడినా ఆపాట తుదియందు
నీవుండెదవు గదా! నిఖిలాత్మ! పరమాత్మ!

విలయమున ప్రళయమున విచ్చుకత్తుల మధ్య
కఠిన యుద్ధములందు గడదేరినా గూడ!
నిను మదిని దలచుకొని నిర్మలంబగు గీతి
బాడుకొను మదియందు భవ్యరాగమునందు ॥ఏపాట॥

జోల అందున బాడు జోజో ముకుంద యను!
ప్రేమ గీతములందు ప్రీతి నిను బాడఁకొను
ఆరాధనలయందు అమరగీతములందు
మనసులో దలపనీ మానవుడు లేడుగద! ॥ఏపాట॥

జీవాత్మ పరమాత్మ భావమున దలపగా
ఒక్కటేయను మాట నిక్కముగ తేలునూ!
ఈతడే యాతడని యాతడే యీతడని
మునులు జెప్పినమాట ముమ్మాటికిని నిజము!

ఏపాట పాడినా ఆపాట మదియందు
నీవుండెదవుగదా! నిఖిలాత్మ! పరమాత్మ!

## విశ్వమంతా నీవు

విశ్వమంతా నీవు నిండియున్నావు గద!
అందాలు జిందుతూ యలరి యున్నావూ!

ఎన్నెన్నొ రూపముల విన్నాణముగ వెలసి
బంధింప జూచెదవు భద్రముగ నిను గలియ!

విశ్వమంతా నీవు నిండియున్నావు గద!
అందాలు జింతుతూ యలరి యున్నావూ!

నీమధుర కాంతియే వెన్నెలను నున్నదీ!
సంధ్య కాంతుల నీదు సరసత్వ మున్నదీ!
చుక్కలలో నీదు సుందరత యున్నదీ!
గగన నీలిమలందు కరుణరస మున్నదీ! ॥విశ్వ॥

జలజలాపారేటి సెలయేటి ధ్వనులలో
ఉయ్యాల పాటలే యూహలను ధ్వనియించు!
పశుపక్షి మృగములును పరవశంబుగ తీపి
పాటలే నీ మురళి పాట యనించునూ! ॥విశ్వ॥

అందాలు నీవు ఆనందాలు నీవు గద!
కొండ కోనల నదుల గూడినా సుందరత!
నీతోని యంశమే నీ చాటు పద్యాలు
నీనుండి వెలువడినా నీ హృదయ స్పందనలు!

విశ్వమంతా నీవు నిండియున్నావు గద!
అందాలు జిందుతూ యలరి యున్నావూ!

## మనసులో దాచుకో!

మనసులో దాచుకో! మాధవుని రూపమును
చిత్తమున దలుచుకో శ్రీహరిని యెపుడూ!

అతని యాజ్ఞల నెపుడు నంతరంగమునందు
మఱువకను వర్తిల్లు మధురాతి మధురముగ!

మనసులో దాచుకో! మాధవుని రూపమును!
చిత్తమున దలఁచుకో! శ్రీహరిని యెపుడూ!

కొండలను కోనలను కోనేరు లందునను
నిలుపుకో స్వామినీ నిర్మలంబగు ప్రేమ!
నీలి గగనమునందు నిలిచినా తారలను
భక్తితో ప్రణమిల్లు ప్రభు దూత లని దలచి! ॥మనసులో॥

రంగు రంగుల పూలు రమణీయ వనభూమి!
గిరులు సెలయేరులును కీర్తించు నతనినే!
కోకిలలు పాడేది కూర్మి గీతము లతని
భ్రమరములు బాడేది ప్రభు గీతములు గదా! ॥మనసులో॥

నదులు సముద్రాల నాదాలు నతనివే!
చేర రమ్మని బిలుచు స్థిరగీత మతనిదే!
విశ్వమంతా గూడ విభుని క్రీడయని
అణు వణువు ప్రతిజీవి యాతడే యని దలవు!

మనసులో దాచుకో! మాధవుని రూపమును
చిత్తమున దలుచుకో! శ్రీహరిని యెపుడూ!

# కష్టాలు సౌఖ్యాలు

కష్టాలు, సౌఖ్యాలు కలిసి పయనించునూ!
ఒకదాని నొదిలి మఱి యొకటుండ లేదుగా!

ఆప్త మిత్రులవోలె ఆలు మగలకు వోలె
జంటగా పయనించు మింటి చుక్కలవోలె

కష్టాలు, సౌఖ్యాలు కలిసి పయనించునూ
ఒకదాని నొదిలి మఱి యొకటుండ లేదుగా!

బొమ్మ బొరుసుల వోలె భోగాలు కష్టాలు
కనిపించు చుండునూ కథవోలె నాణెమున!
క్షణమందు తీయనీ కలలందు దేలించు!
క్షణములో కష్టాల కథలందు నడిపించు ॥కష్టాలు॥

వద్దనిన గూడనూ వరియించు సౌఖ్యాలు!
పూలుపూచిన తోట పులకించినట్లుగా!
కన్నీటి కాలువను కథ నడుపు కష్టాలు
మావటిగ అంకుశము మఱల మఱలను బొడుచు; ॥కష్టాలు॥

ఉదయ సాయంసంధ్య సదయునీ క్రీడలని
మబ్బులో బొమ్మలుగ మది నిలుప చెదురునని!
చిత్రకారుని వోలె చిత్తరువులను వ్రాయు
పరమేశు లీలలని బరగ కనుగొన వలెను!

కష్టాలు సౌఖ్యాలు కలిసి పయనించునూ
ఒకదాని నొదిలి మఱి యొకటుండ లేదుగా!

## ఎన్నిరంగుల పూలు

ఎన్ని రంగులపూలు యిలకొలని నుండగా
నల్లనీ కలువలే నాకు ప్రియమగునూ!

భక్తు లెందఱు బాడు ప్రణవ గీతములున్న
భ్రమర గీతమె నాకు బాడుటకు ప్రియమగును!

ఎన్ని రంగుల పూలు యిలకొలని నుండగా
నల్లనీ కలువలే నాకు ప్రియ మగునూ!

రాజహంసలు, రామ చిలుకలును గోరింక
పక్షు లెన్నున్ననూ బహుమానమును సేయ!
నల్లనీ కోకిలే నాకు ప్రియమగును సఖీ!
ఉల్లమును రంజింపు పల్లవింపగ జగతి! ॥ఎన్ని॥

బంగారుకాంతులను బరిఢవించిన పగలు
దిక్కులన్నియు గూడ తేజమును నింపినా
నల్లనీ రాత్రియే నాకు ప్రియ మగును సఖీ!
వేల తారలతోని విమల దర్శన మిచ్చు! ॥ఎన్ని॥

ఎందఱో దేవతలు చందురునితో గూడ
వరము లిచ్చెదమనుచు వర్తించినను గూడ!
నల్లనీ కృష్ణుడే నాకు ప్రియమగును సఖీ!
మురళి నూదే వాడు! ముద్దు గోపాలుడే!

ఎన్ని రంగుల పూలు నిలకొలని యుండగా
నల్లనీ కలువలే నాకు ప్రియమగునూ!

## పరితపించుట యేల?

పరితపించుట యేల? పరిశ్రమించుట యేల?
విభుని దర్శింపగా వేదనల కన్నీరు?
మనసులో నున్నట్టి మాధవుని దర్శింప
కొండ లెక్కుట యేల? కోనేరు లేలా?
పరితపించుట యేల? పరిశ్రమించుట యేల?
విధుని దర్శింపగా వేదనల కన్నీరు?

అతనిలో నేనుంటి! అతడు నాలో నుండె
హృదియందు నతడుండు నిండు చందురు వోలె!
పూవులో తావిలా పులకరించుచు నుంటి
మబ్బులో వానలా మధురముగ నేనుంటి! ॥పరిత॥

అతడంటె నా హృదిని అలరి యుండును ప్రేమ
నేనంటె యతనికిని నిండయిన వలపులూ!
పాడుచుండును నెపుడు భవ్యమగు మురళినీ
వినుచుండు నెల్లపుడు వీనులకు విందుగా! ॥పరిత॥

అంతరంగమునందు అలరి యుండును సఖీ!
మనసునను మెదలునూ మధుర గీతికవోలె!
మఱచి యుండగ లేను మాధవుని ఒక క్షణము
నిలిచి మాధవుడుండు నీడలా నా వెనుక!

పరితపించుట యేల? పరిశ్రమణ మది యేల?
విభుని దర్శింపగా వేదనల కన్నీరు?

## కనులతో నాతనిని

కనులతో నాతనిని కనుగొనగ పనిలేదు!
హృదయమున జూడవలె మది పులకరింపా!

చెవులతో పనిలేదు చిత్తమున వినవలెను
మధుర శ్రీ మురళినీ మమతతో నెపుడూ!

కనులతో నాతనిని కనుగొనగ పనిలేదు
హృదయమున జూడవలె మది పులకరింపా!

హృదయమున శోధింపు సదయ కార్యములన్ని
నిండార కనిపించు దండిగా చిత్తమున!
హృదయమే సాక్షిగద! యుల్లమే నిజము గద!
ఆత్మీయతను గూడి యలరు సద్భావనము ॥కనులతో॥

హృదయమే కనుగొనును ఉదధిలో రత్నాలు
ఆకాశమున నున్న యలరు చుక్కలు గూడ
శ్రీహరినీ కనుగొనును చిత్తమున శాంతితో
హృదయ పరిశోధనయె యూహలకు నిజరూపు! ॥కనులతో॥

వినునదీ కనునదీ విన్నవించినదంత
హృదయమున ముద్దుగా కదులుచుండును నెపుడు!
కాంతి రమ్యాక్షర సుపంక్తిగా గనబడును
కనినదీ వినినదీ గానముగ వినిపించు!

కనులతో నాతనిని కనుగొనగ పనిలేదు!
హృదయమున జూడవలె మది పులకరింపగా!

## కోరికలు నాకేమి

కోరికలు నా కేమి కోరగా లేవుగద!
విభుదర్శనము దప్ప వేఱు కాంక్షలునూ!

బాలగోపాలునీ భక్తితో కిన్నెరను
మధుకరమువలె బాడ మనసులో కాంక్షా!

కోరికలు నాకేమి కోరగాలేవు గద!
విభుదర్శనము దప్ప వేఱు కాంక్షలునూ!

పూలపై వ్రాలుచును బులకరించుచు భక్తి
తీయనీ పాటలను దేనె లొలుకుచునూ!
మధుర సందేశమును మహనీయ గీతమున
వినిపించుటే నాకు విమల కర్తవ్యమూ! ॥కోరికలు॥

పువ్వొడుల రాల్చుచూ పురుషోత్తముని భక్తి
పుడమియంతట బఱచి పూల రేఖలనూ!
మకరందములతో మధుర తేనియలతో
స్వాగతం బివ్వగా సరసగీతము తోని ॥కోరికలు॥

ఎందుకో యీనాడు చందురుడు గూడనూ
వెన్నెలా పువ్వులను వేడుకను రాల్చుతూ!
ప్రభువు రాకను దెలిపి బన్నుగా మమతతో
మాధుర్య గీతమును మానుగా బాడునటు!

కోరికలు నాకేమి కోరగా లేవుగద!
విభుదర్శనము దప్ప వేఱు కాంక్షలునూ!

## అందాల చిత్రాలు

అందాల చిత్రాలు నలరి యుంచవు భువిని
సుందరత భూతలిని జింపగా జేసెదవు!

అపురూప శిల్పాల యలరి జెక్కినగూడ
ఒకచోట జూపెదవు నొకచిన్న లోపమును!

అందాల చిత్రాలు అలరి యుంచపు భువిని
సుందరత భూతలిని జిందగా జేసేవు!

అందాల ఋతువులా చందాలు కనుగొన్న
లోపమొకటుండును లోలతలు వికసింప!
పూలెన్ని యున్నను పూదోట యందునా
పరిపూర్ణతను గనము బరగ కుసుమములందు! ॥అందాలు॥

చందురునిలో గూడ చారు సుందరమందు
మచ్చ యొకటుండునూ మర్మముగ బ్రకింప!
విత్తు పల్లములతో విలసిల్లు ధరణియు
ఉప్పునీటను నుండు నొప్పుగా సంద్రమును! ॥అందాలు॥

తప్పు లెక్కల నిచ్చి యొప్పు జేయగ గోరు
బడిపంతులుకు వోలె బరగ యిటు జేసితివి!
నీ ప్రజ్ఞ ధీమసము, నిర్మాణ చాతురత
నీవంది యిచ్చుచో నిఖిలమును దక్షతను
తప్పు లెక్కలనన్ని యొప్పుగా జేయుదుము!

అందాల చిత్రాలు నలరి యుంపవు భువిని
సుందరత భూతలిని జిందగా జేసెదవు!

## పాడనీ! ఒక పాట

పాడనీ! ఒక పాట! పరవశంబుగ నన్ను!
అలరి ముత్తెపుదండ అందాలు జిందినటు!

కొమ్మపై కూర్చుండి కోకిలా బాడినటు
తూలుతూ బాడనీ! తుమ్మెదగ పూవుపై!

పాడనీ! ఒకపాట! పరవశంబుగ నన్ను!
అలరి ముత్తెపు దండ అందాలు జిందినటు!

మాధవా! నీరూపు మది ముద్ర వేసినది!
నీమురళి నాదమే నాహృదిని మ్రోగునది!
విడివడని బంధమిది! వేల జన్మలకైన!
అపురూప స్నేహ మిది! ఆనంద రాగమిది! ॥పాడనీ॥

నిను జూడకుండినా నీరూపు మదిమెసలు
నీమురళి నాదమే నిరతమును వినిపించు!
ఆలమందల మేపు నల గోపబాలునిగ
కనిపించు నెల్లపుడు గదులు పింఛముతోని! ॥పాడనీ॥

నాపాట వినుటయే నీకు సంబరమేమొ!
క్రొత్తపాటలు బాడ గోరుచుందువు నెపుడు!
పాటయే నావృత్తి పరమాత్మ నీవెపుడు
పాట వినుచుందువని పరులు దెలుపగ వింటి!

పాడనీ! ఒకపాట పరవశంబుగ నన్ను
అలరు ముత్తెపు దండ అందాలు జిందినటు!

## నీకు నాకున్నట్టి

నీకు నాకున్నట్టి నిర్మలంబగు ప్రేమ
ఎవరికిని తెలియదూ ఏకాంత స్పందనము!

ఆకుచాటునపూవు అలరి వికసించునది
మబ్బు చాటున తార మసలునటు వంటిదీ!

నీకు నాకున్నట్టి నిర్మలంబగు ప్రేమ
ఎవరికిని తెలియదూ! ఏకాంత స్పందనము!

కాలువగ బారినా కన్నీటికే దెలియు!
కాలువను బూచినా కలువభామకు దెలియు!
చందమామకు దెలియు అందాల తారలకు
అలలలో దోలుకాడు నల చేడిసలకునూ! ॥నీకు॥

పాడినా పాటలను బలుకాడు చిలుకలకు
మావికొమ్మను నున్న మధురమౌ కోకిలకు
అభినయమ్మును జేయు అల రాజహంసకును
తూలుతూ బాడేటి తుమ్మెదకు దెలియునూ! ॥నీకు॥

గుండెలోనున్నట్టి కూర్మి విరహ జ్వాల
అగ్నిజ్వాలకు వోలె నలరారుచుండెపుడు!
మెఱుపులా మెఱయుచును మిలమిలల త్రాచులా
ఎవరితో దెలుపనూ! యేకాంతమగు ప్రేమ!

నీకు నాకున్నట్టి నిర్మలంబగు ప్రేమ
ఎవరికిని దెలియదూ! యేకాంత స్పందనము!

## కమ్మని హృదయమని

కమ్మనీ హృదయమని కావ్యాలు వ్రాసెదరు
కరుణామయుడ వనుచు కథలు దెలిపెదరూ!

హృదయేశ్వరా! నిన్ను మదియందు దర్శింప
కఠినహృదయుడ వనుచు గనుగొందు భావమున!

కమ్మనీ హృదయమని కావ్యాలు వ్రాసెదరు
కరుణామయుడవనుచు కథలు దెలిపెదరూ!

హృదయ మిచ్చిన పతిని వేఱుగా జేసెదవు
కారడవులను వదులు కమనీయ కాంతనూ!
జంట పావురములను పెంటినీ గొట్టినటు
సతిపతుల వేఱుగా దరలించెదవు నెటకో!

పాలు ద్రావెడి శిశువు బరగ మరణించునూ
ఏకైక పుత్రుడట వైరాగియై జనుట!
జగతి దుఃఖముబాప జలధివలె నెల్లపుడు
అలలుగా హృదయమును నార్ద్రిగా నిలిపెదవు!

పూనికను ఎందఱో పుణ్యపురుషులు జగతి
హృదయ వేదనతోని సదయ లోకుల కొఱకు!
ప్రాణములు అర్పించు ప్రగతిశీలురు గలరు
నీ నాటకములోని నిశితమౌ భూమికలు!

కమ్మనీ హృదయమని కావ్యాలు వ్రాసెదరు
కరుణా మయుడ వనుచు కథలు దెలిపెదరూ!

## మధుర కవితను బాడు

మధుర కవితను బాడు మహనీయ వ్యక్తియును
పుడమిపై కొన్నాళ్ళు పులకరించుచు నుండు!

చిరకాలముంపవూ చిత్రముగ అపుడవుడె
త్రుంపి వేయుదువుగద! సంపంగి ద్రెంపినటు!

మధుర కవితను బాడు మహనీయ వ్యక్తియును
పుడమిపై కొన్నాళ్ళు పులకరించుచు నుండు!

ఉత్తములు, మధ్యములు నుర్విలో గల జనులు
పాడుకొందురు గదా భవ్యమగు కవితలను!
మఱికొంత కాలమటు మనిషి జీవింపగా
మఱికొన్ని కవితలను మధురముగ సృజియించు ॥మధుర॥

శిల్పులను సృజియించి శిఖరముల నిలుపుదువు!
రమణీయ శిల్పముల రాతిలో జెక్కగా!
శిల్పఖండములనూ చిత్రముగ జూచుచును
అసువులను బాయుగద! అమరపురికేగు గద! ॥మధుర॥

మధురగాత్రమునిచ్చి మధురముగ కొందఱిని
పాడగా జేసితివి భవ్యభువి వేదికను!
తెరవేసెదవువాని తీరైన గాత్రమున
మని బూసెదవు గదా! మఱల గనబడకుండ!

నీవు తెలిపిన పనులె నీటుగా జేయవలె
అరనిముస ముంపవూ! అటుపైని భూమికను
చందమామను మచ్చ అందముగ నున్నటుల
అతనిలో గూడనూ అలరు కాటుక మచ్చ!

మధుర కవితనుబాడు మహనీయ వ్యక్తియును
పుడమిపై కొన్నాళ్ళు పులకరించుచు నుండు!

## సప్త వర్ణములతో

సప్త వర్ణములతో చనుదెంచి హరివిల్లు
మాయమై పోవునూ మబ్బులను మసకగా!

కనుల జూచుచునుండ కమ్మనీ సంధ్యలును
కనిపింపకను బోవు కడలిలో లీనమై!

సప్త వర్ణములతో చనుదెంచి హరివిల్లు
మాయమైపోవునూ మబ్బులను మసకగా! ॥సప్త॥

వాసంత కోకిలయు వన్నెలా రాగమును
మావికొమ్మలయందు మధురముగ బాడుచును!
ఎటుబోవునో యేమొ! యేకొండ కోనలను
మఱల గనబడదుగద! మధురరాగముతోని! ॥సప్త॥

శారదా రాత్రులను జనుదెంచి కొలనులను
కలువ పద్మములునూ కమనీయ గంధమున
హేమంతమున గదిలి యెటుబోవునో యేమొ!
మంచులో మంచుగా మారిపోవునో యేమొ!

తెరయెత్తి తెరదించి దివ్యమౌ దృశ్యముల
కనిపింప జేసెదవు కాంక్షతో జీవులకు!
మధురమౌ భావాల మహనీయ సీమలకు
మమ్ముగొని పోవుదువు! మాధవా! చిత్రముగ!

సప్త వర్ణములతో జనుదెంచి హరివిల్లు
మాయమైపోవునూ మబ్బులను మసకగా!

## సుఖ దుఃఖములు

సుఖ దుఃఖములు రెండు చోద్యముగ జతజేసి
మాలగా గుది[గుచ్చి మనసు రంజించేవు!

శాంతి యుద్ధములునూ [భాంతి కాదనుచునూ
నాటకము నడిపెదవు! నవ్యత్వమును విరియు

సుఖ దుఃఖములు రెండు చోద్యముగ జతజేసి
మాలగా గుది[గుచ్చి మనసు రంజించేవు!

బద్ధవైరము మాపి బంధుత్వమును గూర్చి
వికట శ[తుత్వమును వేదనల తొలగించి!
మధురమగు స్నేహమును మరల గూర్చెదవుగద!
మావిపై కోకిలను మరల పాడించేవు! ॥సుఖ॥

అన్నదమ్ములమధ్య యంతరంబుల గూర్చి
తెరలు వేసెదవుగద! దీరుగా చి[తముగ
సంఘర్షణలతోని సతమతం బగుచుండ
దివ్యకావ్యము వెలయు నవ్య[ప్రకరణములను! ॥సుఖ॥

కలిసియుండిన జనులు కలహముల మునుగుచును
నాది నీదనుచునూ భేద భావములతో
రక్తమును ధరణిపై రణమునను జిందించి
ఒకతల్లి బిడ్డలకు వైరమేలా యిటుల?

రాజులే నాయకులు రమ్య యుద్ధములందు
విధ్వంసమే వారి వికటమగు వర్తనము!
వసుధ ఒక్కటిగాద! వసర జనులందఱును
ఒకతల్లి బిడ్డలే వలదు యీ యుద్ధములు!

సుఖదుఃములు రెండు చోద్యముగ జతజేసి
మాలగా గుది[గుచ్చి మనసు రంజించేవు!

## నీ విశ్వవేదికను

నీవిశ్వ వేదికను నీ నాట్యపరిధితో
ఒక చిన్న పాత్రనూ ఒప్పుగా నిమ్మా!

బరువు బాధ్యతలనే బరగ గైకొనలేను
కీలకంబగు పాత్ర లీల దయ జేయుమా!

నీ విశ్వవేదికను నీ నాట్య పరిధిలో
ఒక చిన్న పాత్రనూ ఒప్పుగా నిమ్మా!

నాయకీ నాయకుల రమ్యపాత్రలను నే
ధరియింపగా బోను ధాత్రి నను కీర్తింప!
స్వర్గీయ భావముల స్వర్ణ మార్గము లందు
పయనింప లేనుగద భారతీ మార్గమున ॥నీ విశ్వ॥

క్రొంగ్రొత్త భావముల కూర్మి ప్రజ లందఱికి
వినిపింపగాలేను వేడుకను వేదికను!
అభినయింపగ లేను అఖిల ప్రజలందఱిని
ఒక త్రాటిపై నడుప యెప్పుగా నేతనై ॥నీ విశ్వ॥

మంచికై పోరాడు మహనీయ వీరులకు
బాసటగ నుండేటి పాత్ర యిమ్మా నాకు!
పేరు లేకుండగా ప్రఖ్యాతి లేకుండ
మాతృదేశము కొఱకు మరణించు భూమికను!

నీ విశ్వ వేదికను నీనాట్య పరిధిలో
ఒక చిన్న పాత్రనూ ఒప్పుగా నిమ్మా!

## ఎందఱో రచయుతలు

ఎందఱో రచయితలు నిను కవిత వర్ణించి
అందాల కవితలను అలరి ప్రజ కిచ్చిరీ!

రచయితలు లేకున్న రచన లున్నవి నేడు
పొడుకొనుచున్నారు ప్రతి భాషలో గూడ

ఎందఱో రచయితలు నిను కవిత వర్ణించి
అందాల చందాల అలరి ప్రజ కిచ్చిరీ!

సృష్టిలో అందాలు సృజయించితివి స్వామి
నాట్య వేదికయందు రమణీయ కాంతులను!
చిగురులను పూవులను చిన్నారి కోకిలను
కలువలను పద్మముల కమనీయ భ్రమరముల! ॥ఎందఱో॥

ఆటులనే కవులనూ అందాలు చిందగా
గీతాలు వ్రాయించి కీర్తి గావించితివి!
చిరకాలమును వినుచు కీర్తించెదరు జనులు
మహనీయ భావములు మనసునందున వెలగ! ॥ఎందఱో॥

కవితతే గద నీదు కమనీయమగు సృష్టి
కవులెగద! శాశ్వతము కాలగర్భమునందు!
నీతోవి పయనించు నిఖిల బ్రాహ్మములన్ని
కవులు రచయితలునూ కమనీయ కవితలును!

ఎందఱో రచయితలు నిను కవిత వర్ణించి
అందాల పెన్నిధిని యలరి ప్రజకిచ్చిరీ!

## రమ్య వేదికయందు

రమ్యవేదికయందు రమణీయ గానమున
రక్తి నిమ బాడుదురు ప్రజలు నాసక్తి!

శ్రుతిలయలతోగూడి సుందరంబగు రీతి
తరియింప జేయుమా తామసుని గూడనూ!

రమ్య వేదికయందు రమణీయ గానమున
భక్తి నిను బాడుదురు ప్రజలు నాసక్తి!

పాటలను గూర్చితిని బరగ నాటకమందు
భక్తి రక్తి ముక్తి బరగ బొందగనూ!
పసిపాప మొదలుకొని బరగ ముదుసలిగూడ
పాటలకు దాసులై పల్లకీ మోయుదురు! ॥రమ్య॥

మహనీయు లెందరో మధురనాట్య సువేది
పాటతో నందిరీ పరమపదమును గూడ!
సమ్మోహనాశక్తి గలదు పాటలయందు
పాటయందున నిలుచు పరమేశ్వరుడు గూడ! ॥రమ్య॥

కుటిల సంగీతమును గూర్మితో బాడేటి
వంచనాత్మకులనూ వమ్మలను దరిగించి!
భక్తితో బాడేటి పరమ సుందర గీతి
రక్తితో గ్రహియించు రామగోపాలుడూ!

రమ్యవేదిక యందు రమణీయ గానమున
భక్తి నిను బాడుదురు ప్రజలు నాసక్తి!

## రాళ్ళు బాడును గదా!

రాళ్ళు బాడునుగదా! రమణీయ గీతాలు!
ఉలి స్పర్శ దగులగా నూహ కందని విధము

మధుర భావములెన్నొ మనసునను కదధాడి
శిల్పముగ నిలుచుగద! శిల్పి కన్నులకూ!

ఉలి స్పర్శ దగులగా నూహ కందని విధము
రాళ్ళు బాడును గదా! రమ్యగీతాలూ!

నీ నాట్య వేదికను నిలుచు బలు దృశ్యాలు!
ఆశ్చర్యమును గొలుపు అందాల సొగసులును!
నల్లరాళ్ళనుగూడ నవనీతముగ మార్చి
శిల్పి జెక్కునుగదా! చిత్రాలు శిలలలో! ॥ఉలి॥

అలస్వర్గమున నున్న యప్సరస నిలుచునూ!
రాజభవనమునున్న రమణీయ కన్యయును!
ధర్మమును బోధించు ధర శాంతి బుద్ధుడును
శిల్పి ఉలితో వెలయు చిత్రాలు శిలలలో! ॥ఉలి॥

శిల్పాలను సృజియించి చిత్రాలు వెలయించి
కొండలను, గుహలనూ కూర్మి విజనములందు!
స్వార్థమన్నది లేక స్వర్గధామము జేయ
శ్రమియింప జేసెదపు శాంతి యన్నది లేక!

ఉలిస్పర్శ దగులగా నూహ కందని విధము
రాళ్ళు బాడునుగదా రమ్య గీతాలూ!

# రంగు రంగుల

రంగురంగుల నిచ్చి రమణీయ కుంచెయును
చిత్రకారునీ కిచ్చి శిరులు నింపితివీ;

ఒకవైపు కాగితము ఒనర చిత్రింపగా
వ్రాయుటను నేర్పితివి వైభవంబుగ నీవు

రంగురంగుల నిచ్చి రమణీయ కుంచెయును
చిత్రకారుని కిచ్చి శిలలు నింపితివీ!

పశు పక్షి మృగములను బన్నుగా సెలయేళ్ల
చిలుక గోరింకలను చిన్నారి తుమ్మెదల
ప్రకృతి వైభవమంత చిత్రింప నేర్పితివి!
కుంచెతో జగమంత అంచలుగ రూపింప!

కనులతో జూచినది కమ్మనీ దృశ్యముల
మతికింపు గలుగగా మర్మముగ నిలుపగా!
మతియందు కనుగొనిన మధుర దృశ్యములనూ
కుందెతో జూపించు సంచరింఫగ మనసు!

మబ్బులను చంద్రునీ మహనీయ లోకముల
రంగులను జూపించు రమణీయ చిత్రముల
జీవకళతోగూడ దివి యచ్చరను జూపు!
గోపికను జూపింపు గోవిందు జూపించు

రంగు రంగుల నిచ్చి రమణీయ కుంచెయును
చిత్రకారుని కిచ్చి సిరులు నింపితివీ!

## హరి యెచట గలడనుచు

హరి యెథట గలడనుచు అడుగబోకుము చెలియ!
నీలోన నాలోన నిఖిలమున గలడూ!

జ్యోతిస్వరూపమున ప్రీతి భావములోనె
అణువణువు నందునను అలరియున్నా డతడు!

హరియెచట గలడదుచు అడుగబోకుము చెలియ!
నీలోన నాలోన నిఖిలమున గలడూ!

వేదనను సందకుము! వెత జెందబోకుమా!
మబ్బులను వెదుకకుము! మధురమగు జలములను!
అంతటా వెలనేటి యా సూర్యబింబమును
దీపమును వెలిగించి దీప్తి జూడకుమా!

వానంత ఋతువులో వన్నెలా జివురులను
వెదుకుటకు యత్నించి వెత జెందబోకుమా!
పుష్పవాటికలోని పువ్వులను వెదుకుచును
మనసులో జింతలను మఱి జిందబోకుమా!

మనసులో నున్నట్టి మాధవుని జ్యోతినీ
కనుగొనక యెచటనో కనుగొందు వని వెదకి!
అలసిపోబోకుమా! ఆరాట పడబోకు!
దివ్య దీపము వెలుగ దివిటీ లవెందులకు?

హరి యెచట గలడనుచు అడుగబోకుము చెలియ!
నీలోన నాలోన నిఖిలమున గలడూ!

# ఎంతటి వాడైన

ఎంతటి వాడైన ఎంత నేర్పరియైన
కొంత కాలము జగతి కూర్మితో యుండూ!

మబ్బు చెదిరిన యటుల మధుర జీవనమునూ
చెదిరిపోవును యెటకో చేరుకొను మాయగా!

ఎంతటివాడైన ఎంత నేర్పరియైన
కొంతకాలము జగతి కూర్మితో నుండునూ!

పసిపాపగా తల్లి యొడియందు విలసిల్లి
ముద్దుమాటలతోని మోదమును గలిగించు!
ఆట పాటలతోని అందాలు వెలయించు
వివిధ విద్యల నన్ని వేడుకను నేర్చుకొను! ॥ఎంతటి॥

యువక రక్తముతోని యుల్లాస గరిమతో
ధైర్యసాహసములను దరిజేర్చుకొని ధరణి!
దరిజేరి ప్రియురాలి దాంపత్య జీవితము
వెలయించు మోదముగ వివిధ కర్మల గూడ! ॥ఎంతటి॥

ప్రారబ్ధ కర్మలను బరిపూర్తి చేసికొని
ముదుసలిగ మారునూ మోదమును విడనాడు!
ఎన్నెన్నొ దుఃఖముల నన్నిహితుడై యతడు
కాల గర్భమునందు కలిసిపోవును గదా!

ఎంతటివాడైన యెంత నేర్పరియైన
కొంతకాలము జగతి కూర్మితో యుండూ!

## అంతఃపురము వదిలి

అంతఃపురము వదిలి యల రాజమార్గమున
బోవు సిద్ధార్థునకు బొలుపుగా గనిపించె!

ముసలి వాడొక్కడును మూల్గుచును బాటపై
పడియున్న వానినీ పరగ ప్రశ్నించెనూ

అంతఃపురము వదిలి యలరాజమార్గమున
బోవు సిద్ధార్థునకు బొలుపుగా కనిపించె!

ఎవరు నీవని యడిగె యెవరు నీ బంధువులు
ఎచట నున్నా రనుచు వేడుకను ప్రశ్నించె!
ఇల్లు వాకిలి యెచట? యిల్లాలు యెట గలదు?
అనుచు సిద్ధార్థుడూ యలరి ప్రశ్నింపగా
ముదుసలిటులను బలికె మోదమింతయు లేక! ॥అం॥

దిక్కు మొక్కూ లేని దీనుడను ముదుసలిని
బంధువులు స్నేహితులు బరగ నను విడిచిరీ!
ఇల్లు వాకిలి లేదు: ఇల్లాలు గతియించె
ఎందఱో ముదుసలుల చందమిది లోకమున! ॥అం॥

నీ సృజనమిది ప్రభూ! నిఖిలాత్మ లోకమున
ఆదుకొనువారునూ, ఆత్మీయులును లేని!
బాటపై పొరలాడు ప్రాణులటు దయతోని
ఆదుకొనవాడవూ ఆత్మీయతను గూడి!

అంతఃపురము వదిలి యలరాజ మార్గమున
బోవు సిద్ధార్థునకు బొలుపుగా గనిపించె!

## ఒక్క ప్రపంచమును

ఒక్క ప్రపంచమును నొనర సృజియించితివి
జనులంద ఱొక్కటని చాటి జెప్పితివీ!

ప్రాణులను సమభావమున జూడ మనుచునూ
పరగ శాసించితివి ప్రభు శాసనం బనీ!

ఒక్క ప్రపంచమును నొనర సృజియించితివి
జనులంద ఱొక్కటని చాటి జెప్పితివీ!

ఒక్క ప్రపంచమును ముక్కలుగ జేసిరీ
ఖండ ఖండములుగా చండశాసనులంత!
దేశ దేశాలుగా విభజించి రయ్యయ్యో!
మనుషులను జాతులుగ మఱల విభజించిరి! ॥ఒక్క॥

ఒక మహాజ్యోతివై యొప్పారు చుండు నిను
వేలాది నామముల వేడుకను బెట్టిరీ!
మతము కొక దైవమును మాదుర్యమును వీడి
నిలుచుండ బెట్టిరీ నీవు తల వంపగా! ॥ఒక్క॥

ఒక ప్రపంచమునకు వచ్చెనిటు అగచాట్లు
ఒక్క దైవమునకును జిక్కు లిటు ప్రాప్తించె!
శిలలె దేవతలాయె సిద్ధాంతులందఱును
గతి తప్పె లోకాన కాంతి హీనంబుగా!

ఒక్క ప్రపంచమును నొనర సృజయించితివి
జనులంద ఱొక్కటని చాటి జెప్పితివీ!

## కలిసి పాడిన పాట

కలిసి పాడిన పాట కమ్మనీ రాగాన
చెదిరిపోయెను గదా! చిత్రముగ జగతీ!

శ్రుతిలయలు దప్పినవి చోద్యముగ పాటలో
వేఱు వేఱుగ బోయె యేకాంతమును వీడి!

కలిసి పాడిన పాట కమ్మనీ రాగాన
చెదిరిపోయెను గదా చిత్రముగ జగతీ!

ఒకతల్లి బిడ్డలుగ యెనర సోదరుగా
కలిసి యుంటి మటంచు గలమాట మఱచిరీ!
కఱకు కత్తులతోని గండ్రగొడ్డళులతో
కదనమున నిలిచిరీ కనుల కావరముతో! ॥కలిసి॥

అతనిలో మనమంత అన్నదమ్ములమనీ
మాటనూ మఱచిరీ మనసులో గూడనూ!
చెడు మాటలను వినుచు చెడ్డత్రోవలంట్టి
ప్రభుమాట మఱచిరీ విభు నిర్ణయము గూడ! ॥కలిసి॥

ఒక ప్రపంచమునందు నొనర జన్మించియును
ఒక తల్లిబిడ్డలుగ యొనర మది భావించి!
కలిసి పయనింతమూ! కడు దూర యాత్ర యిది
విభుని సన్నిధి జేర విమల సద్భావమున!

కలిసి పాడిన పాట కమ్మనీ రాగాన
చెదిరిపోయెను గదా! చిత్రముగ జగతీ!

# ఆంగ్లేయ దాస్యమును

ఆంగ్లేయ దాస్యమును అంతమొందింపగా
స్వాతంత్ర్య భారతిని స్వర్గధామముగాగ!

నిలుపగా ఆనాడు ప్రతిన బూనితిమి గద!
ఏవి యా ప్రతినలూ? ఏవియా ప్రజ్ఞలూ?

ఆంగ్లేయ దాస్యమును అంతమొందింపగా
స్వాతంత్ర్య భారతిని స్వర్గధామము గాగ!

యువకిశోరంబులును నుక్కు పిడుగులు గూడ
స్వాతంత్ర్య సమరమున సాధ్వీమణులు గూడ
పరదేశ ప్రభులతో బన్నుగా బోరాడి
నేలకొరిగిరి గదా! వేలకొలదియు యువత? ॥ఆం॥

కన్నీళు లొలికిరీ కమ్మనీ జీవితము
మాతృదేశము కొఱకు మంటలను దుమికిరీ!
అంతమొందింపగా ఆంగ్లేయ దాస్యమును
ఉడుకు రక్తము నొలికి యురి కంబ మెక్కరీ! ॥ఆం॥

ఒక్కటిగ యున్న యా చక్కనీ దేశమును
రెండు ముక్కలు నాయె నిండైన భారతియు!
అన్నదమ్ముల మధ్య యున్న సుస్నేహమును
విషతుల్యముగ జేసి వెడలి రాంగ్లేయులును! ॥ఆం॥

స్వాతంత్ర్య మెచ్చినది! చవిచూచ చుంటిమీ!
స్వాతంత్ర్య మెచ్చటది? పహజీవనం బెచట?
ఆశయాలన్నియును నడియాశలైనవీ!
దారిద్ర్యదేవతయు తాంతవించుచునుండె
దెరచాటుగా పరులు బాలించుదుండిరీ! ॥ఆంగ్లేయ॥

## నీ దేశ మేది యని

నీ దేశ మేది యని నిఖిల జనులును నడుగ
భవ్యభారత మనుచు బలుకవలె భక్తి!

నీ వెవరవని యడుగ నిండు భావముతోని
భారతీయుడ నంచు బలుకగా వలయునూ!

నీదేశ మేదియని నిఖిల జనులును నడుగ
భవ్య భారతమనుచు బలుకవలె భక్తి!

ఎన్నో జాతులు గలవు! ఎన్నో భాషలు గలవు
ఏభాష యేదియని నిలిపి ప్రశ్నింపగా!
ఎన్నిభాషలునున్న ఎన్నిజాతులు నున్న
భారతీభాషయని బరగ దెలుపగవలయు! ॥నీదేశ॥

నీదేవు డెవరనుచు నిండినా మనసుతో
జనులు బ్రశ్నింపగా జాగృతిని జెందీ!
ఒక్కడే దైవమని యొనర నిశ్చయముతో
అన్ని రూపములనూ అర్చనల జేయుదును! ॥నీదేశ॥

భారతీయుడ నేను భవ్యసంస్కృతి నాది
వేదాంతములయందు వివరించి నట్టిదియు!
నాది భారతిభాష నాల్గు దిక్కుల బలుకు
విశ్వాత్మయే నాకు విమలదైవము సుమీ!

అఖిల ప్రపంచంబు అన్నదమ్ములు నాకు
మతము ఒకటే నాకు మహనీయ మానవత!
అందరిలోనున్న ఆత్మీయ జ్యోతియే
పరమేశ్వరుండనుదు భక్తితో పూజింతు!

## మనసులో నుంటావు

మనసుతో నుంటావు! మధురమగు మురళితో
కనుల కగపడకుండ కమనీయ రూపమున!

విస్తారమగు దయను విమల చిఱునగవుతో
దర్శనం బిచ్చెదవు! దాక్షిణ్యమును జింది!

మనసులో నుంటావు! మధురమగు మురళితో
కనుల కగనడకుండ కమనీయ రూపమున'

వేల గోపికలందు నేనొక్క గోపికను
ఆడిపాడిన నాటి యతివనూ గోపాలా!
వేఱుబడితిని నిన్ను వీడి యీవిధముగా
వేడుచుంటినిగదా! విని రావదేలనో! ॥మనసులో॥

నీవు లేకుండ నే నిలువనని తెలియదా?
నన్ను శిక్షించుటే నవ్వులాటగ నీవు!
భాసించుచుంటివీ పన్నుగా నన్నిటుల
వేధించు చుంటినీ వికృద పరిహాసమున ॥మనసులో॥

ఆదుకొనువాడవని యండ నీవని దలచి
మనసు దెలిసిన మధుర మాననీయుడ వనుచు
తలపోయుచుంటినీ తరగనీ వేదనను
అడియాస జేయకుము! ఆశ లన్నియు కృష్ణ!

మనసులో మంటావు మధురమగు మురళితో
కనుల కగపడకుండ కమనీయ రూపమున!

## నీకు నాకున్నట్టి

నీకు నాకున్నట్టి నిరవధికమగు ప్రేమ
అందఱికి తెలియునూ అడ్డు తెర లేలా?

చందమామకు దెలియు సాంద్ర తారల కెఱుక
చిన్ని మబ్బుల కెఱుక సన్నగాలులకునూ!

నీకు నాకున్నట్టి నిరవధికమగు ప్రేమ
అందఱికి దెలియనూ అడ్డుతెర లేలా?

మావికొమ్మనుబాడు మధుర కోకిలకునూ
చిలుక గోరింకలకు జిఱు పాలపిట్టలకు
అందాల కోనేటి ఆలకలువ భామలకు
దొలిసంధ్య మలిసంధ్య తూర్పుకొండలకునూ!

జలజలా పాఱేటి సెలయేటి యొడ్డులకు
కలువ తామరలకును కదిలేటి తరగలకు!
కడిమి తరువులనున్న కమనీయ శాఖలకు
మకరందమును ద్రావు మధుపములకును దెలియు!

నీవు కాదన్ననూ నీ మధుర మురళియును
మాట దప్పదు సుమా! మఱిమాట లిక యేల?
ఏనాటిదో గదా! యీ ప్రేమ! యీవలపు!
స్మృతియందు భావింపు! నూఱిగా యలనాటి!

నీకు నా కున్నట్టి నిరవధికమగు ప్రేమ
అందఱికి దెలియునూ! యిడ్డు తెర లేలా?

## పంపినా రా జిలుక

పంపినా రాజిలుక బరగ బోయెనా లేదా!
రమ్యమగు నాలేఖ రమణునకు నిచ్చెనో!
దారిలో జిక్కెనో దప్పికను డస్సెనో!
అందాల తోటలను నటు జూచి యాగెనో!
పంపినా రాజిలుక బరగ బోయెనా లేదా!
రమ్యమగు నాలేఖ రమణునకు విచ్చెనో!

కన్నీటి కాటుకను కమనీయ నా వినతి
వ్రాసి పంపితిగదా! వగలాడి చిలుకచే!
విన్నపము వినిపించి వేదనను నెఱిగించి
తిరిగి రమ్మని వేగ దీవించి పంపితిని!

మబ్బులను సీదుచును మైదానముల దాటి
కొండలడవుల దాటి కోనేరులను దాటి!
విభుడున్న చోటునకు వెడలి నా వినతినీ
విన్నవించెనా! లేదా! కన్నీటి నా కథను?

మొర నాలకింపమని మోమైన జూపమని
చిరకాల కాంక్షనూ దీర్పగా రమ్మనుచు!
మనవి జేసెనా లేదా మన్నించునో లేదా!
చిలుకమాటలను విని చిఱునవ్వు నవ్వెనో!

పంపినా రాజిలుక బరగ బోయెనా లేదా?
రమ్యమగు నాలేఖ రమణునకు నిచ్చెనో!

## సెలయేటి నాదాలు

సెలయేటి నాదాలు! చిఱుగాలి సవ్వడులు
కోకిలల పాటలే! కూర్మి నాపాటా

క్రొత్తగా పాటలను గూర్చిపాడుటలేదు
ప్రకృతిని శ్రుతి లయల పాడేటిపాటా!

సెలయేటి నాదాలు! చిఱుగాలిసవ్వడులు
కోకిలల పాటలే! కూర్మి నాపాటా!

శిలలలో శిల్పాలు చెక్కినా నేర్పరులు
మట్టిబొమ్మలు జేయు మహనీయ కార్మికులు!
కుంచెతో బొమ్మలను గూర్చేటి శ్రామికులు
పాడినా పాటలే పాడుచుంటిని నేను! ॥సెలయేటి॥

వేదాంత విద్యతో విమల సాంగత్యమున
మవసులో వికసించు మధుర భావాలనూ!
గుండెలో కదలాడి గొంతులో విలసిల్లు
గాయకులు పాడేటి కమనీయ పాటలను!
పాడినా పాటలే పాడుచుంటిని నేను ॥సెలయేటి॥

అందెలా రవళులును అల తాళ వాద్యములు
కిన్నెరలు బాడినా గీతికలతో కూడి
తెరవెనుక దేవతలు దీర్చినా పాటలే
బాడుచుంటిని నేను బరగ ముక్తిని నంద!

సెలయేటి నాదాలు చిఱుగాలి సవ్వడులు
కోకిలల పాటలే కూర్మి నా పాటా!

## తొలి సంధ్య వికసించె

తొలి సంధ్య వికసించె! తోరంపు భక్తితో
పాడుకొనుచున్నదీ పరమేశ్వరుని దలచి!

అందాల కాంతులను నంతటను జిందుతూ
తూర్పు కొండలపైని తూలి కుంకుమ కాంతి!

తొలిసంధ్య వికసించె! తోరంపు భక్తితో
పాడుకొనుచున్నదీ పరమేశ్వరుని దలచి!

జాగృతిని కల్పించి జగతినీ మేల్కొలిపి
అణువణువు విశ్వమున అందాలు సమకూర్చి!
చైతన్య ప్రభవోలె జనుల కన్నుల నిలిచి
ఆనంద గీతికను నలరి పాడుచు నుండె! ॥తొలి సంధ్య॥

గతియించె రాత్రియని కాఱు చీకటి దాటి
వెలుగునకు వచ్చితిమి! విమల కాంతుల ననుచు!
అరుణారుణ ప్రభల నల సూర్యదేవునకు
ఉదయ స్వాగతగీతి నొనర బాడుచు నుండె! ॥తొలి సంధ్య॥

పద్మముల వికసింప బరగ చివురులు పూలు
విమల శిశువుల వోలె వికసించి నవ్వగా!
ఆకాశమంతయును నందాలు జిందగా
గాంధర్వ గీతికను కమ్మగా బాడినది!

తొలి సంధ్య వికసించె తోరంపు భక్తితో
పాడుకొను చున్నదీ పరమేశ్వరుని దలచి!

## పాట నిచ్చితివి గద!

పాట నిచ్చితివి గద పరమేశ్వరా నీవు
పశుపక్షులకు గూడ బాడుకొనుటకునూ!

విజ్ఞాన వంతుడగు విమల మానవుడునూ
ఆ పాటతో గదా! అందుకొను ముక్తి!

పాట నిచ్చితివి గద! పరమేశ్వరా నీవు
పశుపక్షులకు గూడ బాడుకొనుటకునూ!

పిల్లనా గ్రోవితో ప్రియమార గోవులును
ఆనంద భావమున నటుదేలుచుండునూ!
కోకిలా పాటలకు కూర్మి వనమంతయును
గాన మాధుర్యమున గలగలా మనుచుండు!

సెలయేఱు బాడుకొను గలగలా యలలతో!
పూపొదల బాడుకొను బులకించు తుమ్మెదలు
పాము పడుచులుగూడ పడగలను విప్పుకొని
వన మయూరంబులును వర్తించు నర్తించు!

పాటతోనే గదా! బరగ ముక్తివి బొందె
ఆ మహాజ్యోతిలో అలరి విరిసిరి మునులు!
పాటరానీ వాని పశువండ్రు లోకమున
పాట నేర్వగ వలెను ప్రతివాడు జగమందు!

పాట నిచ్చితిని గద! పరమేశ్వరా నీవు
పశువక్షులకు గూడ బాడుకొనుటకునూ!

## తొలి వాన చినుకులకు

తొలి వాన చినుకులకు టోరంపు పూమొక్క
భూమాత గర్భమును బొలుపుగా దొలచీ!

పైకొచ్చి గగనమును బరగ ప్రకృతినంత
కనుల గాంచుచు నుండె కమనీయ వేడుకను!

తొలివాన చినుకులను తోరంపు పూమొక్క
భూమాత గర్భమును బొలుపుగా దొలచీ!

ఆకాశమున నున్న అందమౌ తారలను,
చందమామను గాంచి తగ వెన్నెలను జూచి!
పయనించు పక్షులను బరగ మబ్బుల గాంచి
ఆశ్చర్యమున మునిగె! ఆనంద ధామమున!

హరివిల్లు గాంచుచును అందాల రంగులను
నీ సృజన మనుచు మరి నీ రాజనం బిచ్చె
పక్షి సముదాయమును పరికించి భ్రమరముల
తనదు స్నేహితు లనుచు దగ మురియుచుండె గద!

ఓ ప్రభూ! నను గూడ యొనర పూమొక్కవలె
తారలకు పైనున్న తగ నిన్ను గాంచనీ!
దివ్యనేత్రములతో దిక్కులను బరికించి
అర్పింపనీ తపసు ఆత్మీయ చింతనను!

తొలి వాన చినుకులకు తోరంపు పూమొక్క
భూమాత గర్భమును భొలుపుగా దొలచీ!

## నా చివరి పాటలో

నా చివరి పాటలో నా చివరి గీతికను
అర్పింపనీ నాదు ఆత్మీయ వేదనా!

నీకు నాకున్నట్టి నిశ్చలంబగు ప్రేమ
మనసార ఒకసారి మనసులో దలపనీ!

నా చివరి పాటతో నా చివరి గీతికను
అర్పింపనీ నాదు ఆత్మీయ వేదనను!

చరియించు దారిలో జగతి జీవులు బొందు
కడలేని దుఃఖమును కడలేని వేదనను!
మనసులో పొంగేటి మధురమగు భక్తినీ!
చివరి పాటల నింపి జేర్చి నను పాడనీ! ॥నా॥

పుట్టినప్పటి నుండి పుడమిలో పొందినా
కష్టాలు నష్టాలు కరుణా విహీనమౌ!
అవమానముల నన్ని అలరి తలదాల్చినా
పరితాపముల నన్ని పన్నుగా నింపనీ! ॥నా॥

సెలయేటి జాలులా జలజలా ప్రవహించు
కన్నీటి భాష్పాలు కమ్మనీ వలపునూ!
చివరి పాటను వ్రాసి చిత్తమున కోరికను
నీ పాదముల యందు విలిచి యర్పింపనీ!

నా చివరి పాటలో నా చివరి గీతిలో
అర్పింపనీ నాదు ఆత్మీయ వేదనను!

## ఆలమందల మేపు

ఆలమందల మేపు ఆ గోపబాలుడే
కనిపించు నా కెపుడు కనుల ముందఱనూ!

విడివడడు నను చెలీ! విమల దర్శనమునను
కనిపించు చుండునూ కలగాదు నిజముగా!

ఆలమందల యేపు ఆ గోప బాలుడే
కనిపించు నాకెపుడు కనుల ముందఱనూ!

ఒంటిగా బోనీడు జంటగా వత్తునని
మారాము జేయునూ మనసు నొప్పగ నాదు!
చేసేటి పనులలో మాటాడు మాటలో
తానుందునని బలుకు దగువాడ కాను గద! ॥ఆల॥

పిలువకుండగ తాను బలికి మాటాడునూ!
తలపకుండగ మదిని తానుగా హృదినుండి!
కన్నీరు ఎందుకని కలత జెందును తాను
తానుండగా భయము దగ యెందుకని బలుకు! ॥ఆల॥

ఎన్నాళ్ళు యీ విధిని చిన్ని గోపాలుతో
తగువెటుల జేతునే తగునె యీ విధి చెలియ?
గాఢమగు యీ ప్రేమ కథ నడుచు టెన్నాళ్ళో?
నే మఱచిపోయినా నను మఱచిపో దతడు!

ఆలమందల మేపు ఆ గోపబాలుడే
కనిపించు నాకెపుడు కనులముందఱనూ!

## అన్ని రూపములందు

అన్ని రూపములందు అన్ని తావుల యందు
అతడుండునే చెలీ! అందాల కృష్ణుడూ!

విశ్వమున యణువణువు
విమలమగు ప్రతిజీవి

ఆతడే గద చెలియ! అలరి యుండును గదా!
అన్ని రూపములందు అన్ని తావులయందు
అతడుండునే చెలీ! అందాల కృష్ణుడూ!

ఏ రూపమున యతని విమలాత్మలో దలప
ఆ రూపమున తాను యరి దర్శనమిచ్చు!
ఏతావు అందునను నెన్నగా నచ్చోట
మహనీయ రూపమున మానుగా కనిపించు! ॥అన్ని॥

ధరణిలో నణువణువు దగ యాతడే సుమా!
గగన తారలయందు కలిసియుండును నతడు
పశు పక్షు లంచునను బన్నుగా యతడేను
కదిలేటి యలలలో కలిసి యతడే యుండు! ॥అన్ని॥

ఆతడు లేనీ చోటు అలరి లేదు గదమ్మ!
ఏచోటు వెదికినను ఆచోటు గలడతడు!
కనులు మూసినగూడ కనులలో నతడుండి
మధురరూపము జూపు మానసము నింపొంద!

అన్ని రూపము లందు అన్ని తావుల యందు
అత డుండునే చెలీ! అందాల కృష్ణుడూ!

# ఎన్ని ప్రార్థనలనూ

ఎన్ని ప్రార్థనలనూ యెన్ని విజ్ఞాపనల
ఎన్ని ప్రయత్నములు నెంత జేసిననూ!

ప్రత్యక్ష ఫలముగా బరగ నిను గనలేక
కుందుచుంటిని స్వామి! చిందుచూ వేదనల!

ఎన్ని ప్రార్థనలనూ యెన్ని విజ్ఞాపనల
ఎన్ని ప్రయత్నములు నెంత జేసిననూ!

అంతరంగమునందు నలరి నిన్నెల్లపుడు
ఆర్ద్రభావముతోని అలరి జూచుచునుంటి!
నీ మురళి స్వనములను నిశి పగళు లనకుండ
వినుచుంటి మాధవా! వీనులకు విందుగా!

అందుకొను చుంటిని అన్ని వేళల యందు
అదృశ్యమైన నీ అందాల దీవెనల!
అపురూపమైన నీ యదృశ్య పరిచర్య
అందుకొను చుంటిని చందముగ పరమాత్మ!

ప్రారబ్ధకర్మ మది పరగ యడ్డుగ నిలిచె
తెరవోలె మనమధ్య తీరుగా నిలిచినది!
భయపడకు మాధవా బాధపడబోనుగా
చవదీయ కరుణ నను బంధముక్తుని జేయు
అందాక నిను భక్తి అలరి గొలిచెద గాక!

ఎన్ని ప్రార్థనలమా యెన్ని విజ్ఞాపసల
ఎన్ని ప్రయత్నములు నెంతగా జేసినా!

## దారిబ త్తెము నిచ్చి!

దారిబ త్తెము నిచ్చి దగ బంపు గోపాల!
నీవు జెప్పిన దంత నిండు కార్యములా!

పరిపూర్తి జేసితిని బన్నుగా నిసుమంత
మిగులకను జేసితిని! వగ యింత లేకుండ!

దారి బత్తెము నిచ్చి దగ బంపు గోపాల
నీవు జెప్పిన దంత నిండు కార్యములా!

కృష్ణ భక్తిని గూడి కూర్మి లలితమలైన
పాటలను బాడితిని బన్నుగా శ్రుతిలయల!
సెలయేటి జాలుగా గలగలా ధ్వనులతో
పాడుకొనుచున్నదీ బరగ కిన్నెరకు వలె! ॥దారి॥

నీవు మురళిని బాడ నే గీతి బాడితిని
ప్రకృతి యందాలన్ని బదిలముగ జత గూర్చి!
నెమలి వలె నృత్యమును నిండుగా జేసితిని
హంసవలె అభినయము అలర జేసితి గదా! ॥దారి॥

రామ కథనంతయును రమణీయముగ వ్రాసి
భద్రాద్రిలో నీకు బహుమతిగ నిచ్చితిని!
చదువరులు మదియందు దగ నిన్ను బాడుచును
ఆనంద జలధిలో నటుదేలు చుండిరీ! ॥దారి॥

నీ యాన లన్నియును నిరతముగ బాలించి
జవదాట కుండగను చరియించితిని స్వామి!
పని పూర్తియైనదీ బరగ నీవిచ్చినది
నిలిచి యుండగలేన నీడవలె వసుధలో! ॥దారి॥

## ఎందుకో యీనాడు

ఎందుకో యీనాడు వెన్నెలలు పూవులై
కురియుచున్నవి గదా! కూర్మి వన వీధిలో!

ఆకాశమున హంస అభినయమ్ములతోని
మధుర స్వాగత గీతి మఱి బాడుచున్నదీ!

ఎందుకో యీనాడు వెన్నెలలు పూవులై
కురియుచున్నవి గదా! కూర్మి వన వీధిలో!

పూదీవె లన్నియును బులకించుచును పూలు
ధర పైన నొలుకుచును దగ రంగవల్లులను!
అందాల స్వాగతము నలరి నీకిచ్చుచును
పులకించు చున్నవీ వున్నమీ రాత్రివలె! ॥ఎందుకో॥

సెలయేఱు గలగలా చెన్నుమీరగ పాట
పాడుకొనుచున్నదీ బరగ కిన్నెరకు వలె!
నీ దారి జూచుచును నిలిచి యున్నది స్వామి
నీ పాద ధూళినీ నిజ శిరసు ధరియింప! ॥ఎందుకో॥

ప్రకృతిని అణువణువు బరిపూర్ణతను బొందె
ప్రణవ గీతిక మదిని పాడుకొను చున్నదీ!
నా కిన్నెరయు గూడ నవగీతి బాడుచును
భగవంతు రాకకును బరగ బాడుచు నుండె!

ఎందుకో యీనాడు వెన్నెలలు పూవులై
కురియుచున్నవి గదా! కూర్మి వనవీధిలో!

## నీకు పూజ లొనర్చి

నీకు పూజ లొనర్చి నిను దలచి పిలుచుచును
అలసిపోతిని స్వామి! ఆశ్చర్య మిది గాదు!

వున్నమీ వెన్నెలల పూజలను నిక జేయ
సెలయేటి జాలులను కలల దర్శింపనూ!

నీకు పూజ లొనర్చి నిను దలచి పిలుచుచును
అలసిపోతిని స్వామి! ఆశ్చర్య మిదిగాదు!

కిన్నెరను మీటుచును కీర్తనల బాడుచును
కొండ కోనల యందు కూర్మి నిను బిలుచుచును!
వీధి వీధుల యందు వాడ వాడల యందు
నిను బిలువగా లేను! నిలిచి పలుకగ లేను! ॥నీకు॥

కంటి కగు పింపవూ కనులార వీక్షింప
మధురముగ భాషించి మాటాడ రావుగా!
అస్పష్టముగ నుండి ఆయాస పెట్టెదవు
మనకలో నుండి నను మభ్యపెట్టెద వెపుడు! ॥నీకు॥

జపములను తపములను జాలింతు నిక మీద
మనసులో ధ్యానింతు మాధవా! యిక నిన్ను!
స్తోత్రముల కీర్తనల సూటిగా నొదిలెదను!
మౌనమే యిక నాకు మధురమగు నీ స్మరణ!

నీకు పూజ లొనర్చి నినుతలచి బిలుచుచును
అలసిపోతిని స్వామి! ఆశ్చర్య మిదిగాదు!

## కుటినుండి వెడలనూ

కుటినుండి వెడలనూ కూర్మి నిను వెదుకగా
వన వీధులను దిరిగి వరుస నిను బిలువనూ!

నీవు రావలెను సుమ! నిర్మలంబగు ప్రేమ
వనవీధి వెదుకుచును వలనొప్ప నా కుటికి!

కుటినుండి వెడలనూ గూర్మి నిను వెదుకగా!
వనవీధులను దిరిగి వరుస నిను బిలువగా!

చందమామను జూచి యందమగు తారలను
పిలిచి వేదనలనూ ప్రేమతో వినిపింప!
కలువ తామరలనూ కన్నీళులను నొలికి
వేదనను వినిపించి వ్యధను జెందను స్వామి! ॥కుటి॥

మౌనముగ నా కుటిని మధుప ధ్యానముతోని
నిను దలచు చుందునూ నిర్మలంబగు నాత్మ!
కోనలో నున్నట్టి కూర్మి పశుపక్షులకు
విందులను జేయుదును విమల ఫల పుష్పముల! ॥కుటి॥

కోర్కెలన్నవి లేవు కూర్మి నా మనసులో
నిను గూర్చి భావనలు నేర్పుగా మదిలేవు!
ఆకాశ పక్షివలె యలరి పయనించెదను!
గమ్యమన్నది లేని గగన తారకు మల్లె!

కుటినుండి వెడలనూ కూర్మి నిను వెదుకగా
వనవీధులను దిరిగి వరుస నిను బిలువనూ!

## జంట యెవ్వరు లేరు

జంట యెవ్వరులేదు! ఒంటరిగ పడవలో
పయనించు చుంటినీ బరగ నీకై కృష్ణ!

తీరమును జేరుదును దీరుగా పయనించి
గాఢమగు నమ్మకము గలదు నా మనసులో!

జంట యెవ్వరు లేరు! ఒంటరిగ పడవలో
పయనించుచుంటినీ బరగ నీకై కృష్ణ!

అలలు జెలరేగుచును నాకాశ మంటినా
పెనుగాలులకు దరులు ప్రివిలిపోయిన గాని!
సుడులతో ముడులతో ప్రుక్కిపోయినగాని
పడవ దరి జేరునూ! పరమాత్మ నీ దయను! ॥జంట॥

చుక్కాని లేదుగద! సూటిగా బోవుటకు
తెరచాపలేదు గద తీరమును జేరుటకు!
పడవ నడిపేవాడు బరగ కనిపింపడూ!
గగనమున తారలును కనిపించుటను లేదు! ॥జంట॥

అయినగూడను నాకు నతి నమ్మకము గలదు
పడవ తీరము జేరు బరగ నిను జేరుదును!
కన్నీటితో నీదు వన్నెలా పాదముల!
అభిషేకమును జేతు నలరుదును భక్తితో!

జంట యెవ్వరులేరు! ఒంటరిగ పడవలో
పయనించు చుంటినీ! బరగ నీకై కృష్ణ!

# దూర దూరమునుండి

దూర దూరమునుండి దుఃఖమును గలిగించి
వ్యధ గలుగ జేతువని వేదనల నుందూ!

భ్రమ జెందుదును గాని భద్రముగ నాతోని
కలిసియుందు వటంచు తెలియగా లేను గద!

దూర దూరముండి (దుఃఖమును) గలిగించి
వ్యధ గలుగజేయవని వేదనలనుండూ!

పూలు దారముతోని పొలుపుగా నున్నటుల
దూడతో ధేనువును బులకించినట్లుగా!
తల్లిఒడిలో పాప చల్లగా నున్నటుల
నీదాపు నున్నటుల నే కలియలేదుగద!

పాట పాడే టపుడు పదము పాడేటపుడు
నీ భక్తితో నేను నిశ్చలం బగునపుడు!
నాదు కిన్నెరనుండి నాదాలు జేసేను!
నీ మురళి శ్రుతికలిపి నిండుగా బాడేవు!

నా పూజ సమయమున నాయందు నీవుండి
నా మనసుభావనను నయముగా నుండేవు!
దూరముగ నీవుండి తోరముగ నను మఱచి
ఎట నుంటివో యనుచు కటువుగా బలికితిని!

దూర దూరమునుండి దుఃఖమును గలిగించి
వ్యధ గలుగ జేతువని వేదనల నుందూ!

## కుటినుండి వెలుపలికి

కుటినుండి వెలుపలికి కూర్మితో నేరాగ
నాదుచెలు లందఱును నయముగా జుట్టీ!

మధురమగు పాటలను మాధుర్యమును జింద
గాన మాధుర్యమున కవిత లొలికేనూ!

కుటినుండి వెలుపలికి కూర్మితో నేరాగ
నాదు చెలులందఱును నయముగా జుట్టీ!

కొమ్మపై కోకిలా కొసరి పాటలు బాడి
వాసంత ఋతువుపై వన్నెలను నొలికించి!
చిగురుపూవులు దెచ్చి చిత్రముగ వొడినింపి
కుశల ప్రశ్నలువేసి కూర్మితో నడిగేరు! ॥కుటి॥

పూలపై తుమ్మెదలు బొలుపుగా వడివడిని
మరకందమును దెచ్చి మానుగా దోసిలిని!
ఒంపి చిఱు ప్రశ్నలను వయ్యారముగ నడిగి
ననుజుట్టి ముట్టునూ నాదాలు జేయుచును! ॥కుటి॥

సెలయేటి యలలలో చెలరేగు నాదాలు
కదిలేటి శిలలలో కమ్మనీ ధ్వనులునూ!
చూలుతో నున్నట్టి సుదతి యాలేడియును
కుశల ప్రశ్నల నడిగి కూర్మి నాపై జూపు!

కుటినుండి వెలుపలికి కూర్మితో నేరాగ
నాదు చెలులందఱును నయముగా జుట్టీ!

## ౧ కనులు నిరతమును

నీ కనులు నిరతమును నా కనుల లోనికిని
కనుగొనుచు నుండుమా కమ్మనీ ప్రేమా!

నా హృదయ మెల్లపుడు నీ పాదముల గాంచు
నీరాజనం బిచ్చు నిండైన మనసుతో!

నీ కనులు నిరతమును నా కనుల లోనికిని
కనుగొనుచు నుండునూ కమ్మనీ ప్రేమా!

నీ మురళి నాదములు నిరతమును వినిపించు
దూరముగ వినిపించు దోరముగ కోకిలా!
పాటలా వినిపించు పరమాత్మ! కలలలో
కనిపించి నటులుండు కమ్మనీ స్మృతులవలె! ॥నీ కనులు॥

సెలయేటి జాలులో అలలతో నే గలిసి
పయనించి నటులుండు బన్నుగా నీవునూ!
పిల్లనా గ్రోవితో పిలిచినటు లుండునూ
ఏటి దరిపైనుండి పాడిసటు లుండునూ! ॥నీ కనులు॥

నీవు లేకున్ననూ నిండైన భక్తితో
నిలిచినటు పూజింతు నీ రాజనమునిచ్చి!
కడిమి పూలను దెచ్చి కంఠమాలగ వేసి
పూజింతు నిను భక్తి పులకించి ప్రేమతో!

నీ కనులు నిరతమును నా కనులలోనికిని
కనుగొనుచు నుండునూ కమ్మనీ ప్రేమా!

## కొండలును కోనలును

కొండలును కోనలును కూర్మియడవుల నన్ని
ఎండవానలయందు నెచ్చోట దిరిగినా!

పసిపాప తల్లితో బరగయుండిన యట్లు
నీవెంట నే నుందు నిరతమును భక్తితో!

కొండలును కోనలును కూర్మియడవులు నన్ని
ఎండ వానలయందు నెచ్చోట దిరిగినా!

అలసటను జెందనూ! ఆరాటపడబోను
ఎచటికని ప్రశ్నించి యిచట నుందు నటంచు!
ఎంతదూరం బనుచు వింత ప్రశ్నలు వేసి
కలవరము గలిగించి కలత జెందింపనూ! ॥కొండలను॥

చిటికెనా వ్రేలినీ చెన్నుగా బట్టుకొని
అడుగడుగు నీ వెనుక అడుగులను వేయుదును!
వింజామరను బట్టి విసురుచూ నుందునూ!
నీవు నా సర్వమని మదిని దలచెదనూ? ॥కొండలను॥

నీవె నా గతిపతివి నిండయిన బ్రతుకులో!
ధ్రువతారగానుండు! దూది పింజను నేను!
కల్యాణ జ్యోతినీ కాంతి కిరణము నేను!
ఆనందమును గూర్చి ఆహ్లాదమును గూర్తు!

కొండలును కోనలును కూర్మి యడవులనన్ని!
ఎండ వాలనయందు నెచ్చోట దిరిగినా!

## వెన్నెలా రాత్రంత

వెన్నెలా రాత్రంత కిన్నెరను మీటుతూ
నా కుటీ ద్వారమున నయముగా నిలిచీ

నీరాక కొఱకునై నిలిచి యుంటిని స్వామి!
రావుగద గోపాల రాత్రి గడుచుచునుండె!

వెన్నెలా రాత్రంత కిన్నెరను మీటుచును,
నా కుటీ ద్వారమున నయముగా నిలిచీ!

మొరనాలకింతువని మోదమున యిటు వచ్చి
నా మధుర గీతికను నయముగా విందువని!
ఆశించితిగాని యాశ నిరాశలై
వేగు చుక్కయు వచ్చె వెస నీవు రావు గద! ॥వెన్నెలా॥

తొలి సంజ కుంకుమలు తోరముగ తూర్పుదెస
వికసించినవి గాని విమలమగు పూదోట!
పూలు వికసించినవి పొలుపుగా తెలవారె!
నీజాడ లేదుగద! నిలువునా నీరైతి! ॥వెన్నెలా॥

దుఃఖాశ్రువులతోని తోరముగ నాకుటిని
ద్వారబంధము నేను దగ దడుపు చుంటినీ!
నా హృదయ స్పందనల అలయేటి గలగలలు
శ్రుతిగలువుచున్నవీ చోద్యముగ గోపాల!

మురళి చేతనుబట్టి ముద్దుగా బిల్వమున
పడవపై పయనించి బరగ బోవుచు నుండె!
ఆతడే నీవనుచు అంతరాత్మయు గూడ
పలుకుచూ నున్నదీ పద్మనాభా! నిజము!

## కొండంత వేదనను

కొండంత వేదనను కూర్మితో నా మనసు
రోదసీ ధ్వనులతో రోధించు చున్నదీ!

నిను విడిచి ఒక క్షణము నిలువ నే గోపాల!
నను విడిచి నీ వెటుల ననువుగా నుంటివీ!

కొండంత వేదనను కూర్మితో నా మనసు
రోదసీధ్వనులతో రోదించు చున్నదీ!

నా మనసు గీతికకు నవ స్పందనల నిచ్చి
నా హృదయ రాగములు నటన సలుపుచునుండె
నా కిన్నెరయుగూడ నవ నిస్వనములతో
సంగీతమును సలిపె సరస మార్గముతోని! ॥కొండంత॥

కుటి ప్రక్క దొరలేటి కూర్మి సెలయేఱునూ
అందాల భావాలు నందజేయుచు నుండె!
నీటిలో పక్షులును నిర్మలంబగు శ్రుతులు
కలకలా ధ్వనులతో కలిసి పాడుచు నుండె ॥కొండంత॥

నాకు వినబడదు గద! నా మనసు పాడేటి
కన్నీటితో తొలుకు కమ్మనీ యా పాట!
కుటిద్వారమున నిలిచి కూర్మి యా గీతికను
ఆనందమున వినుచు నలరారు చుంటివీ!

కొండంత వేదనను కూర్మితో నా మనసు
రోదసీ ధ్వనులతో రోదించుచున్నదీ!



# ఆత్మ చింతన

## లలిత గీతాలు

## (శ్రీ రమణమహర్షి ఉపదేశించిన 108సూక్తులకు ఆధారంగా)

### అహము తొలగించుకొను

అహము తొలగించుకొను ఆత్మేశ్వరా! యనుచు
అహరహము స్మరియించు నా విశ్వవిభునీ!

మదినున్న దోషములు మాయమై పోవునూ
పాలరాతికివోలె ప్రభవించు నీమనసు!

అహము తొలగించుకొను ఆత్మేశ్వరా! యనుచు
అహరహము స్మరియించు నా విశ్వవిభునీ!

నీవె నా గతి యనుచు నిర్మలంబగు మదిని
అలగజేంద్రునివోలె నాహరిని స్మరియింప!
తా నడిచి వచ్చునూ! తనదు పరివారమును
రక్షించు నిను ప్రభువు రమ్యవీక్షణమునను! ॥అహము॥

అల ద్రౌపదీదేవి యాత్మార్పణము పిదప
మానసంరక్షణము మహనీయముగ వలువ!
యిచ్చి కాపాడెనూ! మచ్చికను సభయందు!
పూర్ణశరణాగతియె పొలుపుగా హరికృపకు! ॥అహము॥

నిరతమును స్మరియింపు నిర్వికారుని హరిని
అహము నిర్మూలించి యందుకొను పరమాత్మ!
అహము నడ్డంకి గద! యది నీలి తెరగదా!
హరిప్రసాదముచేత యాతెరను తొలగింపు!

అహము తొలగించుకొను ఆత్మేశ్వరా! యనుచు
అహరహము స్మరియింపు నా విశ్వవిభునీ!

జప తపము లవి యేల?

జపతపము లవి యేల? జాహ్నవీ స్నానములు?
వైరాగ్య మది యేల? వనర ఉపవాసములు?

అహము తొలగించుకో! అంతరంగిక భక్తి
మనసు శాసించుకో! మౌన ధారణతోని!

జపతపములవి యేల? జాహ్నవీ స్నానములు?
వైరాగ్యమది యేల? వనర ఉపవాసములు?

అఖిల విశ్వమునందు అణువు తానని దలచి
ఆ యణువు గూడనూ అఖిలమున భాగమని!
ఆమహా జ్యోతిలో అంతరంగము నిలుప
వ్యథ జెందగా వలయు! సుధ నింపగా వలయు! ॥జప॥

కామ క్రోధములనూ గర్వమును కడద్రోసి
వెన్నెలను పువ్వువలె వికసింపవలె దోట!
మనసులో నున్నట్టి మధురాత్మ కిరణమును
ఆమహా జ్యోతితో నలరింపగా వలయు! ॥జప॥

అహము దొలగింపవలె అంతరాత్మను గూడి
నిశ్చలత భావమున నిను నీవు తెలుసుకో!
విశ్వ మంతయుగూడ విమల కిరణములనుచు
భేదభావములేక ఛేదింపు అహమునూ!

జపతపము లవి యేల? జాహ్నవీ స్నానములు
వైరాగ్య మదియేల? వనర ఉపవాసములు?

## అది యటుల జేయవలె

అది యటుల జేయవలె! ఇది యిటుల జేయుదును!
అని జనులు మదియందు అహముతో గూడి!

పథకములు వేయుదును భ్రమ జెందెదరుగాని
భగవంతు పథకమే బరగ జరుగుచు నుండు!

అది యటుల జేయవలె! ఇదియిటుల జేయుదును!
అని జనులు మదియందు అహముతో గూడి!

వేయి స్తంభములతో విమలమగు భవనమును
అంతరిక్షమునందు నలరి నిర్మింతమని!
గొంతెమల కోరికలు సంతలో బేరములు
వింతగా మదియందు విపులముగ జేయుదురు!

మానవుని కోరికలు మదియందు భావములు
బొమ్మరిండ్లకు వోలె కమ్మనీ కథవోలె!
ధాత్రిలో జరుగవూ! దగ విశ్వపతి దలుచు
పథకములు మాత్రమే బరగ జరుగుచు నుండు!

పథకములు మాని యా పరమాత్మ కే సకల
కర్మముల నొదులుటే దగ నుత్తమము సుమా!
అహము దొలగిన మనసు తహతహలు లేకుండ
శివరూపమున పనులు జేయవలె విశ్వమున!

అది యటుల జేయవలె! యిది యిటుల జేయుదును!
అని జనులు మదియందు అహముతో గూడి

## ఏది మేలో నీకు?

ఏదిమేలో నీకు ఏది కీడో నీకు?
ఆ విశ్వపతికినీ యంతయును దెలియూ!

ఏ సమయమున నీకు నెద్ది యవసరముండు
ఆ సమయమున నదియు నందించు చుండునూ!

ఏదిమేలో నీకు నేది కీడో నీకు?
ఆ విశ్వపతికినీ అంతయును దెలియూ!

చివురులును పూవులును శ్రీవసంతము నందు
గ్రీష్మమున నందించు క్రీడగా ఫలములను!
వర్షఋతువూ నందు వర్షించు మేఘములు
హేమంతమున బండు విపులమగు బీజములు! ॥ఏది॥

అంతయును గుర్తెఱుగు నా మహాపురుషుడును
పుట్టించి జీవులను పోషించువా డతడు!
ఆవిశ్వపతికి నీ వంతయును నర్పింపు!
మౌనధారణ జేసి మహనీయ భక్తితో! ॥ఏది॥

పగలు సూర్యునిచేత ప్రభవించు కాంతులును
చందురుడు దారలును తగ రాత్రి వెలయించు!
శోభాయమానముగ జేయు నీ వసుధనూ!
జీవకోటికి నూత్న జీవనము సమకూర్చు!

వర్ష మెపుడవసరమొ! వడగాలు లవసరమొ!
మంచుకాలం బెపుడు మహికి యెపుడవసమొ!
అతడే సమకూర్చు అన్నియను జీవులకు!
స్థిత ప్రజ్ఞతను నుండు మతి శాంతితో గూడి!

## దేహాత్మ బుద్ధితో

దేహాత్మ బుద్ధిలో దిశలు జూడగరాదు
ఆత్మయే తాననీ నరసి దెలియగవలెను

అట్టివాడేగదా అలరు పుణ్యాత్ముడును
బంధముక్తుని వోలె బరగు యీ విశ్వమున!

దేహాత్మ బుద్ధితో దిశలు జూడగరాదు
ఆత్మయే తాననీ నరసి దెలియగ వలెను

సహజ స్వభావమును దా తెలిసికొని నపుడు
ఆద్యంతమునులేని అమరత్వ రూపమని!
శాశ్వతానందమున సరితూగు రూపమని
అహమునకు దూరముగ యలరి వర్తించునూ! ॥దేహాత్మ॥

ఆత్మ ఒక్కటి నిజము! అన్నియు నసత్యములు
శుద్ధమై నిత్యమై స్వప్రకాశము గలది!
సాధింపవలె దాని నహజ నిశ్చల బుద్ధి
అట్టి పరమాత్మయే అలరి తా ననుచునూ! ॥దేహాత్మ॥

అట్టివారలె గదా! యలరి పుణ్యాత్ములున్న
బంధముక్తుల వోలె బరగుదురు విశ్వమున!
పరమసుఖ సంసిద్ధి బరగుదురు ముక్తులై
జ్యోతిలో లీనమై దీప్తి జెందెర రిలను!

దేహాత్మ బుద్ధితో దిశలు జూగగరాదు
అరసి తెలియగ వలెను! ఆత్మయే తాననీ!

## విశ్వవిభుడా కర్త

విశ్వవిభుడా కర్త విమల స్వరూపుడూ!
ప్రేమతో గనుచుండు ప్రీతితో జనులా!

ప్రారబ్ధ కర్మానుసారముగ జీవులను
ఆట లాడించునూ ఆశ్చర్యముగ తాను!

విశ్వవిభు డా కర్త విమల స్వరూపుడూ
ప్రేమతో గనుచుండు ప్రీతితో జనులా!

చిత్రముగ యొక జీవి చిఱునవ్వు నవ్వునూ
రోదసీ నిండగా రోదించు నొక జీవి!
ఆడంబరములతో అలరు నొక జీవియును
కన్నీటితో నొకడు కలగుండు బడుచుండు! ॥విశ్వ॥

జీవి ప్రారబ్ధమున చింతలును వంతలను
అనుభవింపగ వలయు నాచరింపగ వలయు!
జరుగునది జరుగునూ! జగతిలో కర్మలును
జరుగనిది జరుగదూ! జాగృతిని నున్నమా! ॥విశ్వ॥

ఇద నగ్నసత్యమూ ఇహ లోక యాత్ర యిది!
అనుభవింపగ వలయు అన్నియును సహజముగ!
కందిపోవగరాదు! చిందిపోవగ రాదు!
మౌనమే ఉత్తమము! మాటాడకను వరుడు!

విశ్వవిభు డా కర్త! విమల స్వరూపుడూ
ప్రేమతో గనుచుండ! ప్రీతితో జనులా!

## జప తపముల తోని

జప తపంబులతోని జనులు పరమేశ్వరుని
ధ్యానించు చుండేదరు దగ పరము నందా!

అట్టి జప తపములను నరసి తెలియగ వలయు
సామాన్య మానవులు సహజముగ భక్తితో!

జప తపంబుల తోని జనులు పరమేశ్వరుని
ధ్యానించు చుండెదరు దగ పరము నందా!

మంత్రములతో జపము మది నిశ్చలత గూడి
ఉచ్చరింపగ వలయు సచ్చరిత్రముగా!
పరులు వినకుండగా భవ్యముగ తనలోనె
ధ్యానింపగా వలయు ధార్మికంబగు జగతి!

మంత్రనాదం బెచట మతి యుద్భవించునో
పరికింపగా వలయు భవ్య సుందరభక్తి!
హృదయ కుహరమునుండి ఆమహా నాదములు
నుద్భవించును గదా! యున్నతం బగు విధిని! ॥జప॥

హృదయ కుహరమునున్న పరమాత్మలో మనసు
నిశ్చలత నుంచుటే నిజమైన తపసు సుమ!
మంత్రనాదము లేదు మనసు చింతన లేదు!
పరమాత్మలో మనసు బరగ లీవంబగుట! ॥జప॥

దానినే తపసు అని సద్భావకుల పలుకు
మనసుతో నుంచుకొని మది పిశ్చలతతోవి
జప తపంబల జేయు జనులు భవ్యాత్మకులు
అట్టి వారలుగదా! అలరుదురు పదమంచు!

## ఆత్మయే పరమాత్మ

ఆత్మయే పరమాత్మ! అలరు సకలమునందు
అంతర్హితంబుగా నలరుచును నుండూ!

ఆ మహాజ్యోతికివి నలరు కిరణముల వలె
మన ఆత్మలన్నియును మిణుగురులకు వోలె!

ఆత్మయే పరముత్మ! అలరు సకలమునందు
అంతర్హితంబుగా నలరుచుచు నుండూ!

మనయందు గలదాత్మ! మమతతో నీశ్వరుడు
నివసించుచుండునూ నీడగా తా నెపుడు!
చూడదలచిన వారు జూడగను వచ్చునూ
పనస తొనకును వోలె బరగ దిన వచ్చునూ!

మహనీయమగు ఆత్మ మానుగా నీశ్వరుడు
ప్రతిప్రాణిలో గలడు బరగ శోధింపగా!
కొత్తగా కొనిదెచ్చు కొనవలసినది గాదు
మమతతో మనహృదిని మానుగా నున్నదీ!

ఎచటనో యీయాత్మ యింపుగా నున్నదని
భ్రమచేత యిటనటను భ్రమియించుచున్నాము!
ఆత్మయే పరమాత్మ! ఆ ఆత్మ మనలోనె
తల్లివలె నున్నదీ! దగ దృష్టి బఱపుచును!

ఆత్మయే పరమాత్మ! అలరు సకలము నందు
అంతర్హితంబుగా నలరుచునునుండూ!

## ఆత్మయన విశ్వపతి

ఆత్మయన విశ్వపతి అలరు భువనమునందు
సకల జీవులయందు సాక్షిగా గలదూ!

మనసు కనుగొగలేదు మాధుర్యమును ఆత్మ
హృదయారవిందమున సదయ కనుగొందుమూ!

ఆత్మయన విశ్వపతి అలరు భువనమునందు
సకలజీవులయందు సాక్షిగా గలదూ!

దేహాత్మ బుద్ధితో దిశలు గనుగొని మనము
ఆత్మ ప్రకాశమును అరయలేకున్నాము!
తండ్రిచాటుప సుతుడు దగ యణగి యుండినటు
ఆత్మచాటున దేహి యణగి యుండగ వలెను! ॥ఆత్మ॥

రాముడంతటి వాడు రహి దశరథుని సుతుడు
పాలించినాడుగద! ప్రభువుగా తండ్రినీ
పరశు రాముడుగూడ బరగ జమదగ్నికిని
యణగి యుండగలేద? అలరి తండ్రిగ దలచి!

అటులనే దేహియును ఆ యాత్మ సుతునిగా
అణగి యుండగవలెను నాజ్ఞ మీరకయుండి!
ఆత్మలో భాగముగ అలదేహి భావించి
వర్తించు చుండవలె వనర సుతునికి వోలె!

ఆత్మయన విశ్వపతి! అలరు భువనమునందు
సకల జీవులయందు సాక్షిగా గలదూ!

## 'నేనెవరు?' 'నేనెవరు?'

'నేనెవరు?' 'నేనెవరు?' నిఖిల భూతములందు
అనుచు ప్రశ్నించుకొన అదియె సాధన యంద్రు!

అత్మ సందర్శించి యాత్మానుభూతినీ
ఆనందమును బొందు టమరత్వసిద్ధీ!

'నేనెవరు?' 'నేనెవరు?' నిఖిల భూతములందు
అనుచు ప్రశ్నించుకొన అదియె సాధనయంద్రు!

దేహాత్మ బుద్ధితో దీపించు వారలును
ఆత్మనే మఱచినా అలరేటి వారలును!
పాంచ భౌతికమైన పంచేంద్రియంబులను
నే ననుచు దేహినీ నిర్ణయింతురు మదిని! ॥నేనెవరు?॥

'నేను' 'నాదీ' యనెడి యుచ్చులను దగులుకొని
తెలిసికొనలేదుగా దీరుగా మహితాత్మ!
నీవె నే ననుచునూ నాది నీదనుచునూ
అత్మ తెల్లముగాగ యటు మీద తెలిసెదరు! ॥నే నెవరు॥

సుఖమునై శుద్ధమై సుప్రకాశంబునై
నిత్యమై వ్యాప్తమై నిర్ణయంపగ రాని!
ఆధారమై యఖిల నామ రూపంబులకు
అట్టి పరమాత్మయే అలరి నే ననుచునూ! ॥నే నెవరు?॥

అజ్ఞానులకు మదిని యెఱుకబడనట్టిదియు
కరతలామలకమై కమనీయ జ్ఞానులకు!
ఏది కలదో యదియె! పరమాత్మరూపమూ!
ఆ పరమాత్మయే 'నేను'గా భావింత్రు! ॥నే నెవరు?॥

## సంఘ సంస్కారణమును

సంఘ సంస్కారణమును దాముచేయుదు మనుచు
ఆర్భాటమును జేసి యలరుచుందురు జగతి!

లోకోద్ధరణమునకు లోలతను యిలువెదలి
ఉపదేశముల జేసి యుర్విలో దిరిగెదరు!

సంఘ సంస్కారణమును దాము జేయుదు మనుచు
ఆర్భాటమును జేసి యలరు చుందురు జగతి!

సంఘ సంస్కారమును దా జేయుటకు ముందు
ఆత్మ సంస్కారమును నలరిజేయగ వలెను!
నూత్న సిద్ధాంతముల నూత్నబోధనలనూ
తనుదాను ముందుగా దగ యాచరింపవలె! ॥సంఘ॥

బోధించుటకు ముందు బోధనల తానుగా
ఆచరింపగ వలయు నలరి జూపగ వలయు!
లోకమంతా జూచి లోలతను బోధనల
తామాచరించెదరు దగ జూచి యాసక్తి! ॥సంఘ॥

నిను నీవు సంస్కరణ మార్గమున నడుపుకో
నీ యడుగు జాడలను నిఖిలమంతా నడుచు!
సంఘమంతా మారు; సంఘ సంస్కారణమును
సిద్ధించు దానీ కదె! స్వీకరించును జగతి!

సంఘ సంస్కారణమును దాముజేయుదు మనుచు
ఆర్భాటమును జేసి యలరుచుందురు జగతి!

ఆత్మ చింతన

## సుజన సాంగత్యమున

సుజన సాంగత్యమున సజ్జనుల స్నేహమున
సమకూరు ధరణిలో సర్వమును జనులకూ!

అంధకారము మాపు నటు వెలుగు జూపింపు
దీనత్వమును మాపు! ధీరతను గలిగించు!

సుజన సాంగత్యమున సజ్జనుల స్నేహమున
సమకూరు ధరణిలో సర్వమును జనులకూ!

చంద్రునీ వెన్నెలలు సాంద్ర తాపము మాన్పు
కల్ప వృక్షము వలన కదులు దీనత్వమును!
సకల కల్మషములను గంగచే హరియించు
సుజన సాంగత్యమున సూటిగా పైమూడు
నిర్మూలనం బగును నిశ్చయంబుగ ధాత్రి! ॥సుజన॥

సుజన సాంగత్యమే సూటిగా బనులందు
సకలార్థ సాధనము సమకూరు జనులకును!
మంచిదారిని జూపు! మరియాద ఘటియించు
నీతి బోధను జేసి నిర్మలత్వము జూపు! ॥సుజన॥

అడుగడుగు కష్టాలు నగుపించినా గూడ
అపజయంబులు వేయి యడ్డు వచ్చిన గూడ!
వ్యథ ననుభవింపరూ! వేదనల నందరూ
సజ్జనుల సేవలే సరనముగ రక్షింపు!

సుజన సాంగత్యమున సజ్జనుల స్నేహమున
సమకూరు ధరణిలో సర్వమును జనులకూ!

## దారిద్ర్య కష్టములు

దారిద్ర్య కష్టములు దగయుండగా నరుడు
ఆరాట పడరాదు నాయాస బడుచూ!

ఆ పరమేశ్వరుని యా పరంధామునీ
స్మరియించు కొనుట కవి చక్కనీ దీపికలు!

దారిద్ర్య కష్టములు దగయుండగా నరుడు
ఆరాట పడరాదు నాయాస బడుచూ!

దారిద్ర్య కష్టములు దరిజేర మానవుడు
మనసుతో నెల్లపుడు మథనబడుచుండునూ!
తన యిష్ట దైవమును దపియించుచును వేడు
తొలగింపగా తనదు దుఃఖ దారిద్ర్యములు! ॥దారిద్ర్య॥

భగవంతునీ పైని భారమంతయు వేసి
తపియించుచుండునూ తనదు దుఃఖము దెలిపి!
తన దుఃఖ వేదనను తనదు దారిద్ర్యమును
తొలగింపగ వేడు తోరంపు భక్తితో! ॥దారిద్ర్య॥

భగవంతు వేడికొన బరగ ఉత్తమమైన
మార్గమది ప్రేరణము మఱి దోహదం బదియు!
అందుకే కష్టాల నలరి బెదరగ రాదు
పరమేశు ప్రార్థింప పరమ మార్గంబదియు! ॥దారిద్ర్య॥

కష్టాలు, నష్టాలు కరిన దారిద్ర్యమును
తెల్ల మబ్బుల వోలె తెలిపోవుచు నుండు!
తన యిష్టదైనమే తాను స్వయముగ వచ్చి
తొలగించుచుండునూ తొలకరించును ప్రేమ! ॥దారిద్ర్య॥

## సకలమగు బరువులను

సకలమగు బరువులను సకలమగు బాధ్యతల
భగవంతుకే వదిలి బరగ నిశ్చింతా!

ఉండుటయె సాధనము నుర్విలో లీలగా
స్థితప్రజ్ఞ లక్షణము గది దప్పకను మదిని!

సకలమగు బరువులను సకలమగు బాధ్యతల
భగవంతుకే వదిలి బరగ నిశ్చింతా!

సకల బాధ్యతలనూ సర్వభారంబులను
ఆ పరమాత్ముడే అలరి మోయుచునుండ!
నీ కెందు కంత శ్రమ? నీ కెందు కంత భ్రమ?
అతడే గద నడుపు నాడించు ఓడదూ! ॥సకలమగు॥

కోట్లాది జీవులను కొమరొప్ప యాత్రకును
గొనిపోవుచున్నాడు కూర్మితో, నోడలో!
చుక్కాని తెరచాప సూటిగా బట్టుచును
ఓడ నడిపేవాడు నొనర యతడే గాద! ॥సకలమగు॥

బరువు బాధ్యతలనూ బరగ తా మోయుచును
తీరమును జేర్చెటి దిగ్గంతు డతడేను!
మథనపడు టేల మది మౌనముగ నుండకను
ఓడలో బరువులను నొనర మోయగనేల?

సకలమగు బరువులను సకలమగు బాధ్యతల
భగవంతుకే వదిలి బరగ నిశ్చింతా!

## పరమేశ్వరుని కరుణ

పరమేశ్వరుని కరుణ బరగ లేదనుచునూ
చింతించుటయు గూడ స్థిరమైన దయయే!

అతని దయ నొందుటకు అలరి ప్రార్థించుటకు
సాధనంబని మనసు దలపగా వలదా!

పరమేశ్వరుని కనుణ బరగ లేదనుచునూ
చింతించుటయు గూడ స్థిరమైన దయయే!

ప్రారబ్ధ కర్మమున బరగవచ్చుచు నుండు
కష్టాలు నష్టాలు కలత సుఖములునూ!
తేలిపోవుచు నుండు తెరలవలె కష్టాలు
అలలంతమైనటుల యటులనే దుఃఖములు ॥పరమేశ్వరుని॥

పగలంతమై మఱల బరగ నిశి వచ్చినటు
నిశియంతమై మఱల నిఖిల ప్రపంచంబు
బరగ వెలుగులునిండి భాస్వరంబైనటుల
నూత్న ప్రపంచంబు నుర్వి వికసించునూ ॥పరమేశ్వరుని॥

అఖిలాత్మకుని ప్రేమ యలరి లేదనుటయును
మథన పడుటయుగూడ మఱి ప్రార్థనే సుమా!
హరిని పార్థించుటకు అతని కృప నందుటకు
ప్రేరణం బిది గదా! ప్రీతి దయ నందుటకు

పరమేశ్వరుని కరుణ బరగ లేదనుచునూ
చింతించుటయుగూడ స్థిరమైన దయయే!

## ఒకసారి! ఒకసారి!

ఒకసారి! యొకసారి! యొనరగా తానెవరో
సహజ స్వభావమును దలచి తెలిసిననూ!

ఆద్యంతములులేని అఖిల శాశ్వతమైన
ఆనంద రూపమని యతనికే తెలియునూ!

ఒకసారి! ఒకసారి! యొనరగా తానెవరో॥
సహజ స్వభావమును దలచి తెలిసిననూ!

దేహాత్మబుద్ధితో దీరుగా గనుకొనక
తానాత్మ కిరణమని తన్మయముగా నుండి!
దీరుగా దేహమును స్థిరమైన యాత్మలో
భాగమని భావించు భాసించు నాత్మగా! ॥ఒకసారి॥

సుఖమునై శుద్ధమై సుప్రకాశంబునై
నిత్యమై వ్యాప్తమై నిర్గుణంపగరాని!
ఆధారమై యఖిల నామరూపంబులకు
అట్టి పరమాత్మయే అలరి నే ననుచునూ! ॥ఒకసారి॥

ఆద్యంతములు లేని అల నిరంతరమైన
శాశ్వానందమై స్థిర రూపమవి దెలియు!
ఆ మహాజ్యోతికిని అలరి తా కిరణమని
భావించు మది యందు భవ్యాత్మ బుద్ధితో!

ఒకసారి! ఒకసారి! యొనరగా తానెవరో!
సహజ స్వభావమును దలచి తెలిసిననూ!

# ప్రతిజీవియును గూడ

ప్రతి జీవియును గూడ బరగ లోకమున యొక
పనిచేయుటకు యేదో బరగ జన్మించూ!

యిష్టమున్నను లేక యిష్టపడకున్ననూ
అతనిచే నాపనిని యలరి జేయించునూ!

ప్రతిజీవియును గూడ బరగ లోకమున యొక
పనిచేయుటకు యేదో బరగ జన్మించూ!

నీకు విధియించినా నిర్ణయించిన పనిని
ఆ పరమేశ్వరుడు నా పరంధాముడూ!
ఆసక్తి యుండినను ఆసక్తి లేకున్న
నీ చేత జేయించు నిర్ణయించిన రీతి! ॥ప్రతి॥

రాము డడవులకునూ రమణీయముగ బోయె
ఇష్టమున్నను లేక యిష్టమును లేకున్న!
సకల రాక్షసుల నట సంహరించెను గాద!
అడవులకు బోయినా యల రామచంద్రుడును! ॥ప్రతి॥

ఆ మహా కార్యమున అంతరంగము నుండు
ఆ జీవియును జేయు! అలసటను లేకుండ!
నాట్య రంగమునందు నటుడు జేసెడి పనిని
జీవిచే జేయించు స్థిరముగా నీశ్వరుడు! ॥ప్రతి॥

నీ యిష్ట కష్టముల నిజముగా వర్జించి
అంతరంగమునందు నా యీశ్వరుని దలచి
ఫలితమును శ్రీహరికి బన్నుగా నర్పించి
విధి ననుసరింప వలె విన్నవించిన రీతి! ॥ప్రతి॥

## అఖిల లోకేశ్వరుడు

అఖిల లోకేశ్వరుడు ఆ పరంధాముడూ
ప్రారబ్ధ కర్మలను బరగ సరిజూచీ!

శుభము అశుభములకును సూటిగా జీవులకు
ఫలములను నిచ్చుచును బరగచుండెపుడునూ!

అఖిల లోకేశ్వరుడు నా పరంధాముడూ!
ప్రారబ్ద కర్మలను బరగ సరిజూచీ!

ఈ సర్వ జగతికిని నిండైన రూపముగ
బరగుచుండును గదా! ఫలములను నిచ్చీ!
అఖిలాత్మకుడు మఱియు నా విశ్వరూపుడే
నియమించుచుండునూ నీడగా లోకమును! ||అఖిల||

ఈ సర్వలోకమును నీశ్వరుని రూపమై
వర్ధిల్లుచున్నదీ ఓంకార రూపమున!
సకల చరాచరము లన్నియును నతనిలో
లీనమై యుండునూ లీలగా వర్తించు! ||అఖిల||

అందుకే యీ జగతి యంతయును నీశ్వరుని
రూపముగ భావించి రూఢిగా జీవులకు
సేవలను జేయుచే స్థిరముగా యీశ్వరుని
సేవ జేయుట యనుచు శీలమున భావింపు!

అఖిల లోకేశ్వరుడు నా పరంధాముడూ
ప్రారబ్ధ కర్మలను బరగ సరిజూచీ!

## 'నేను' 'నే' ననుచునూ

'నేను' 'నే' ననుచునూ నిరవధిక అహముతో
బనులు జేయుచు చుంద్రు బరగ లోకమునా!

దేహాత్మ బుద్ధితో దిశలు గనుచును జనులు
పరిభ్రమణ బుద్ధితో బరగుచుందురు జగతి!

'నేను' 'నే' ననుచునూ నిరవధిక అహముతో
బనులు జేయుచు నుంద్రు బరగ లోకమునా!

స్థిత ప్రజ్ఞుడైన వాడటుగాక ధరణిలో
దా జేయు కార్యముల దన్మయంబుగ హరికి
యర్పించు చుండునూ యలరి ఫలమును గూడ
అంతరంగమునందు అలరి సంతోషమున! ॥నేను॥

ఆ స్థిత ప్రజ్ఞుడే యహమన్నదియు లేక
సకల కార్యములందు సర్వేశ్వరుని దలచి!
వర్తించు చుండునూ వనర శివరూపముగ
భావించుచుండునూ భావమున యేమఱక! ॥నేను॥

తా జేయు పనులలో తపన యింతయు లేక
హరి సమర్పణబుద్ధి అలరి జేయుచు నుండు!
సకల కార్యములందు సర్వేశ్వరుని గాంచు
నిష్కామ కర్ముడై నిరతమును జేయునూ! ॥నేను॥

'నేను' అను అహమునూ నిర్జించి చేయుపని
ఏదైననూ గూడ నిమ్ముగా వసుధలో
శివరూపముగ దోచి స్థిర ఆత్మ చైతన్య
ఆనందమును బొందు నలరి యా మానవుడు! ॥నేను

## పరమాత్మ రూపమగు

పరమాత్మ రూపమగు నట్టి 'నే' నను పదము
ఎచట బుట్టునో! యనుచు నే మఱక బరికింపు!

మనసు లయమగు నచట మహనీయ యాత్మయును
భాసించు హృదయమున బరగ పద్మమువోలె!

పరమాత్మ రూపమగు నట్టి 'నే' నను పదము
ఎచట బుట్టునో! యనుచు నేమఱక బరికింపు!

సుఖమునై శుద్ధమై స్వప్రకాశంబునై
నిత్యమై వ్యాప్తమై నిర్ణయింపగనిరాని
ఆధారమై యఖిల నామరూపంబులకు
అట్టిపరమాత్మయే అలరినే 'నే' ననుచునూ! ॥పర॥

అజ్ఞానులకు మదిని యెఱుక బడ నట్టిదియు
కరతలామలకమై కమనీయ జ్ఞానులకు!
ఏదికలదో! యదియె పరమాత్మ రూపమూ!
ఆ పరమాత్మయే 'నేను'గా భావింత్రు! ॥పర॥

తన్ను దా తెలిసికొని తగు జ్ఞానమును బఱపి
మనసు తెరలను మాపి మానుగా విశ్వేశు
ఆత్మస్వరూపమును నలరి గనుగొనుటయే
జ్ఞాన యోగం బనుచు జ్ఞాను లిల బలికెదరు!

పరమాత్మ రూపమగు నట్టి 'నే' ననుపదము
ఎచట బుట్టునో యనుచు నేమరక బరికింపు!

# స్తోత్ర మంత్ర జపాది

స్తోత్ర మంత్ర జపాది సూత్రముల కంటెనూ
మహనీయ ధ్యానమే మానుగా నుత్తమము!

చిత్తశుద్ధిని జేయు చింతనయె ధ్యానమూ!
ఉత్తమంబని బుధులు నూహించు చుందురూ!

స్తోత్ర మంత్ర జపాది సూత్రముల కంటెనూ!
మహనీయ ధ్యానమే మానుగా నుత్తమము!

అట్టి ధ్యానము సేయ యలసటను బొందెదరు
చిత్తమును శాసింప చింతనల మాపగా!
మనసు స్థిరమును లేక మధుర చింతనలతో
శోకచింతనలతో లోలతను బొందెదరు! ॥స్తోత్ర॥

నిశ్చలముగా యాసనము పైని కూర్చుండి
ఉచ్ఛ్వాస నిశ్వాసములను గమనింపుమా!
మనసు సుస్థిరమునై మహనీయ ధ్యానమును
కుదుటబడి జేయుటకు కూర్మి సంసిద్ధమగు! ॥స్తోత్ర॥

అభ్యాస విద్యచే అలరి ధ్యానము కుదురు
చిత్తమును శాసించు చెదిరి పోవక మనసు!
ఉచ్ఛ్వాస నిశ్వాసములను గమనించుచే
అభ్యాసమున కుదురు నాధ్యాన యోగమూ!

స్తోత్ర మంత్ర జపాది సూత్రముల కంటెనూ
మహనీయ ధ్యానమే మానుగా నుత్తమము!

## మూగివలె రాయిగా

మూగివలె రాయిగా మూసికొని నోరునూ
కదలకను యున్నచో కమనీయ మౌనమా?

చిత్తవృత్తులు లేని స్థిరమైన నిష్ఠయే
మౌనమున కర్థమూ మహనీయు లందురూ!

మూగివలె రాయిగా మూసికొని నోరునూ
కదలకను యున్నచో కమనీయ మౌనమా?

శిలలు మాటాడవూ శివలింగమును గూడ
చిఱునవ్వుతో జనుల చిత్తశాంతిని గూర్చు!
గుడిగోపురంబులును కూర్మి శిల్పంబులును
మహనీయ మౌనమున మాటాడు చుండునూ! ॥మూగివలె

అందమగు బొమ్మలును ఆటలాడును గాద!
పసిపిల్లలనుగూడి బరగ చిఱునవ్వులను!
మౌన మది విశ్వమున మధురమగు భాషయది
మౌనమున సురలతో మాటాడవచ్చునూ! ॥మూగివలె

మౌనమున సాధింప రాని దేదియు లేదు!
తారలును చంద్రుడును దగ సూర్యబింబమును!
తొలిసంధ్య మలిసంధ్య తోరంపు కొండలును
చెట్టుచేమలు నదులు అట్టడుగు నేలయును
మౌనసాధనచేత మఱి బొందు గారవము!

మూగివలె రాయిగా మూసికొని నోరునూ!
కదలకను యున్నచో కమనీయ మౌనమా?

## అలరు ప్రేమకు మఱియు

అలరు ప్రేమకు మఱియు నల యనుగ్రహమునకు
అత్యుత్తమగు రూప మలరు మౌనము గదా!

అదియె యుపదేశమును నదియె సందేశమును
అదియె సర్వోత్కృష్ట యానందమును గూడ!

అలరు ప్రేమకు మఱియు నల యనుగ్రహమునకు
అత్యుత్తమగు రూప మలరు మౌనముగదా!

ఆ మహోత్కృష్టతను నలరి పొందుటకునై
విశ్వమున ప్రతియణువు వికసించు చున్నదీ!
తల్లిప్రేమయుగూడ దగ శిశువుతో నలరి
మౌనమగు ముద్దుతో మాటాడు చుండునూ! ॥అలరు॥

కొండకోనలు నదులు కోనేరులును గూడ
మౌనముగ మాటాడు మధుర చేష్టలతోని!
దేవాలయములోని దేవతలు మౌనముగ
హస్తములు జూపించి యాశీర్వదించెదరు! ॥అలరు॥

మౌనమును విడనాడి మాటాడు చున్నచో
కలహములు కలవరము గలుగుచుండును ధరణి!
మౌనమున సాధింత్రు మహనీయు లందఱును
కోరినా కోరికలు కూర్మి యోచనలునూ!

అలరు ప్రేమకు మఱియు నల యనుగ్రహమునకు
అత్యుత్తమగు రూప మలరు మౌనము గదా!

## జన్మమొందిన దిచట

జన్మమొందిన దిగట మరణంబు నొందునూ!
ఎవరడ్డు వచ్చినా యాగ దా మరణంబు!

మానవుడు సాధించు మహనీయ సంపదలు
అంతరించును జగతి యాగబోవింతయును

జన్మమొందిన దిచట మరణంబు నొందునూ
ఎవరడ్డు వచ్చినా యాగదా మరణంబు!

పాంచభౌతికమైన బరగ యీ దేహమును
పంచభూతములలో పంచత్వమును బొందు!
ఇనుము బంగారములు నిసుమంత లేకుండ
కలిసిపోవును కాలగర్భమున గనకుండ! ॥జన్మమొందిన॥

నేటి సంపాదనయు రేపు మాయం బగును
నేటి మానవుడునూ రేపుండబోడుగద!
చెట్టు పుట్టలు నదులు సిరివిరియు సంపదలు
రేపు గనరావు గద! నిలిచి యీ వసుధలో! ॥జన్మమొందిన॥

కావి నిత్యము ఆత్మ! కఱిగిపో దెప్పుడును
శాశ్వతము, శుద్ధమును సకల జీవుల యందు!
ఆలరారు చుండునూ ఆనంద దీపికగ
కావునను నీవునూ గల చింతలను మాని
సుస్థిరుండవు గమ్ము సురుచిరంబగు నాత్మ!

జన్మమొందిన దిచట మరణము నొందునూ!
ఎవరడ్డువచ్చినా యాగ దా మరణంబు!

త్మ చింతామణీ!

ఆత్మ చించామణీ! అది స్వప్రకాశమై
ప్రతి జీవిలో నుండు ప్రతియొకరి రూపమే!

అన్నిబోయిన గూడ యది యొక్కటియె మిగులు!
కన్నతల్లికి వోలె కాపాడుచుండునూ!

ఆత్మ చింతామణీ! అది స్మప్రకాశమై
ప్రతి జీవిలోనుండు ప్రతి యొకరి రూపమే!

ఆత్మ చింతామణిగ యంతరంగమునందు
ప్రతినారి యందునూ భాసిల్లు చున్నదీ!
భగవంతు జ్యోతికిని భాసిల్లి కిరణముగ
మధుర జీవితమునకు మార్గదర్శక మగును! ॥ఆత్మ

చింతామణీ యెటుల సిద్ధి జేకూర్చునో
అల యాత్మయునుగూచ యటులనే విలసిల్లు!
విశ్వమంతా నిండి వికసించు చున్నదీ!
లేని తావును లేదు లేశమైనను భువిని! ॥ఆత్మ॥

కరతలా మలక మది కమ్మనీ ఫలమునది!
ప్రతివారి రూపమే ప్రతివారి కందునూ!
పొందుట కసాధ్యమని పొందుట కశక్యమని
భావింపగా రాదు! ప్రతివారి హృదయ మది!

ఆత్మ చింతామణీ! అది స్వప్రకాశమై
ప్రతిజీవితోనుండు ప్రతియొకరి రూపమే!

# ఆత్మ దర్శనమునను

ఆత్మ దర్శనమునను నలరారు చున్నచో
దర్శింపవచ్చునూ! సర్వదేవతలా!

మఱల జన్మము లేక మధురాను భూతితో
లీనమై పరమాత్మలో ముక్తినందునూ!

ఆత్మ దర్శనమునను నలరారు చున్నదో
దర్శింప వచ్చునూ సర్వదేవతలా!

అల యరుంధతి వశిష్టాది మౌనులును
వాల్మీకి జనకులును నత్రి యనసూయలును!
ఏ పరంజ్యోతినీ దర్శించిరో వారు
ఆ పరాశక్తిని అన్నియును సాధింత్రు! ॥ఆత్మ॥

ఆత్మశక్తిని మించి యలరి యీ లోకమున
సరితూగునది లేదు! సహజముగ బరికింప!
ఆత్మయే పరమాత్మ! అఖిల లోకంబులును
అణువణువు నతనిలో నలరి యణిగుండునూ! ॥ఆత్మ॥

బ్రహ్మ విష్ణు మహేశులను వారితో గూచ
మాటాడవచ్చునూ! మహిత సంభాషణలు!
ఆత్మ దర్శనముతో నలరి మనశ్శుద్ధి
మహనీయమగు మనో మహితశక్తిని గలిగి
జ్ఞాన నిష్టలు గలిగి బగతి వర్తింప వలె!

ఆత్మదర్శనమును అలరారు చున్నడో
దర్శింప వచ్చునూ! సర్వదేవతలా!

## శివమన్నదే యాత్మ!

శివమన్నదే యాత్మ చైతన్యమని యంద్రు
ఆత్మ చైతన్యమే శివమనుచు బలికెదరు!

శివమన్నదే దేహమున లేకపోయినప్పు
డా దేహమును శవము ననుచు బలుకుదురు గద!

శివమన్నదే యాత్మ చైతన్యమని యంద్రు
ఆత్మ చైతన్యమే శివ మనుచు బలికెదరు!

పాంచభౌతికమైన దేహమైనపుడు దా
ఆత్మరూపంబుతో నలరి ప్రకాశించు
ప్రారబ్ధకర్మములు పరిపూర్తియైనపుడు
ఆ దేహమును మారు నచలమౌ శవముగా! ॥శివ॥

కావునను ప్రతిజీవి కమనీయముగ తాను
జన్మించినది మొదలు జరబొందు వఱకునూ
ఆత్మచైతన్యమును సటు గోలుపోవగా
శవమగును దేహమును బెదిరిపోవును నెటకొ! ॥శివ॥

ప్రతిజీవి సాలోచనముగ బరికింపవలె
తాపుట్టినది మొదలు దా గిట్టువఱకునూ
శవవాహకుని వోలె చరియించు నటుని వలె
వేషభూషలతోని వివిధ భాషణములను!

శివమన్నదే యాత్మ చైతన్యమని యంద్రు
ఆత్మ చైతన్యమే శివ మనుచు బలికెదరు!

# దేహాత్మ బుద్ధియే

దేహాత్మ బుద్ధియే దీరుగా నరునకును
ఉన్న రోగము సుమా! యూహింప నిజమూ!

విశ్వాత్మ బుద్ధితో విమలతను విలసిల్లి
ఆత్మ విచారమున యలరుటే యౌషధము!

దేహాత్మ బుద్ధియే దీరుగా నరునకును
ఉన్నరోగము సుమా! వూహింప నిజమూ!

ఆత్మ దేహమునందు నలరునది యని దలచి
ఆత్మ శాశ్వతమనుచు నలర డా మానవుడు!
బుద్బుదం బయిన యీ దేహమే నిత్యమని
భావించు చుండునూ భవితవ్యమును గూర్చి! ॥దేహాత్మ॥

సుఖమునై, శుద్ధమై సుప్రకాశంబునై
నిత్యమై, వ్యాప్తమై, నిర్ణయింపగరాని!
ఆధారమై యఖిల నామ రూపంబులకు
అట్టి పరమాత్మయే యలరి నే ననుచునూ! ॥దేహాత్మ॥

విశ్వాత్మ బుద్ధితో వికసించి మానవుడు
ఆత్మవిచారమున యలరుటే మార్గమూ!
దేహాత్మ బుద్ధినీ తీరుగా త్యజియించి
ఆ మహాజ్యోతిలో నలరుటే సత్పథము!

దేహాత్మ బుద్ధియే దీరుగా నరునకును
ఉన్నరోగము సుమా! యూహింప నిజమా!

సాధు సందర్శనము సహజముగ దుర్లభము!
సాన్నిహిత్యముగూడ సరిలేని మూల్యమూ!

ఆ మహా యోగములు నలరి గలుగుచునుండు
పూర్వ పుణ్యములచే పురుషార్థముల జేత!

సాధు సందర్శనము సహజముగ దుర్లభము!
సాన్నిహిత్యము గూడ సరిలేని మూల్యమూ!

రాట్నమున నూలొడికి రమ్యముగ మగ్గమున
నేత నేసీ వలువ నిమ్మగా ధరియింప!
ఇచ్చినట్లుండునూ మచ్చికను సజ్జనుల
సందర్శనముజేయు సహజమగు కూర్మినీ! ॥సాదు॥

పనసపండును కోసి బన్నుగా దొనలుగా
విడమఱచి యిచ్చినటు వేడుకను భుజియింప!
సజ్జనుల సన్నిహిత సామీప్యములుగూడ
మనసు కింపునుగూర్చు మాధుర్య భావముల ॥సాధు॥

పాలతో మీగడను బరగ వేఱుగజేసి
పంచదారను గలిపి బరగ యాలకులనూ
కలిపీ యిచ్చిన యటుల బరగ సజ్జనగోష్ఠి
ఆనందమును గూర్చు అభిమతము వెలవేర్చు!

సాధు సందర్శనము సహజముగ దుర్లభము
సాన్నిహిత్యము గూడ సరిలేని మూల్యమూ!

## ఉపవాసముల కంటె

ఉపవాసములకంటె యున్నతంబైనట్టి
వ్రతదీక్షలను బట్టి వాపోవుటేలా?

సాత్వికాహారమును సరసతను భుజియించి
మితముగా నుండుటే మేలుగద! తాపసులు!

ఉపవాసముల కంటె యున్నతంబైనట్టి
వ్రతదీక్షలను బట్టి వాపోవుటేలా?

కాఱడవిలో నుండి కఠిన తపసులు జేసి
శారీర తాపమును సహియింపనేలా?
పరమేశు ధ్యానమున భక్తితో రంజిల్లి
పర్ణకుటి నుండుటే బన్నుగా మేలుగద! ॥ఉపవాస॥

కణ్వ కాల్మీకులను కాంతార మందునా
ఆశ్రమము నిర్మించి యలరి శిష్యులతోని
వేద వ్యాసంగమును విమలతను జేయుచును
పరిపూర్ణ మానవత బరగనొందిరి గదా! ॥ఉపవాస॥

అతిథి అభ్యాగతుల నాదరించుచు నచట
పశుపక్షి సంతతిని బరగ పోషించుటయు!
స్వార్థమన్నది లేక సకలజీవులికు నల
ఆరాధనల జేయుటది మేలు! తాపసికి!

ఉపవాసముల మఱియు నున్నతంబైనట్టి
వ్రతదీక్షలను బట్టి వాపోవుటేలా?

## ఆత్మస్వరూప మది

ఆత్మస్వరూప మది యగుపింప దందురూ!
ఎచటనున్నదొ దాని యెఱుగలే మందురూ!

భగవత్స్వరూపమది భగవంతుడే యదియు
అంతటా నిండినా యఖిల స్వరూప మది!

ఆత్మస్వరూపమది యగుపింపదందురూ!
ఎచటనున్నదొ దాని యెఱుగలే మందురూ!

చూడగలిగిన వారు జూడవచ్చును దాని
అణువణువు నిండినా యాది స్వరూపమది!
ఏ రూపమున దాని చూడదలచినవారు
ఆరూపమున యదియు నవతరించుచు నుండు! ॥ఆత్మ॥

అత్రి వశిష్ఠులును అనసూయరుంధతులు
జ్యోతి స్వరూపమును జూచిరీ యాత్మనూ!
భాస్వదంతర్జ్యోతి బరగ దర్శించిరని
మునులు కీర్తింపగా మోదముగ వినలేద? ॥ఆత్మ॥

కృష్ణభక్తులు నాత్మ మురళీస్వనముగాగ
భావించి మురళిలో భాసిల్లుటకు వారు
ప్రార్థించిరని వినమె బన్నుగా మురళితో
ప్రతిరూప మదియె సుమ! పరమాత్మ రూపమే!

ఆకాశమందునను నలరి తారల గాంచి
ఆకాశమే లేదుఅని మనమునందుమా?
అణువైన కదలదూ అతని యానతి లేక
అంతటా నిండినా యలరు ప్రకాశమది!

## ఇది తప్పు! అది యొప్పు!

ఇది తప్పు! అది యొప్పు! ఇది బాగు! అది ఓగు!
అని విమర్శలు జేసి యారాట పడనేల?

వాద ప్రతివాదనలు సలరు కలహములుగా
బాగు పడరెవ్వరును బరగ యాలోచింప!

ఇది తప్పు! అది యొప్పు! ఇది బాగు అది ఓగు
అని విమర్శలు జేసి యారాట పడనేల?

తప్పొప్పులను గూర్చి తగు తీర్పు దెలిపేటి
వల్లభుడు కర్తగా యొక్కడే గల డతడు!
న్యాయ నిర్ణేతగా నియమించి యతనికే
మౌనముగ నుండుటే మానసీయం బదియె! ॥ఇది తప్పు॥

తప్పొప్పులను గాంచి సరిజేయు నాతడే
తెప్పపై పయనించు తీర్థులము మనమంత!
చుక్కాని లేదిందు సూటిగా తెరచాప
పయనించు వారమని బరగ దెలియగ వలయు! ॥ఇది తప్పు॥

దప్పొప్పు లెపుడుండు దరగ వీ విశ్వమున
వాద ప్రతివాదనలు వలనొప్ప యెపుడుండు!
ఆత్మ దర్శనమునను నల విమర్శలు నన్ని
మంచు తెరలుగ భువిని మాయమగుచును నుండు!

ఇది తప్పు! ఇది యొప్పు! ఇది బాగు! అది ఓగు!
అని విమర్శలు జేసి యారాట పడనేల?

## ఎఱుకయే జ్ఞాన మది!

ఎఱుకయే జ్ఞాన మది! యిల జ్ఞాన మన ఆత్మ
ప్రతి నరుడు తెలిసికొన బరగ యత్నింప వలె!

ఆత్మయన యీశ్వరుడు! అలరు యీ విశ్వమున
అణువణువు నుండేటి యఖిలాత్మకుడు వాడె!

ఎఱుకయే జ్ఞాన మది! యిల జ్ఞాన మన ఆత్మ
ప్రతి నరుడు దెలిసికొన బరగ యత్నింప వలె!

జ్ఞానమను యీ ఆత్మ జగతిలో నుండెపుడు
సహజ సిద్ధమునునై శాశ్వతం బైనదీ!
సజ్జనుల హృదయమున సరసతను సవదీర్చి
వివరించు చుండునూ విపులముగ పరమాత్మ!

అజ్ఞాన మనునదీ యలరు కృత్రిమమునై
వాస్తవము కానిదీ వసర తాత్కాలికము!
నశియించిపోవునూ నాల్గు దినముల లోన
అమవసను జంద్రుడును నగుపింపనీ రీతి!

అజ్ఞానముమ మాపి యలరు జ్ఞానము నంది
ఆత్మతో నీశ్వరుని యలరి గాంచుచు నెపుడు!
వసుధలో ప్రతియణువు నాత్మేశుగా దలచి
ఆయాత్మతో లీనమగుట యత్నింప వలె!
జ్యోతిలో లీనమై దీప్తి జెందగ వలయు!

ఎఱుకయే జ్ఞానమది! యిల జ్ఞాన మన ఆత్మ
ప్రతి నరుడు దెలికొన బరగ యత్నింప వలె!

## స్తోత్ర మంత్ర జపాది

స్తోత్ర మంత్ర జపాది శోధనలకు కంటెనూ
ధ్యాన ముత్తమ మనుచు దగ మౌను లందరూ!

ధ్యానమును ఒక విధము తపసుగా భావించి
చిత్తశుద్ధిని గూడి జేయగా వలయునూ!

స్తోత్ర మంత్ర జపాది శోధనల కంటెనూ
ధ్యాన ముత్తను మనుచు దగ మౌనులందురూ!

స్తోత్ర మంత్ర జపాది శుద్ధమగు నర్చనలు
అల యుపాసకునకును అధిక కష్టంబగును!
స్తోత్రములు జరుప వలె శుద్ధమగు వాక్కుతో
జపములను జేయవలె శారీరకముగనూ! ॥స్తోత్ర॥

ధ్యాన మన్నది యీశ్వరుని గూర్చి మనసునూ
లీనమును జేయవలె లీలగా యాదేహి!
మంత్ర తంత్రము లేదు మధురవాక్కును లేదు
ఆత్మలో లీనమై యలరి భాసింప వలె! ॥స్తోత్ర॥

స్తోత్ర మంత్ర జపాది శుభకరంబగు పనులు
ధ్యాన మన్నది కుదురు దరిజేర్చు కర్మ అవి!
ముందుగా నవిజేసి పొందుగా తదుపరిని
ధ్యాన ప్రక్రియకు మఱి దరిజేర వలె ధ్యాని!

స్తోత్ర మంత్ర జపాది శోధనల కంటెనూ
ధ్యాన ముత్తను మనుచు దగ మౌనులందురూ!

# ఆత్మ విచారమును

ఆత్మ విచారమును నలరి జేయని నరుడు
లోక విచారమున లోలతను మునుగూ!

కావునను లోక చింతన మాని మానవుడు
ఆత్మ విచారంబు అలరి జేయగవలెను

ఆత్మ విచారమును నలరి జేయని నరుడు
లోక విచారమున తోలతను మునుగూ!

లోక చింతనతోని లోలుడగు మానవుడు
ఆత్మ విచారంబు నలరి జేయగ లేడు!
ఉదయభాస్కరుని వలె యూహించుచును జగము
ఆత్మలో లీనమై యణగి యుండగవలెను! ॥ఆత్మ॥

ఆత్మ ఒక్కటి నిజము అన్నియు నసత్యములు
శుద్ధమై నిత్యమై స్వప్రకాశము గలది!
సాధింపవలె దాని సహజ నిశ్చలబుద్ధి
అట్టి పరమాత్మయే అలరి తా ననుచునూ! ॥ఆత్మ॥

అన్వేషణము జేయవలెను ఆత్మను బుద్ధి
బంధ విముక్తులుగ బరుగుదురు లోకమున!
పరమ సుఖ సంసిద్ధి బరగుదురు ముక్తులై
అట్టి విచారమే అలరి లోకమునందు
ఆత్మ సువిచారమని అలరి మును అందరూ!

ఆత్మ విచారమును నలరి జేయని నరుడు
లోక విచారమున లోలతను మునుగూ!

## మనసు స్వభావ మది

మనసు స్వభావమది మానుగా నశ్వరము
అస్థిరంబనుచు నీ వలరి తెలియగ వలయు!

శాశ్వతుండవు నీవు స్థిరుడవును లోకమున
అజ్ఞాన తిమిరమును నణగార్చు వాడవును!

మనసు స్వభావమది మానుగా నశ్వరము
అస్థిరంబనుచు నీ వలరి తెలియగ వలయు!

మనసు మూలంబునను మానుగా వెదుకుమా
మనసు మాయంబగును మానుగా నచ్చోట
వేయి కిరణములు గల విమల భాస్కరుని వలె
ఆత్మ ప్రకాశించు నలరు జ్యోతికి వోలె! ॥మనసు॥

సుఖమునై శుద్ధమై సుప్రకాశంబునై
నిత్యమై, వ్యాప్తమై, నిర్ణయింపగరాని
ఆధారమై యఖిల నామ రూపంబులకు
అట్టి పరమాత్మయే అలరి నే ననుచునూ! ॥మనసు॥

మనసు మాలిన్యమును మానుగా దొలగించి
అడ్డు తెరలను మాపి అమల భాస్కరుని వలె
భాసించు నా పరమాత్మ దర్శనమునను
కిరణముగ కలిసిపో! వర దివ్య జ్యోతితో!

మనసు స్వభావ మది మానుగా నశ్వరము
అస్థిరంబనుచు నీ వలరి తెలియగ వలయు!

కర్తనని భావించి

కర్తనని భావించి గర్వమున వర్తించి
తా జేయు పనులన్ని తా జేయుచుంటినని!

మిడిసిపడు వాడతడు వడి పరుగు లెత్తుచును
క్రిందబడు వానితో చందముగ సమ మతడు

కర్తనని భావించి గర్వమున వర్తించి
తా జేయు పనులన్ని తా జేయుచుంటినని!

భగవంతు డొక్కడే బరగ కర్మలుజేయ
ప్రోత్సాహమును జేయు బూనికను సర్వులను!
ఎవరెవరు ఏపనులు జేయవలెనో వాని
ముందుగానే నిర్ణయించి ధర బంపునూ! ॥కర్తనని॥

ఇష్టమున్నను లేక యిష్టమును లేకున్న
అట్టి పనులను జేయ వలె నందఱును గూడ!
సూత్రధారుడు దెలుపు సూత్రానుసారముగ
నటులవలె నాట్యమున నటియించు వారలును! ॥కర్తనని॥

తా కర్త ననుకొనక తనిరి నిష్కామముగ
నిష్కల్మషముగనూ నిరవధికముగ కర్మ
చెయుచే ఫలితమును శ్రీహరికి వర్పించి
మౌనముగ నుండుటే మౌని కర్తవ్యమును!

కర్మ యోగమునందు కాంక్షతో పరమాత్మ
భక్తుడగు పార్థునికి బరగ బోధించినది!
నిష్కామ యోగమున నిలిచి కర్మల నన్ని
జేయవలెనని బలికె శ్రీపరంధాముడును!

## భ్రమ బడుచు నున్నావు!

భ్రమ బడుచునున్నావు! బన్నుగా నీ గురువు
ఎచటనో యుండెనని అచటచట గనుచూ!

నీతోనె గలడతడు నిజము బరిశీలింప
నీ యాత్మయే గురువు నిజ భాస్కరుని వోలె!

భ్రమబడుచు నున్నావు! బన్నుగా నీ గురువు
ఎచటనో యుండెనని అచటచట గనుచూ!

ఒకరు నొక వస్తువును వన్నెలను చిన్నెలను
వేరొక్కరికి జూపి విశదబఱచిన యటుల
జూపింపలేము గద! సురుచిరంబగు ఆత్మ!
వరమాత్మ రూపమును బరగ విశ్వాత్మనూ! ॥భ్రమ॥

ఆది మధ్యాంతమును నంతటను విండివది!
భాస్వంతమైనదీ బరగ కనరానిదీ!
యోగులకు ధ్యానులకు బాగుగా గనబడుచు
దర్శనం బిచ్చునది! ధన్యులను జేయునది! ॥భ్రమ॥

ఏ రూపమున జూడ యా రూపమున నుండు!
ఎటుల ధ్యానింపగా నటుల భాసించునూ!
అణువణువు నతడేను! ఆలరు తారలు గూడ
పశుపక్షి సంతతియును బరగ లతలును దరులు!

నీలోని గురువునూ నిండుగా దర్శించి
సర్వమును నందుకొను సద్గురువుగా దలచి
లేనిదేదియు లేదు! లేశమును నతనికద
పరిపూర్ణ భాస్వరము! బరగ చింతామణీ!

# గురువునే బ్రహ్మ యని

గురువునే బ్రహ్మ యని గురువునే విష్ణువని
గురువునే యీశ్వరుం డనుచు బలుకుదురూ!

ఆ గురువునే పరబ్రహ్మయని బలుకుదురు
అట్టి గురువుకు నమస్కార శతములునూ!

గురువునే బ్రహ్మ యని గురువునే విష్ణువని
గురువునే యీశ్వరుం డనుచు బలుకుదురూ!

అట్టి గురు సాంగత్య మాచార్య సంపదలు
బాహ్యాంతరంబులుఁగ బన్నుగా నుండునూ!
బాహ్యగురువెవ్వరో ఆచార్యు డుండునూ!
లోగురువు ఆత్మయే లోలతను విలసిల్లు! ॥గురువునే॥

బాహ్యగురు వెల్లపుడు బరగ వీ మనసుమా
లోపలికినెట్టునూ తోలతను విశదముగ!
కనరాని లోగురువు కమనీయమగు ఆత్మ
మనసు హృదయమునకును మానుగా లాగికొమ! ॥గురువునే॥

బాహ్యగురువును మఱియు లోగురువులను దలచి
గారవంబుగ వారి గతి యనుసరింపవలె!
వారు దెలిపెడి త్రోవ బరగ మహనీయములు
ముక్తి దెలిపెడి త్రోవ మునులు తెలిపిన దారి!

గురువునే బ్రహ్మయని గురువునే విష్ణువని
గురువునే యీశ్వరుండనుచు బలుకుదురూ!

## మనసు నిశ్చలముగా

మనసు నిశ్చలముగా మానుగా నుండుటకు
ఏకాంతవాసమే యేక లక్ష్యముగా!

కాఱడవులకు బోయి కఠిన తపములుజేసి
వనములను పర్ణకుటులందు వాసమునూ!

మనసు నిశ్చలముగా మానుగా నుండుటకు
ఏకాంతవాసమే యేక లక్ష్యముగా!

విజన స్థలంబులను విలసితంబుగ జేరి
తపసు యోగంబులను తన్మయంబుగ జేయ!
మనసు నిశ్చలమగున? మఱి మునుల జూడమే!
అణగారిపోవునా? అట మునుల జూడమే! ॥మనసు॥

కాఱడవులకు బోయి కఠిన తపములు జేయ
కాంతారములనుండి కన గొనగ యీశ్వరుని!
నమ్మరాదీ మనసు వమ్ము జేయును దపము
తలవంచు కొనలేద! తాపసులు కొంద రట! ॥మనసు॥

అభ్యాసమున గదా! ఆ మనసు లొంగునూ!
కుటిలమగు చింతనల గూడకను చేరకను!
నిశ్చలంబగు దీప శిఖ వోలె భాసిల్లు
అభ్యాసమే గూర్చు అలరు పద్మము భాతి!

మనసు నిశ్చలముగా మానుగా నుండుటకు
ఏకాంత వాసమే యేక లక్ష్యముగా!

## దీక్షలలో కెల్ల

దీక్షలలో కెల్ల దీరుగా మౌనమే
ఉత్తమంబనుచు ముని సత్తముల బలుకూ!

పరివర్తనము దెచ్చు బరగ వైరుల గూడ
మిత్రులను జేయుచూ శాత్రవుల సంధించు!

దీక్షలలో కెల్ల దీరుగా మౌనమే
ఉత్తమంబనుచు ముని సత్త్వముల బలుకూ!

మౌన ధారణవలన మహనీయ శక్తులను
సాధింప వచ్చునని సజ్జనులు బలుకుదురు!
వ్యర్థమగు పలుకులను శుద్ధముగ హరియించి
సద్ధర్మ పథములకు సంచరింపగ జేయు! ॥దీక్షలలో॥

వాదోపవాదములు నలనొప్ప చర్చలును
ఆదియుండదు! వాని కంతమును నుండదూ!
మౌనమే శత్రువుల మాధుర్యమున దేల్చి
పరమ మిత్రులనుగా భావింప జేయునూ! ॥దీక్షలలో॥

మౌన ధారణముననూ మహనీయ యోచనలు
మనసునందున దోచు మాణిక్య మాలవలె!
కలహములు నశియించు కాంతిరేఖలు విరియు
మనసునందున జ్యోతి మానుగా గనగలము!

సజ్జనులు జగమందు సహజముగ మౌనముగ
చరియించుచుందురూ శాంతమున జగమందు!
సూర్యచంద్రులు వసుధ సురుచిరంబగు తరులు
సంధ్యకాంతులు మరియు వింధ్యాది గిరులునూ
మౌనులకువలె వారు మాటాడకుందురూ
చిఱునవ్వు లెప్పుడును జిందించుచుందురూ!

## దేహాత్మ బుద్ధినీ

దేహాత్మ బుద్ధినీ దీరుగా త్యజియించి
విశ్వాత్మ బుద్ధితో విలసిల్లువాడే!

ఆతడే జ్ఞానియని యఖిల లోకమునందు
గారవింతురు నతని కమనీయముగనూ!

దేహాత్మ బుద్ధినీ దీరుగా త్యజియించి
విశ్వాత్మ బుద్ధితో విలఫిల్లువాడే!

కర్మలన్నియు జ్ఞాని సర్వాత్మ కర్పించి
నిష్కామముగ పనులు నిరతమును జేయునూ!
కర్తృత్వమును లేదు కర్మలును లే వతడు
చేయుచుండును బనులు శ్రీహరిని దలచుచును! ॥దేహాత్మ॥

అజ్ఞాని జ్ఞానినీ యల దేహిగా జూచి
అతడు జేసెడి కర్మ లన్నియును గాంచీ!
జ్ఞానియే పనిచేయుచున్నవాడని దలచు
అజ్ఞాని మనసునను ఆల దోషమును గ్రమ్ము! ॥దేహాత్మ॥

నిష్కామ యోగమున నిర్వికారంబునను
పనిచేయు జ్ఞానినీ బరగ తెలియడు గదా!
తనవోలె నాతనిని కర్మిష్ఠిగా దలచు
దేహాత్మ బుద్ధిగా దీరుగా భావించు!

దేహాత్మ బుద్ధినీ దీరుగా త్యజియించి
విశ్వాత్మ బుద్ధితో విలసిల్లువాడే!

## జ్ఞాని నిశ్చలముగా

జ్ఞాని నిశ్చలముగా గనిపించినను గూడ
ఆ నిశ్చలత వెనుక యతి తీవ్రమైనా!

కర్మ శీలత మఱి క్రియా శీలతలునూ!
గలిగి యున్నటులుగా గనలే రమాయకులు!

జ్ఞాని నిశ్చలముగా గనిపించినను గూడ
ఆనిశ్చలత వెనుక యతి తీవ్రమైనా!

నిశ్చలముగా నున్న జ్ఞానయోగుల గాంచి
సామాన్యమానవులు సహజముగ మదియందు
భ్రమియింత్రు వారలను జడులుగా స్తబ్ధులుగ
మూగివారలనుగా మోహ మానసమందు ॥జ్ఞాని॥

అతివేగముగ దిరుగు అల బొంగరము గాంచి
నిశ్చలంబుగ నున్న దని మదిని భావింత్రు!
దాని వేగము కనులు దగయందుకొనలేక
తిరుగుచూ నున్నదని దెలియ జాలరుగా! ॥జ్ఞాని॥

పోవుచున్నట్టి యా పొగబండిలో జనులు
తాము నిశ్చలముగా నున్నట్లు భావింత్రు!
ముందు వస్తువులన్ని వెనుకకును బోవునటు
భ్రమియించు చుండెదరు బలు యమాయకులునూ!

ఆ విధముగా జ్ఞాని యగుపింప నిశ్చలత
కర్మహీనుండనియు మర్మముగ తలపోసి
ఆ నిశ్చలత వెనుక అల క్రియా శీలతలు
కనలేరుగద కర్మగతి క్రియా హీనులును!

## పులి నోట బడినదీ

పులినోట బడినదీ పొలుపుగా దప్పింప
సాధ్యమైనది కాదొ! సహజముగ కొండశిల!

నోటక్రమింగిన జీవి లోలతను బయటపడి
తప్పించుకొనలేదొ తథ్యముగ నావిధము!

పులినోట బడినదీ పొలుపుగా తప్పింప
సాధ్యమైనదికాదొ సహజముగ కొండశిల!

అటులనే సద్గురువు నలరు వాత్సల్యమును
ఆదరానుగ్రహము నా గురుని దృష్టిలో!
ఒకసారి బడిన యాకూర్మి శిష్యుడు మరల
లోక విషయములందు లోలతను నికరాడు! ॥పులినోట॥

గురువునే భావించి గురువునే పూజించి
కూర్మి శిష్యులునైరి కుంభినీ తలమందు!
గురుపూజ చేతనే కూర్మి ప్రతిభను బొంది
అవతార పురుషులై అలరారి రీ వసుధ! ॥పులినోట॥

బాహ్యగురువును ముందు భావించి దైవముగ
పూజింపవలెగదా! పురుషార్థములు బొంద!
తదుపరిని లోగురువు ఆత్మనూ పూజించి
ఆముష్మికముగ శాంతి నందవలె మానవుడు!

పులినోటబడినదీ పొలుపుగా దప్పింప
సాధ్యమైనది కాదొ సహజముగ కొండశిల!

# పదునెన్మి దధ్యాయములను

పదునెన్మి దధ్యాయములను గుర్తెఱిగియును
అభ్యసించుటచేత యలరి చదువుట చేత

పరమాత్మ దర్శనము బరగ బొందగలేరు
ఆత్మసందర్శనము నది దుర్లభముగదా!

పదునెన్మి దధ్యాయములను గుర్తెరిగియును
అభ్యసించుటచేత యలరి చదువుటచేత!

అద్యంతములు లేని యలరు శాశ్వత స్థితియు
అపరిమితమైనట్టి యల విశ్వవ్యాప్తస్థితి!
అఖిల శక్తులకునూ యల పదార్థములకును
ఆధారమగు స్థితియె! అదియె ఆత్మస్థితియు
అట్టి సహజస్థితిని అందుకొని మానవుడు
ఆత్మ సంస్థితుడగుట అదియెగద మార్గమూ! ॥పదు॥

యోగములు ధ్యానములు యొనర జేయగవచ్చు
జప తపంబులగూడ తపియింప వచ్చునూ!
ఆత్మ సంస్థితమగుట అది బహుళ కష్టమూ!
కొందరే మునివరులు కూర్మి దర్శించిరీ! ॥పదు॥

భాస్వదంతర్జ్యోతి బరగ యది యాత్మయని
మునులు జెప్పిన రీతి మోదముగ గానవలె
ఆ ఆత్మ దర్శింప అలరు ప్రహ్లాదువలె
అఖిల విశ్వమునంత ఆత్మగా గానవలె!

## కోరికలు లేకుండ

కోరికలు లేకుండ కూర్మి యా హరిభక్తి
చేయువాడే గదా! చైతన్య భావకుడు!

అతనిలో గలియగా ఆ యాత్మలో గలియ
భావించువాడు గద! పరమ పుణ్యాత్మకుడు!

కోరికలు లేకుండ కూర్మి యా హరిభక్తి
చేయువాడే గదా! చైతన్య భావకుడు

బరగ జపతపములకు బన్నుగా వ్రతములకు
ప్రతిఫలముగా గోరు బరగ ధనధాన్యములు!
ఐశ్వర్యమును గోరు అందాల భవనములు
ఉన్నతంబగ పదవు లుత్కృష్ట గౌరవము! ॥కోరికలు॥

పుణ్యకర్మల ఫలము పొసగ ప్రతిఫలములును
సరిసమానము గాగ సరసతను బొందెడిని!
కర్పూరమును పోలె గఱగగా నంతయును
మొదటి కొచ్చును దాని మొండి జీవితమునూ! ॥కోరికలు॥

అందుకే కోరికల యలరి యాచింపకను
పరిపూర్ణ భక్తితో బరగ శివు పూజించి!
ఆత్మతో లీనమై అలరిపోవుట ఘనము!
చక్రవర్తియు గూడ సమము గా డాతనికి

కోరికలు లేకుండ కూర్మి యా హరిభక్తి
చేయువా డే గదా! చైతన్య భావకుడు!

## నిర్వాణ మనియెడి

నిర్వాణ మనియెడి నిఖిల మందు లయించు
పరిపూర్ణ స్థితియందు బరగ నా యోగీ!

విషయమును విషయి యను నా రెండు భావములు
లుప్తమైపోవునూ ప్రాప్తమై జ్ఞానమును!

నిర్వాణ మనియెడి నిఖిలమందు లయించు
పరిపూర్ణ స్థితియందు బరగ నా యోగీ!

చూచుటయు లేదు మఱి నూటిగా విషయమును
తెలిసికొనుటయు లేదు! తేటతెల్లముగా!
పై రెండు విషయములు బరికించి చూడగా
మనసునకు జెందినా మానసిక వృత్తులే! ॥నిర్వాణ॥

నిర్వాణ పరిధిలో ఆత్మ సాన్నిధ్యమున
భక్తిలో పూర్ణమై భావ సాన్నిధ్యమున!
తానుంటి ననియెడి తరగని విశుద్ధమును
ఆనంద చైతన్య మఖిల మందున తాను
నుంటినని దెలియు మఱి కంటి కగపడదేమి! ॥నిర్వా॥

అట్టి చైతన్యమును నలరి పొందగ యోగి
జప మంత్ర స్తోత్రముల చరియించు తపసులను
ఆత్మ చైతన్యమును అలరి జాగృతి నంది
నిర్వాణ పథమందు నిశ్చితంబుగ జేరు!

నిర్వాణ మనియెడి నిఖిలమందు లయించు
పరిపూర్ణ స్థితియందు బరగ నా యోగీ!

## పుడమిలో నందటికి

పుడమిలో నందటికి పుణ్యపురుషులకునూ
స్వర్గమును నరకమును పూర్వజన్మమునూ!

ఆతి రహస్యములైన యోగుహ్యముల దెలియ
ఆరాటమేగాని యాత్మ దెలియరుగా!

పుడమిలో నందటికి పుణ్యపురుషులకునూ
స్వర్గమును నరకమును పూర్వజన్మమునూ!

దేహాత్మ బుద్ధితో దిశలు గాంతురుగాని
విశ్వాత్మ బుద్ధితో విమలతను గనరూ!
ఆద్యంతములు లేని యల నిరంతరమైన
శాశ్వతానందమని స్థిరరూపమని గనరు! ॥పుడమిలో॥

ఆత్మ కంటే అనగ తాను కంటే వేఱు
నిత్య ప్రత్యక్షానుభవ సిద్ధమైనదియు!
అట్టిది మహాసత్య మింకొకటి లేదనుచు
దెలియు వివేకంబు దేటగా నుండదూ! ॥పుడమిలో॥

కర్మపథమందునను కాంతిరేఖకు వోలె
ఆత్మదోచుచు నుండు నది గనగ మానవుడు
యత్నింపవలె దాని రత్నముగ శోధించి
ఆత్మయే పరమాత్మ యని మదిని భావించి!

పుడమిలో నందటికి పుణ్యపురుషులకునూ!
స్వర్గమును నరకమును పూర్వజన్మమునూ!

## నిజ జీవితము నందు

నిజ జీవితమునందు నీదు కర్తవ్యమును
అల నిర్వహించుటే యలరు శ్రద్ధా భక్తి!

భగవంతునికి నీవు భక్తితో జేసేటి
ప్రణతులని భావింపు భవ్యమగు పూజయని!

నిజ జీవితమునందు నీదు కర్తవ్యమును
అల నిర్వహించుటే యలరు శ్రద్ధా భక్తి!

పనులుజేయగ వలెను బరిశుద్ధమగు విధిని
విభుని కంకితముగా వేగ నర్పింపవలె!
ఫలిత మాసింపకను భవ్యమగు యా పనులు
నిష్కామకర్మతో నిరతమును జేయవలె! ॥నిజ॥

యజ్ఞ యాగాదులును సుజ్ఞాన కీర్తనలు
స్తోత్ర జపమంత్రములు సూటిగా తపసులును!
ఫలితమాసింపకను ఫలమునూ గోరకను
మా మహా జ్యోతికిని నర్పింపగా వలయు! ॥నిజ॥

లోకమంతయు విభుని లీలగా భావించి
ఆతడే ఆత్మయని అలరి మది నూహించి!
సంపూర్ణ భావమున సరసతను ఆత్మలో
కలిసిపోవుట ఫలము కాంక్షించి మనసులో!

నిజ జీవితము నందు నీదు కర్తవ్యమును
అల నిర్వహించుటే యలరు శ్రద్ధాభక్తి!

## కామ క్రోధాదులను

కామ క్రోధాదులను గడకు ద్రోయగవలెను
వానినుండీ ముక్తి వనర ముఖ్యము మనకు!

అట్టి పనిజేసినట్లయిన దక్కిన వన్ని
సాధించినట్లుగా సరసతను భావింపు!

కామ క్రోధాదులను గడకు ద్రోయగ వలెను
వాని నుండీ ముక్తి వనర ముఖ్యము మనకు!

కామ మనగా కోర్కె గంతుజీమకు మల్లె
మనసులో జన్మించు మనసంత వ్యాప్తమై!
విషసర్పమైనదియు వేయి పడగల తోని
కాటువేయును మనను కఠిన మగు విషజ్వాల ॥కామ॥

క్రోధమన కోపాగ్ని కొఱవివలె కన్నులను
రగులుచుండును యెపుడు పొగులుచును నుంతునూ!
పొగలు సెగలుగ మారి భూరి జ్వాలలు నగుచు
తనను తన వారినీ దగ్ధ మొనరించునూ! ॥కామ॥

ఆ రెండిటిని మనము నదుపులో నుంపవలె
దూరముగ నుంపవలె దురిత మిత్రులకు వలె!
కామితార్థములనూ కడకు ద్రోయును వాని
నమ్మగా రాదు సూ! నాట్యకత్తెలు సుమా!

కామ క్రోధాదులను గడకు ద్రోయగ వలెను
వానినుండీ ముక్తి వనర ముఖ్యము మనకు!

## బంధ మోహంబులను

బంధ మోహంబులును బరగ నీ రెండునూ
మనను లోపల బుట్టు మర్మభావములూ!

ఒడ్డునకు బోకుండ యొనర నడిసంద్రాన
ముంచి తేల్చుచు నుండు మూఢులగు వారలను!

బంధమోహంబులును బరగ నీ రెండునూ
మనసులోపల బుట్టు మర్మ భావములూ!

అట్టి భావములనూ యలరి పెంచిన యెడల
నరకమే గతి మనకు నైరాశ్యమే శరణు!
బంధ మోహములనూ బరగ నదిలిన వ్యక్తి
మోక్షమందును నతడు మునుల కోవకు జెందు! ॥బంధ॥

బంధములు లేనివాడే జ్ఞాని యనబడును
బంధ విముక్తియే బరగ జ్ఞాన మటంచు!
మునులచే జెప్పబడె మోదమున కావునను
అట్టిబంధము పదిలి, యిట్టె జ్ఞానమునందు! ॥బంధ॥

సర్వకాలములందు సద్గురుని కృపనలన
మఱవురానీ యెఱుక మఱి నిత్యశాశ్వతము!
అదియె సర్వస్వమని యలరి భావించెదరు
బంధమోహంబులను బరగ త్యజియించెదరు!

బంధ మోహంబులును బరగ నీరెండునూ
మనసులోపల బుట్టు మర్మభావములూ!

## చిత్త చంచలతయునూ!

చిత్త చంచలతయును చిత్త వృత్తియులేని
యునికియే నీ యునికి యోచింప మదినీ!

శాంతి మన సహజమగు స్థిరశాంతి ఆత్మయని
సాధింపగా వలయు సద్గురుని సాయమున!

చిత్త చంచలతయును చిత్త వృత్తియు లేని
ఉనికియే నీ యునికి యోచింప మదినీ!

శాంతి సాధించుటకు స్థిరమైన మౌనమును
అభ్యాస వైరాగ్యములను అలవరచుకొని
వానికా సాధనోపాయముల జేసికొని
ఆత్మ సహజస్థితిని అందుకోవలెను సుమ! ॥చిత్త॥

మాటాడు చుండెపుడు మౌనముగ నుండదూ
యోచించుచుండెపుడు యోర్మితో నుండదూ!
అందుకే అభ్యాస వైరాగ్యముల తోని
అట్టి మనసును నిలిపి ఆత్మలో జేర్పవలె! ॥చిత్త॥

పరమార్థమయే ఆత్మ బరగ ప్రతియణు వణువు
ఆ జ్యోతి కిరణములు అలరియున్నవి గనగ!
విశ్వాత్మ బుద్ధితో విలసిల్లు మానవుడు
పూర్ణకుంభమురీతి పొలుపుగా నతడుండు!

చిత్త చంచలతయును చిత్తవృత్తులులేని
ఉనికియే నీ యునికి యోచింప మదినీ
శాంతి మన సహజమగు స్థిరశాంతి ఆత్మయది
సాధింపగావలయు సద్గురునీ సాయమున!

## 'నీది' 'నాదీ' యనెడి

'నీది' 'నాదీ' యనెడి నిరతమును నుచ్చులను
తగిలికొని యున్నంత కాలమును నరుడూ!

మహనీయమగు నాత్మ మానితంబగు జ్యోతి
తెలిసికొనలేడుగా దేట తెల్లముగా!

'నీది' 'నాదీ' యనెడి నిరతమును నుచ్చులను
తగిలికొని యున్నంత కాలమును నరుడూ!

దేహాత్మ బుద్ధినీ దీరుగా త్యజియించి
విశ్వాత్మబుద్ధినీ విమలతను నొందీ!
అణువణువు నా పరమాత్మయే యని దలచి
నిష్కామ కర్మతో నిర్వహించును పనులు!

అట్టి లోకేశ్వరుని యాపరంధామునీ
ఆత్మయని తెలిసికొని యలరి వెన్వెంటనే!
నాది నీదని దలచు నేను నీవని దలచు
సర్వమొక్కటి యనుచు సాక్షాత్కరించుకొను!

అభ్యాస వైరాగ్యములును గావలయునూ
అలరు సద్గురుబోధ యందజేయగ వలెంచు!
లో గురుపు బోధనలను లోలతనువందవలె!
ఆత్మ సంస్థితుడునై అలరారుచుండవలె!

నీది నాదీ యనెడి నిరతమును నుచ్చులను
తగిలికొని యున్నంత కాలమును నరుడూ!

## నీవె నా తల్లియును

నీవె నా తల్లియును నీవె నా తండ్రియును
నీవె నా సఖుడవు నీవె బంధువునూ!

నీవె నా సర్వస్వ మనుచు జేసెడి వినతి
'నీవె' 'నే' నని తుదను ముగియింపు ప్రార్థనను!

నీవె నా తల్లియును నీవె నా తండ్రియును
నీవె నా సఖుడవును నీవె బంధువునూ!

స్తోత్ర మంత్ర జపాది సూటిగా ప్రార్థనను
ముగియింపు సమయమున మోదమున నీశుతో!
'నీవె' 'నే' ననుచునూ నిర్మలాంతఃకరణ
ఆత్మార్పణముతోని యలరి ముగియింపుమా! ॥నీవె॥

దేహాత్మ బుద్ధితో తెలిసికొనలేవు గద!
ఆత్మరూపము యేదొ! యలరి తా నెవ్వరో!
విశ్వాత్మ బుద్ధితో వికసింప తదుపరిని
అఖిలమంతా యొకటి యని తాను భావించు! ॥నీవె॥

తలిదండ్రి సఖులునూ సర్వమొక్కటి యనుచు
ఆత్మభావముతోని యలరు నా మానవుడు!
తుదకు పరమాత్మకూ చాయ యని భావించు
వేఱుగా తలపడూ విమలాత్మ తానునూ!
ఆ యాత్మ జ్యోతితో అలరేటి కిరణమని!

నీవె నా తల్లియును నీవె నా తండ్రియును
నీవె నా సఖుడవును నీవె బంధువునూ!

## మదిలోని చింతనలు

మదిలోని చింతనలు మానస వికారములు
పూర్వసంస్కారముల పొందినా ఫలములూ!

కలవరపు బ్రతుకులో కలత నలతలు బొంది
గమ్యమును లేనట్టి కథయౌనుగా బ్రదుకు!

మదితోని చింతనలు మానస వికారములు
పూర్వ సంస్కారముల పొందినా ఫలములూ!

మనసు ఆత్మను బొంది మాణిక్యమైనపుడు
దివ్యాత్మతో తాను దీపమైనప్పుడును!
కలవరము లుండవూ గమ్యమును స్పష్టమగు
అంతరిక్షము తార అగుపడెడి రీతిగా! ॥మది॥

ఆత్మలో లీనమై యలరారుటకు గాను
తనను దా తెలిసికొని తన్మయంబుగ తాను!
సాధింపగా వలెను సవ్యమగు ధ్యానమును
పరమాత్మ చింతనను భవ్యమగు వేదనను! ॥మది॥

ఆ ధ్యాన చింతనలు నలరి గొనిపోవునూ
ఆత్మ సాన్నిధ్యమును ఆత్మ దర్శనమునకు!
ఆత్మతో లీనమైనట్టి మానవునకును!
కలవరము జెందడూ కాంతి లేఖను జేరు!

మదితోని చింతనలు మానస వికారములు
పూర్వ సంస్కారముల బొందినా ఫలుములూ!

## సాధు సాన్నిధ్యమును

సాదు సాన్నిధ్యమును సకలమును ప్రాప్తించు
సుజన సాంగత్యమున నూటిగా మనకూ!

సకలమును ప్రాప్తించు సర్వమును సిద్ధించు
పెకూ్పాచి జూపించు దీప లేఖకు వోలె

సాదు సాన్నిధ్యమున సకలమును ప్రాప్తించు
సుజన సాంగత్యమున నూటిగా మనకూ!

సాధు సాంగత్యమును సమకూడు నపుడు నిక
సాధనా మార్గముల చరియింప నేలా?
మలయ మారుతములల మాధుర్యమును జింద
విసనకర్రలు యేల? వింజామరంబులును? ॥సాధు॥

చంద్రునీ వెన్నెలలు సాంద్ర తాపము మాన్ప
కల్ప వృక్షము వలన కదులు దీనత్వమును!
సకల కల్మషములును స్వర్గంగచే బోవు
సుజన సాంగత్యమున నూటిగా పై మూడు
నిర్మూలనంబగును నిశ్చయంబుగ ధరణి! ॥సాధు॥

సుజన సాంగత్యమే నూటిగా జనులకును
సకలార్ధ సాధనము సమకూర్చు బనులందు!
మంచి మార్గము జూపు మరియాద ఘటియించు
నీతి బోధను జేసి నిర్మలత్వము జూపు!

సాదు సాన్నిధ్యమును సకలమును ప్రాప్తించు
సుజన సాంగత్యమున నూటిగా మనకూ!

# ఆధ్యాత్మికములైన

ఆధ్యాత్మికములైన యలరు సంభవములును
నాశ్చర్యముగ నుండు నతి విచిత్రముగా!

జరుగు పను లచట మఱి జరుగ నతి చిత్రముగ
జరుగనీ కార్యములు జరుగుచుండును లెస్స!

ఆధ్యాత్మికములైన యలరు సంభవములను
నాశ్చర్యముగ నుండు నతి విచిత్రముగా!

మనసుతో నూహించి మహిత కార్యంబులను
జేయగా బూనుకొని జేయ జాలరుగా!
ఊహింపగా రాని యున్నతములగు బనులు
జరిగిపోవుచు నుండు జాలమును లేకుండ! ॥ఆధ్యాత్మి॥

ద్రౌపదీ వస్త్రాపహరణ సమయమునందు
దాక్షిణ్యమును లేక దగ సభను గౌరవులు!
వలువ లూడ్వగ యామె వాసుదేవుని దలప
మాన సంరక్షణము మానుగా జరిగినది! ॥ఆధ్యాత్మి॥

ఆత్మార్పణంబైన యల ద్రౌపదికి నాడు
దేవదేవుని కృపయు ధీరుగా జరిగినది!
సంపూర్ణ శరణాగతియె కారణముగా
దేవదేవుని కృపకు మూలమైనది గదా!

హేతువాదము తర్కమునకు నతీతమై
జరుగుచుండును బనులు జగదీశ్వరుని మాయ!

## ఆనందమును, ప్రేమ

ఆనందమును, ప్రేమ యనునట్టి యీ రెండు
మనసునకు జెందినవి! మనసులో నుండునవి!

బాహ్యమందున లేవు! భౌతికంబులు గావు!
దేహి లోపల నుండు దివ్యమగు క్షేత్రములు!

ఆనందమును ప్రేమ యనునట్టి యీరెండు
మనసునకు జెందినవి! మనసులో నుండునవి!

ఆత్మప్రేమయె ప్రేమ! అవి దెలిసికొను పిదప
అఖిల జీవులయందు నాప్రేమ వర్ధిల్లు
స్త్రీపురుష ప్రేమ లట జేరియుండవుగదా!
సర్వజీవులయందు సహజముగ వర్తిల్లు! ॥ఆనందమును॥

అల మబ్బుగుంపులట యలరి పయనించినటు!
గుంపుగా కోకిలలు గూడిపాడిన యటుల!
సెలయేటి జాలులును జలజలా పాటినటు!
ఆత్మప్రేమయె జలధి నలరు ముత్యాలుగా! ॥ఆనందమును॥

ఆత్మప్రేమయె ప్రేమ యది తెలిసినంతనే
స్త్రీపురుష భేదములు స్థిరముగా మాయమగు
కామ ప్రవృత్తియును కటిగి మాయంబగును!
విశ్వప్రేమ గుణంబు విలసిల్లు నాత్మలో!

ఆనందమును ప్రేమ యనునట్టి యీరెండు
మనసునకు జెందినవి మనసులో నుండునవి!

## స్థితప్రజ్ఞునకు వోలె

స్థితప్రజ్ఞునకు వోలె శ్రీహరిని డలచుచును
శివున కర్పింపవలె చేయు పనులన్నీ

భగవదర్పితముగా దా జేయు కర్మచే
చిత్తశుద్ధియు గలుగు జింతలును నశియించు!

స్థితప్రజ్ఞునకు వోలె శ్రీహరిని దలచుచును
శివుని కర్పింపవలె చేయుపనులన్నీ!

నిష్కామబుద్ధితో నిఖిల కర్మలు జేయు
భగవదర్పిత మనుచు భక్తితో ప్రణమిల్లు!
ఫలిత మాశింపడూ భంగపడ డెప్పుడును
ప్రభు చింతనమునందు బరగ విలసిలుచుండు! ॥స్థిత॥

పరగ కర్మనుజేసి ప్రభవించినప్పుడే
విభుని స్తుతియించుటయు విమలత్వమును గాదు!
ఆస్మరణ నిత్యమును అలరి నిర్విఘ్నముగ
సాగినపుడే కర్మ సాధించు సిద్ధించు! ॥స్థిత॥

స్థితప్రజ్ఞువలె విభుని చింతనను జేయవలె
నిష్కామయోగిగా నిరతమును కర్మలను!
జేయవలె ఫలితమును శివుని కర్పింపవలె
ఫలిత మాశింపకను భక్తియుండగ వలెను!

స్థితప్రజ్ఞునకు వోలె శ్రీహరిని దలచుచును
శివుని కర్పింపవలె చేయు పనులన్నీ!

## తన ఘనత దెలుపగా

తన ఘనత దెలుపగా దన గొప్ప జూపుటకు
పదిమంది ముందఱను బరగ తన సిద్ధులను!

బుద్ధిపూర్వకముగా బొలుపుగా జూపింప
యత్నించు వాడగును కత్తెరను పోకవలె!

తన ఘనత దెలుపగా తన గొప్ప జూపుటకు
పదిమంది ముందఱను బరగ తన సిద్ధులను!

యోగియగు వాడు దా యోగ సిద్ధులచేత
కొన్ని ప్రక్రియలనూ కూర్మి నందగవచ్చు!
అంతమాత్రముజేత నందఱీ ముందఱను
తన గొప్ప జూపుటను దగదు యత్నింపగా! ॥తన॥

అవసరంబుల వేళ యలరి చింతనవేళ
యవమానమును బొందు యవసరంబుల వేళ
తన సిద్ధు లేవియో దగజూపగను వచ్చు
వ్యర్థముగ జూపింప నర్థమగు పనిగాదు! ॥తన॥

అభ్యాసములచేత అలరు ధ్యానము జేత
సాధించినా క్రియలు తనలోనే దాచుకొని!
అవసరంబులవేళ యలరి జూపగవలయు
లోకోపకారమున కుపయోగ బడవలెను!

తన ఘనత దెలుపగా తన గొప్ప జూపుటకు
పదిమంది ముందఱను బరగ తన సిద్ధులను!

# తా ననగ ఆత్మయే

తా ననగ యాత్మయే దగలోక మంతయును
నిండియున్నది గదా! నిఖిల జీవులయందు!

తానుగా నుండినది తగ దేహమే సుమా!
మరణమొందిన పిదప మఱల యగుపింపదూ!

తాననగ యాత్మయే దగ లోకమంతయును
నిండియున్నది గదా! నిఖి౦ జీవులయందు!

తానుండుటయు లేదు దగ రెండు ఆత్మలుగ
ఒక్కటే యాత్మసుమ! యొనర నున్నది తనది!
ఆత్మ దేహములను నరయుటే గూఢముగ
తన స్వస్వరూపమును దగతెలిసికొనుట యది!
ఇట్టి స్థితి నందురూ విమల తన్మయనిష్ఠ! తాననను॥

ఆద్యంతములులేని యమర శాశ్వత స్థితియు
అపరిమితమైనట్టి అల విశ్వవ్యాప్త స్థితి!
ఆకార వికృతము నలరు శక్తులకునూ
ఆధారమైన స్థితి అల సహజమైన స్థితి!
ఆదియె ఆత్మస్థితియు అని మునులు బలుకుదురు! ॥తాననను॥

పాంచభౌతికమైన దేహమును దేహి యని!
అస్థిరము, నశ్వరము ఆలశాశ్వతము గాదు!
తానుగా కొన్నాళ్ళు దగదేహిగా నుండు
మాయమై పోవునూ మఱల జన్మించుటకు!
ప్రారబ్ధ కర్మమును బరగ యనుభవమంద!

జయము, నపజయములును

జయము. నపజయములును జగతిలో సహజములు
కష్టసుఖములుగూడ గలుగునవి నిరతమును!

ప్రారబ్ధ కర్మానుసారముగ ప్రాప్తించు
దైవేచ్ఛితంబులవి దగ జరుగుచుండునూ!

జయము నపజయములును జగతిలో సహజములు
కష్ట సుఖములుగూడ గలుగునవి నిరతమును

ఒక దేహి కేవలము సత్కర్మలను జేయ
అపజయము నందునూ నలరి కష్టములొందు
వేరొకడు దుష్కర్మ లెన్ని జేసిన గూడ
జయమునే బొందునూ దాగరూకతోని! ॥జయము॥

అంతమాత్రముజేత నా యుభయ వ్యక్తులను
సరితూపగా రాదు సారముగ ఫలములను!
ప్రారబ్ధ కర్మానుసారముగ బ్రాప్తించు
దైవేచ్ఛితంబు లవి! దైవ ప్రసాదములు! ॥జయము॥

కాని సంకల్ప శక్తికికావు ఫలములవి
కలగుండు బాధ బడవలసినా పనిలేదు!
విధి ననుసరించి యిటు జరుగుచుండును లీల!
స్వీకరింపగ వలయు స్వీయ కర్మల ఫలము!

జయము నపజయములును జగతితో సహజములు
కష్టసుఖములుగూడ గలుగునవి నిరతమును!

## అహమును ఛేదింప

అహమును ఛేదింప ఆత్మదర్శన మగును
మఱి జన్మయుండదూ మానుగా నాతనికి!

దేహాత్మ బుద్ధియును దీరుగా త్యజియించి
విశ్వాత్మ బుద్ధియును విమలముగ మదిదోచు!

అహమును ఛేదింప ఆత్మదర్శన మగును
మఱిజన్మ యుండదూ మానుగా నాతనికి!

సంస్కారములకు మఱి సంకల్పములు గదా
సహజమగు మూలమని నజ్ఞులు దెలుపుదురు!
అట్టి సంకల్పముల అహము మూలమటంచు
విమల మనస్కులును విమలముగ తెలిపిరీ! ॥అహనుమ॥

కాబట్టి అహమునూ కడద్రోసి దేహమున
దివ్య తేజము నాత్మ తేబరిల్లగ జేయ
జన్మ రహితంబైన స్థితి బొందవచ్చునని
మునులు సిద్ధాంతులును మోదమున బలికిరీ! ॥అహమును॥

దేహాత్మ బుద్ధినీ త్యజియింపవలె ముందు
విశ్వాత్మబుద్ధినీ వేగ పొందగ వలయు!
నిష్కామ కర్మతో నిరతమును కర్మలను
స్థితప్రజ్ఞుడై తాను జేయుచుండగ వలయు!

అహమును ఛేదింప ఆత్మ దర్శనమగును
మఱుజన్మ యుండదూ మానుగా నాతనికి!

## ఆలోచనా రహితమైన

ఆలోచనారహిత మైన మానస స్థితియు
ఒక తలంపున మనసు నేకాగ్రతయునూ!

సాధకుడు నెంతెంత సాధించునో యంత!
ధ్యాన పురోగమనమున బోయినటుల సుమ!

ఆలోచనా రహితమైన మానస స్థితియు
ఒక తలంపున మనసు నేకాగ్రతయునూ!

చింతలును వంతలును జీకాకు బడకుండ
ఆలోచనా రహితమైన మనసు స్థితియునూ
ప్రార్థనా విషయమున బరగ యేకాగ్రతయు
ఎంతెంతగా సాధకుడును సాధించునో
అంతంత ముందునకు అలరిబోయిన యటుల! ॥ఆలోచనా॥

అంతియేగాని మఱి యితర యనుభవమును
లెక్కింప రాదుగా గుర్తింప రాదచట!
మనసు నేకాగ్రతయు, ఆలోచనా రహిత
స్థితియునూ యీరెండు గుర్తుగా భావింపు! ॥ఆలోచనా॥

అల ధ్యాన మార్గమును నలరి యుహించుటకు
పైరెండు మార్గములు పరమ ప్రమాణములు!
అంతకును మించి యా యలరు ధ్యానంబునూ
యూహింప లేరు గద! బాహ్య ప్రపంచమున!
ఆలోచనా రహితమైన మానస స్థితియు
ఒక తలంపని మనసు నేకాగ్రతయునూ!

## సాధనకు సాక్ష్య మిల

సాధనకు లక్ష్య మిల నరసతను సాధింప
అజ్ఞాన తిమిరమును శ్లాంత మొందగ జేయ!

జ్ఞాన సముపార్జనను మనసు సాధింపగా
కాదుగా లక్ష్యమూ కమనీయముగ నిచట!

సాధనకు లక్ష్య మిల సరసతను సాధింప
అజ్ఞాన తిమిరమును అంత మొందగ జేయ!

దేహమును దా నను చు తిమిరమున మునుగుచును
దేహాత్మ బుద్ధితో దిశలు దిదుగుచునున్న
దేహి తను కాదనీ దివ్యాత్మ తా ననుచు
అజ్ఞానమును దేహి అంత మొందింపవలె! ॥సాధనకు॥

ఆత్మలో భాగమని యల దేహి నశియింౕదు
విశ్వాత్మలో తాను విమలమగు కిరణనుని!
స్థితిప్రజ్ఞునకు వోలె చింతనల జేయవలె
ఆత్మ విచారమును నతడు జేయగ వలెను! ॥సాధనకు॥

అజ్ఞానమున నరుడు నంత మొందింపగా
జ్ఞాన జ్యోతియు వెలుగు జ్ఞానోదయం బగును!
తా జేయునదియేమొ దైవచింతన యేమొ!
మనసు జాగృతి యందు మౌనియగు తదుపరిని

అందు కే ముందుగా అజ్ఞానమును మాపి
జ్ఞాన సముపార్జనయు జేయవలె తదుపరిని!

## తాను దేహము ననెడి

తాను దేహము ననెడి దగ మదిని భావమును
అజ్ఞానికివి దేహికిని నుండు జగతీ!

తా ననగ ఆత్మయును దగ శాశ్వతంబునూ
దేహియన కొన్నాళ్ళు దీరుగా నుండునది!

తాను దేహము ననెడి దగ మదిని భావమును
అజ్ఞానికిని దేహికిని నుండు జగతీ!

అజ్ఞాని యగువాడు లలితి తన యాత్మనూ
దేహమునకే పరిమితము జేసికొనుచుండు!
దేహాత్మబుద్ధితో దిరుగుచుండును నతదు
ఆత్మ మహాత్మ్యమును నంరి దెలియగ లేదు! ॥తాను॥

జ్ఞానియగు వా డిలను మనసునను భావించు
ఆత్మ యనంతమని యఖిలమున గలదనుచు!
తన దేహమును గూడ తనయాత్మ భాగమని
దానిలోనే యిమిడి యున్నదని భావించు; ॥తాను॥

ఇరువురికి నిది సుమా వివరింప భేదమును
అజ్ఞాని జ్ఞానులకు అంతరంగము నందు!
ఆత్మ దేహమునకును బరిమితము గావించు!
ఆత్మ యనంతమని యలరు దేహము గూడ
ఇమిడియున్న దటంచు నింపుగా భావించు!

తాను దేహము ననెడి దగ మదిని రావమును
అజానికిని దేహికిని నుండు జగతీ!

## ఎఱుక జ్ఞానం బదియు

ఎఱుక జ్ఞానం బదియు వేదాంత సార మది
ఆత్మ యన బ్రహ్మమును నది తెలిసికొనటయే!

ఆత్మ స్వరూపమును అచ్ఛమగు నెఱుకగా
తెలిసికొనుటయె గదా స్వచ్ఛమగు లక్ష్యమూ!

ఎఱుక జ్ఞానం బదియు వేదాంత సార మది
ఆత్మయన బ్రహ్మమును నది తెలిసికొనుటయే!

సుఖమునై శుద్ధమై సుప్రకాశంబునై
నిత్యమై వ్యాప్తమై నిర్వచింపగరాని!
ఆధారమై యఖిల నామరూపంబులకు
అట్టి పరమాత్మయే యలరి నే నినచునూ! ॥ఎఱుక॥

ఆద్యంతములు లేని యల నిరంతరమైన
శాశ్వతానందమని స్థిర రూపమని దెలియు!
ఆ మహా జ్యోతికిని యలరి దా కిరణమని
భావించు మదియందు భవ్యాత్మ బుద్ధిలో! ॥ఎఱుక॥

ప్రతిక్షణంబుమును గూడ పరమాత్మ యెఱుకయే
ఆత్మ జ్ఞాన మటంచు నల బుధులు బలుకుదుదు!
ఆత్మస్వరూపమును అట్టి యచ్ఛపు యెఱుక
తెలిసికొనుటయె గదా దీరుగా లక్ష్యమూ!

ఎఱుక జ్ఞానం బదియు వేదాంత సారమది
ఆత్మయన బ్రహ్మమును నది తెలిసికొనుటయే!

## ఆ దేవ దేవుడును

ఆ దేపదేవుడును నా నిరంజనుడుమా
నారాధ్యదేవతగ యాత్మయని గనుమా!

ఆ పరమేశ్వరు డా యాత్మకంటెనూ
వేఱుకాదూ కాదు నేకాంత రూపమే!

ఆ దేవ దేవుడును నా నిరంజనుడనూ
నారాధ్య దేవతగ యాత్మయని గనుమా!

స్తోత్ర జప మంత్రముల సూటిగా జపియించు
ఇష్ట దేవతల యా వివిధ రూపములలో
గలుగు యా దైవ సాక్షాత్కారములు గూడ
ఆత్మ సాక్షాత్కార మని మదిని భావింపూ! ॥ఆ దేవ॥

పరమాత్ముడను నతిని పరమ పూరుషు మదిని
ఆత్మగా భావింపు ఆత్మయే నాతడును!
వేఱుగా భావించి వ్యధజెందబోకునూ
ఆత్మయే నాతడును యాతడును ఆత్మయే! ॥ఆ దేవ॥

కనుకనే నీ వెపుడు కర్మపదమున నడిచి
ఆత్మనే దెలిసికొన యలరి యత్నింపుమా!
మంత్ర జప స్తోత్రముల మాధవుని పూజింపు
పరమాత్మ ధ్యానింపు భక్తి ధ్యానములతో!

ఆ దేవ దేవుడుమ నా నిరంజనుడునూ
ఆరాధ్య దేవతగ యాత్మయని గనుమా!

## దుఃఖ నివృత్తికిని

దుఃఖ నివృత్తికిని కష్టముల నివృత్తికిని
రెండు రెండే దారు లిందు గల వనిరీ!

ఆ మార్గముల నడిచి యా దారులను బోవ
కష్ట ఖేద నివృత్తి గలుగునని భావింపు!

దుఃఖ నివృత్తికిని కష్టముల నివృత్తికిని
రెండు రెండే దారు లందు గల వనిరీ!

కష్టములు నెదిరింప దుఃఖముల నెదిరింప
శక్తిలేదని మది విరక్తితో భావింప!
అల గజేంద్రుని వోలె యరచుచును నీశ్వరుని
శరణమును బొందుమా! జాగృతిని బొందుచును! ॥దుఃఖ॥

అటుల కాదని మదిని యలరి భావించుచో
యీ కష్టములకునూ యీ దుఃఖములకునూ!
మూల మేదో యనుచు మోదమున యోచించి
ఆత్మలో లయమగుము! ఆ కష్టములు బాయ! ॥దుఃఖ॥

ఆనంద ఖేదములు నవియు రెండును గూడ
రాత్రి పవళుల వోలె రమ్యచుట్టముల వలె!
వచ్చి పోవుచు నుండు ముచ్చటగ మూన్నాళ్ళు
బట్టించు కొనరాదు! బరగ స్థిత ప్రజ్ఞతను!

దుఃఖ నివృత్తికిని కష్టముల నివృత్తికిని
రెండు రెండే దారు లిందు గల వనిరీ!

## భగవంతు ధ్యానమును

భగవంతు ధ్యానమును బన్నుగ విచారమును
బరగ యీ రెండునూ పరమాత్మ విషయములు!

వేఱు వేఱుగ నుండు వేదాంత విషయములు
సాధకులకే దెలియు తన్మయత నీ నిష్ఠ!

భగవంతు ధ్యానమును బన్నుగ విచారమును
బరగ యీ రెండునూ పరమాత్మ విషయములు!

ఒక్క విషయము నందు మక్కువగ మనసునూ
లగ్నమును జేయుచే అల ధ్యానమని యంద్రు!
స్తోత్ర మంత్ర జపాది శోధనల కంటెనూ
ధ్యాన మది యుత్తమము; ధాత్రిలో సాధనకు! ॥భగవంతు॥

అన్ని విషయంబులను నలరుచును వర్జించి
తాను తానుగ నుండి తన్మయత నిష్ఠతో!
నిర్విషయిగా నుండి నిర్మలత్వముతోని
ఆత్మ విచారమున అలరి యుండుట రెండు! ॥భగవంతు॥

సాధకుడు ముందుగా సహజముగ ధ్యానమును
సాధింపగా వలయు సద్గురుని సాయమున!
అటు మీద సాధకుడు నన్నియును వర్జించి
నిర్విషయిగా నుండి నిఖిలాత్మ గనవలెను!

భగవంతు ధ్యానమును బన్నుగ విచారమును
బరగ యీ రెండునూ పరమాత్మ విషయములు!

## ఆత్మ విచారమును

ఆత్మ విచారమును నాత్మ సాక్షాత్కార
మన రెండు నొక్కటే! యవి వేఱు గావుగా!

సకల జీవులయందు సన్నిహితముగ నున్న
అపురూప జ్యోతియే! ఆ యాత్మ యని యనగ!

ఆత్మ విచారమును నాత్మ సాక్షాత్కార
మవి రెండు నొక్కటే! అవి వేఱు గావుగా!

ఆత్మయన క్రొత్తగా నలరి సంపాదించి
కొని తెచ్చునది కాదు; కొంగు బంగార మది!
నిత్యముగ నున్నదే! నిఖిల జన్మలయందు
కర్మబంధము లందు గలిసియున్నది ఆత్మ! ॥ఆత్మ॥

ఆత్మ దర్శనమునకు నడ్డుగా నున్నట్టి
పూర్వ జన్మల నుండి పొలుపుగా నున్నట్టి
వాసనల తెరలనూ వరుసగా దొలగింప
సాధనల లక్ష్యమూ సరిక్రొత్త దిదికాదు! ॥ఆత్మ॥

ఆత్మ సాక్షాత్కారమును నందినా సుకృతిపి
మఱు జన్మ యుండదూ! మాధుర్యమును జెందు!
అట్టి విశ్వాత్మలో నా దివ్య జ్యోతిలో
దివ్యకిరణము వోలె దీప్తి జెందును నతడు!

ఆత్మ విచారమును నాత్మ సాక్షాత్కార
మవి రెండు నొక్కటే! అవి వేఱు గావుగా!

## మహనీయులగు వారి .

మహనీయులగు వారి మహితాత్ములగు వారి
మధురమగు దృష్టియును మహిమ నెంచగ తరమె?

సందేహమును లేక సకల కల్మషములను
దూరముగ తొలగించు దురితములు హరియించు!

మహనీయులగు వారి మహితాత్ములగు వారి
మధురమగు దృష్టియును మహిమ నెంచగ తరమె?

వాసంతమును రాగ వయ్యారి పూలతలు
పుష్పించు ఘనముగా బూర్ణతర శోభలను!
కోకిలయు బాడుకొను కుహూ కుహూ నాదాల
వనలక్ష్మి కనిపించు వనితలా మన్మధుని! ॥మహనీయ॥

పూర్ణచంద్రుడు రాగ పులకితంబగు ప్రకృతి
పండు వెన్నెలతోని వెండి మతాబులను!
అణువణువు బులకించు నా జ్యోత్స్న కాంతులను
కలువభామలు జేయు కాంతి కృత్యంబులను! ॥మహనీయ॥

సజ్జనులగు వారి సహజ ధర్మంబు లివి
వారి దృష్టియే కదా! వర్షించు కోరికలు!
సకలీప్సితంబులును సహజముగ సిద్ధించు
కమనీయ కోరికలు కల్పవృక్షములుగా!

మహనీయులగువారి మహితాత్ములగువారి
మధురమగు దృష్టియును మహిమ నెంచగ తరమె?

## బంధ హేతువులునూ!

బంధ హేతువులునూ భోగ హేతువులునూ
వాసనలు యని బలికి రాత్మజ్ఞానులుమా!

దూరముగ నుండవలె దుర్నిర్ణయములేక
లొంగిపోవగరాదు బంధముల కతడూ!

బంధ హేతువులునూ భోగ హేతువులునూ
వాసనలు యని బలికి రాత్మజ్ఞానులునూ!

బంధ హేతువులకును భోగ హేతువులకును
లొంగిపోరాదు సూ లోలత్వమును గూడి!
భవ్యాత్మ సిద్ధికిని ప్రతిబంధకములు నవి
అజ్ఞానులకును మఱి జ్ఞానులకు నిలనూ! ॥బంధ॥

అట్టి వాసనలునూ యలరి యడ్డుగ నిలిచి
పులకించుచును నుండు పూర్ణిమా శశివోలె!
గంధర్వ కాంతలా కమ్మనీ నృత్యముల
వాసనలలో ముంప వన్నెలను జూపించు! ॥బంధ॥

ఆత్మజ్ఞాన సుసిద్ధి అలరి గలిగిన యపుడు
అట్టివాసనలునూ అట్టి హేతువులునూ!
వాటియంతట యవే వన్నెలను మార్చుకొని
భస్మమై పోవునూ బరగ మన్మధుని వలె!

బంధ హేతువులునూ భోగ హేతువులునూ
వాసనలు యని బలికి రాత్మ జ్ఞానులునూ!

## నామ రూపములచే

నామ రూపములచే నవ్యాను రూపమున
ఆభరణములు విపణి యగుబడుచు నుండునూ!

సకల వస్తువులలో సవ్యముగ బరికింప
అసలువస్తువు జూడ యలరు బంగారమే!

నామ రూపములచే నవ్యాను రూపమున
ఆభరణములు విపణి యగుబడుచు నుండునూ!

ఎందరో మానవులు ఎన్నియో నామములు
ఎన్నియో రూపములు వన్నె లెన్నున్నా
అందఱిలో నున్న అసలు వస్తువు జూడ
అసలు వస్తువు శుద్ధ చైతన్యమొక్కటే! ॥నామ॥

శుద్ధ చైతన్యమే సూటిగా యాత్మయని
సకల జీవులయందు సహజముగ యున్నదని
శాశ్వతము స్థిరము అని సకల మందున గూడి
నిండియున్నది యనుచు పండితులు బలికిరీ! ॥నామ॥

సకల లోకమునందు చరియించు జీవులను
శుద్ధచైతన్యమగు సుందరంబగు ఆత్మ
అలరారు చున్నదని అలరి మదిగ్రయింపు
అణువణువు నిండినా ఆయాత్మ పరమాత్మ!

నామ రూపములచే నవ్యాను రూపమున
ఆభరణములు విపణి యగుబడుచు నుండునూ!

## విశ్వమంతటి లోను

విశ్వమంతటిలోను విమలమగు నీలోను
ఒక్కటే వస్తువది నిక్కమగు నాత్మా!

అంతరంగమునందు నహమునూ ద్యజియించి
పరికింప గోచరించెడి దాత్మయే సుమా!

విశ్వమంతటి లోను విమలమగు నీలోను!
ఒక్కటే వస్తువది నిక్కమగు నాత్మా!

సుఖమునై శుద్ధమై స్వప్రకాశంబునై
నిత్యమై వ్యాప్తమై నిర్వచింపగరాని!
ఆధారమై యఖిల నామ రూపంబులకు
అట్టి పరమాత్మయే యలరి నేననుచునూ! ॥విశ్వ॥

ఆద్యంతములు లేని యల విరంతరమైన
శాశ్వతానందమని స్థిరరూపమని దెలియు!
ఆ మహా జ్యోతికిని యలరి దా కిరణమని
భావింపు మదియందు భవ్యాత్మ బుద్ధితో! ॥విశ్వ॥

ఆత్మసాక్షాత్కార మందుకొన సాధకుడు
జపమంత్ర స్తోత్రముల జాగృతిని జేయవలె
ధ్యాన చింతనములును ధార్మికంబగు భక్తి
ఆత్మ విచారణయె! అది ముఖ్యమార్గమూ!

విశ్వ మంతటిలోను విమలముగ నీలోను
ఒక్కటే వస్తువది నిక్కముగ ఆత్మా!

## లోక చింతన మాని

లోకచింతన మాని లోలత్వమును వదిలి
ఆత్మ చింతనయందు నలరి వర్తింపుమా!

శాంతి మన సహజమగు కాంతి స్థితి యని దెలియు
అదియె ఆత్మస్థితియు యని మదిని భావింపు!

లోకచింతనమాని లోలత్వమును వదిలి
ఆత్మచింతన యందు నలరి వర్తింపుమా!

అట్టి మన సహజమగు నలరు స్థితి నందగా
ఆత్మ సాక్షాత్కారముల ప్రీతి నందగా!
ధ్యాన వైరాగ్యములు దగ చింతనాభ్యాస
ములను సాధనములుగ మోదమున గైకొనీ! ॥లోక॥

అభ్యాస వైరాగ్యముల దీక్ష గైకొనుచు
సాధుమార్గములందు సరసతను బయవించి!
మహనీయమగు సహజ మార్గమున నడుచుచును
ఆత్మ సాక్షాత్కార మందవలె సాధకుడు! ॥లోక॥

అభ్యాస ధ్యానముల యలరేటి సమయమున
తారవలె తనముందు దగ నాత్మ నుంచుకొని!
ధ్యానసమాధిలో దగనైక్య మొందవలె!
శాంతి సమాధిలో కాంతి హృది నిలుపవలె!

లోకచింతన మాని లోలత్వమును నొదిలి
ఆత్మచింతన యందు నలరి వర్తింపుమా!

## సన్యాసి వేషమును

సన్యాసి వేషమును సరసముగ ధరియింప
సన్యాసి కాబోడు సహజముగ యిలనూ!

విభూతి రేఖలను విమలముగ ధరియింప
యోగి కానేరడూ యోగ్యతను నిలనూ!

సన్యాసి వేషమును సహజముగ ధరియింప
సన్యాసి కాబోడు సహజముగ యిలనూ!

నేను సన్యాసినని నిజముగా నలుగురికి
జెప్పుకొనువాడునూ స్థిరముగా నాతడును!
తాను సన్యాసినని తన మనసులో తాను
భావించు వాడునూ పరగ యోగియుగాడు! ॥సన్యాసి॥

నేను గృహస్థునని నిజముగా మనసులో
భావింపనీ వాడు బరగ యా గృహస్థు
నిజమైన సన్యాసి నిజమైన యోగిగా
భావింపవలె మనము బరమ విష్ఠాత్ముగా! ॥సన్యాసి॥

పరమ గృహస్థుగా బరగ కనిపించినా
స్థితప్రజ్ఞువలె తాను జీవితము గడుపునూ!
వేషభాషలు ముఖ్యములుగావు ధాత్రిలో
ఆలరు యోగ్యతలు లతని నైజమును దెలుపునూ!

సన్యాసి వేషమును సరసముగ ధరియింప
సన్యాస కాబోడు సహజముగ యిలనూ!

## మనసు సందేహములు

మనసు సందేహములు మది సంశయములునూ
మఱి దీర్చుకొందియును మర్మముగ నపుడూ!

నుఱికొన్ని తలయెత్తు మధురముగ క్రొత్తగా
తీర్చలేనీ సంశయములు, సందేహములు!

మనసు సందేహములు మరి సంశయంబులును
మఱి దీర్చుకొందియును మర్మముగ నపుడూ!

ముడిలేని మాలవలె మొదలు జివలు లేక
సాగిపోవుచు నుండు సందేహ మాలయును
అవలొడ్డును లేని యల సంద్రమును బోలె
సందేహ సంశయంబుల కంతు లేదుగద! ॥మనసు॥

మూలంబునకు బోయి మొరటు సంశయము లిల
ఎవరికోస వటంచు దివిరి ప్రశ్నింపుమా!
ఇంక సందేహములు సంశయంబులు నింక
మనసులో బుట్టవూ! మర్మముగ నడుగవూ! ॥మనసు॥

సందేహములు మఱియు సంశయంబులు గూడ
మనసునకు బుట్టునూ మఱి నాత్మనంటవూ!
మనసు అస్థిరమైన మధుమాస దేనియలు
ఆత్మ సుస్థిరమైన ఆరాధ్య దేవతయు!

మనసు సందేహములు మఱి సంశయంబులును
మఱి దీర్చుకొందియును మర్మముగ నవుతూ!

## మన ప్రవర్తన యెంత

మన ప్రవర్తన యెంత మధురముగ నుండునో
మనకు జరిగే మేలు మఱి దెలుప లేమూ!

కొండంత గౌరవము కూర్మి గలుగును మనకు
మహనీయ సంపదలు మానుగా గలుగునూ!

మన ప్రవర్తన యెంత మధురముగ నుండునో
మనకు జరిగే మేలు మఱి దెలుప లేమూ!

వినయముండిన చాలు విశ్వమంతయు మనకు
వశమౌను నిజముగా వర్ధిలును సంపదలు!
కలహ మన్నదిలేక కమనీయ స్నేహమును
చిరకాల ముండునూ స్థిరముగా నీ జగతి! ॥మన॥

బాలురను వృద్ధులను బరగ స్త్రీలను గూడ
గారవింపగ వలయు కమ్మనీ భాషణల!
సమ వయస్కుల నెపుడు సరసముగ భావించి
అన్న దమ్ముల వోలె యలఱి జూడగ వలయు! ॥మన॥

క్రొత్త వారిని గూడ కూర్మితో స్నేహమున
మాట మాధుర్యమున మన్ననను జేయవలె!
సోదరీమణులుగా సౌహార్ద్రమున స్త్రీల
మధుర భాషల తోని మన్నింపగా వలయు!

మన ప్రవర్తన యెంత మధురముగ నుండునో
మనకు జరిగే మేలు మఱి దెలుప లేమూ!

## ఆత్మ సంశోధింప

ఆత్మ సంశోధింప ఆత్మ బరికింపగా
సమయ మంతయు గడుపు సాధుమార్గమునా!

ఆత్మ విచార సాక్షాత్కారములకునై
యలరి యత్నింపుమా! అహరహము దీక్షతో!

ఆత్మ సంశోధింప యాత్మ బరికింపగా
సమయ మంతయు గడుపు సాధుమార్గమునా!

నిజ జీవితంబునకు నీకు నవసరమైన
నిత్యకృత్యములకై నియత కర్మలకునై!
సమయమును వెచ్చించి సహజముగ నిమిషమును
వ్యర్థమును గాకుండ శుద్ధ సంసారివై
ఆత్మ సంశోధనను నలరి బరికింపుమా! ॥ఆత్మ॥

ఏ పనికి నైననూ, యెవటి కేగినగాని
ఆత్మ సువిచారణను కలరి మరువగ రాదు!
స్థిర ధ్యానమౌనమును చిత్తమున నుండవలె
జలియింప రాదుగా స్థిర చిత్తమును దొలగి! ॥ఆత్మ॥

కాలమును వ్యర్థముగ గడిపివేయగ రాదు!
చోద్యములు గాంచుచును సోమరివి గారాదు!
ఆకాశమున దార లలరి భాసించినటు
నీ యాత్మ జ్యోతియును నిలిచి వెలుగగ వలయు!

ఆత్మ సంశోధింప ఆత్మ బరికింపగా
సమయమంతయు గడుపు సాధు మార్గమునా!

## ఆలోచనా రహితమైన

ఆలోచనా రహితమైన మానస స్థితియు
ఒక తలంపున మనసు నేకాగ్రతయునూ!

సాధకుడు నెంతంత సాధించునో యంత!
ధ్యాన పురోగమనమున బోయినటుల సుమ!

ఆలోచనా రహితమైన మానస స్థితియు
ఒక తలంపున మనసు నేకాగ్రతయునూ!

చింతలును వంతలును జీకాకు బడకుండ
ఆలోచనా రహితమైన మనసు స్థితియునూ
ప్రార్థనా విషయమున బరగ యేకాగ్రతయు
ఎంతెంతగా సాధకుడును సాదించునో
అంతంత ముందునకు అలరిబోయిన యటుల! ॥ఆలోచనా॥

అంతియేగాని మఱి యితర యనుభవములను
లెక్కింప రాదుగా గుర్తింప రాదచట!
మనసు నేకాగ్రతయు, ఆలోచనారహిత
స్థితియునూ యీ రెండు గుర్తుగా భావింపు! ॥ఆలోచనా॥

అల ధ్యాన మార్గమును నలరి యూహించుటకు
పైరెండు మార్గములు బరమ ప్రమాణములు!
అంతకును మించి యా యలరు ధ్యానంబునూ
యూహింపలేము గద! బాహ్య ప్రపంచమున!

ఆలోచనా రహితమైన మానస స్థితియు
ఒక తలపున మనసు నేకాగ్రతయునూ!

సర్వకాలము లందు

సర్వకాలములందు సర్వావస్థలను
స్థితప్రజ్ఞుడై యుండి చిత్తమున శాంతి!

అట్టి యోగికిని మఱి యానంద యనుభూతి
నిరవధిక శాంతితో నిత్యముగ నుండుసూ!

సర్వకాలములందు సర్వావస్థలకు
స్థిత ప్రజ్ఞుడై యుండి చిత్తమున శాంతి!

అట్టి స్థిత ప్రజ్ఞునకు నలరి యెల్లప్పుడును
దేహాత్మబుద్ధియును దీరుగా నుండదూ!
విశ్వాత్మ బుద్ధియే విలసిల్లు నాతనికి
దివ్యాత్మ బుద్ధియే ధీరుగా విలసిల్లు! ॥సర్వ॥

నిష్కామ బుద్ధితో నిఖిల కర్మలు జేయు
భగవ దర్పితమంచు భక్తితో ప్రణమిల్లు!
ఫలిత మాశింపడూ భంగపడ డెప్పుడును
ప్రభుచింతనమునందు భక్తి విలసిలుచుండు! ॥సర్వ॥

స్థిత ప్రజ్ఞునకు వోలె చింతనల జేయుసూ!
నిష్కామ యోగిగా నిరతముకు కర్మలను
ఫలితమాశింపడూ పరమేశు కర్పించు
భక్తితో నుండుసూ పరమశాంతిని గూడి!

సర్వకాలములందు సర్వావస్థలను
స్థితప్రజ్ఞుడై యుండి చిత్తమున శాంతి!

## ఎన్ని చోటుల యందు

ఎన్ని చోటుల యందు బన్నుగా దిరిగినను
మనసు నొకచోటనే మలచి యుండుట మేలు!

కాని శరీరమును గలచోటనే యుంచి
మనసు ద్రిప్పిన యేమి మాధుర్యమును గలుగు?

ఎన్నిచోటులయందు బన్నుగా దిరిగినను
మనసు నొక చోటనే మలచియుండుట మేలు!

పరమేశ్వరుని పూజ భక్తిజేయగ నెప్డు
మనసు లగ్నముజేసి మఱి యితరమును లేక!
చిత్తశుద్ధినిగూడి శివపూజ చేయవలె
అన్నిమఱచీ తాను వరిని ధ్యానింపవలె! ॥ఎన్ని॥

స్తోత్ర మంత్ర జపాది సూటిగా తపసులను
ఇతర చింతలులేక యీశు ధ్యానింపవలె!
ఏకాగ్రతతోని యిష్టదైవము దలప
అనురక్తి గలుగుగద యా దేవదేవునకు! ॥ఎన్ని॥

చిత్తమును పరుగెత్తు చినిచిన్ని విషయముల
రక్తితో నిలువదూ రమ్యమగు విషయమున!
అందుకే జేయవలె అభ్యాసమును రక్తి
నిశ్చలంబగు మనసు నిర్మలంబగు భక్తి!

ఎన్నిచోటులయందు బన్నుగా దిరిగినను
మనసు నొకచోటనే మలచియుండుట మేలు!

## మమత ప్రేమలు నరుడు

మమత ప్రేమలు నరుడు మదియందు నొదిలితే
చిత్తశుద్ధియుగలుగు చింతలను దొలగూ!

నేను నా వారనే నిష్ఠురంబగు నహము
విడిచితే జ్ఞానమును విలసిల్లు మదియందు!

మమత ప్రేమలు నరుడు మదియందు నొదిలితే
చిత్తశుద్ధియు గలుగు చింతలను దొలగూ!

మమతతో మానవుడు మదియందు భ్రమలతో
తాను, తన వారనే తత్పరతలో మెలగు!
తనవారు దప్పుజేసిన గూక వారినే
పక్షపాతముతోని బరగ రక్షణ సేయు
అట్టివారికి చిత్తశుద్ధి యెటు గలుగునూ?
కలుషితముతో గూడు కమ్మనీ చిత్తమును! ॥మమత॥

తాననే అహముతో దగ జేయు చెడుపనులు
తనకు నడ్డెనరునూ దగువారు లేరనుచు!
మద మత్సరములతో మానుగా వర్తించు
జ్ఞాన మన్నదిబోయి జడునిగా మారునూ! ॥మమత॥

కావునను మానవుడు గల మమత నొదులుకొని
చిత్తశుద్ధిని గలిగి శీలతను మెలగ లి!
తా ననే యహమునూ తగ నొదిలి యజ్ఞాని
జ్ఞానమును సాధింప జాగృతిని నొందవలె!

మమత ప్రేమలు నరుడు మదియందు నొదిలితే
చిత్తశుద్ధియు గలుగు చింతలను దొలగు!

## శాస్త్రంబులును మఱియు

శాస్త్రంబులును మఱియు శాస్త్ర వ్యాఖ్యానములు
జ్ఞానులకు యేల యవి జ్ఞాని తెలియునుగా!

అజ్ఞానులకు నేల యా శాస్త్ర గ్రంథములు?
చదువగా లేరుగా సారమును దెలియగా!

శాస్త్రంబులును మఱియు శాస్త్ర వ్యాఖ్యానములు
జ్ఞానులకు యేల యవి జ్ఞాని తెలియునుగా!

సర్వశాస్త్రములందు సారమును గ్రహియించి
జ్ఞానియైనాడు గద జగతిలో నాతడును!
దేహాత్మలకును గల దీరులను దెలిసికొని
ఆత్మ తత్త్వము దెలిసి అలరారు వాడుగద! ॥శాస్త్రంబు॥

అజ్ఞానికిని మఱియు నా శాస్త్రగ్రంథములు
చదువగా లేడుగా సారమును దెలియగా!
అందుకే యాశాస్త్ర గ్రంథములు బరికింప
శక్తి హీనులుగదా రక్తి యజ్ఞానులును! ॥శాస్త్రంబు॥

మహనీయ జ్ఞానులకు మఱియు నజ్ఞానులకు
శాస్త్రములు వలదనియు సరసముగా చెలిపిదీ!
అంతర్ముఖుండైన యాత్మ దర్శనుడైన
ఆ జ్ఞాని కెందులకు నా శాస్త్రగ్రంథములు?

చదువగా లేని యా సాహిత్య మూఢులకు
అజ్ఞాని యెటుచదువు నా శాస్త్రగ్రంథములు?
అందుకే యోగులును ఆ జ్ఞాని జ్ఞానులం
అనసరంబనిరి యా శాస్త్రగ్రంథములు!

## జ్ఞాని శుభ దృష్టితో

జ్ఞాని శుభదృష్టితో జ్ఞాని వాత్సల్యమున
పూర్వజన్మల వాసనలు భస్మమగునూ!

అజ్ఞాన మంతయును నంతరించును వేగ
సుజ్ఞాన కిరణములు సుమచిరంబుగ వెలుగు!

జ్ఞాని శుభదృష్టితో జ్ఞాని వాత్సల్యమున
పూర్వ జన్మల వాసనలు భస్మమగునూ!

జ్ఞాని హస్త స్పర్శ యందుకొని దీవెనల
పౌరాణికంబులును బరగ యితిహాసముల!
పారాయణము వలన ప్రగతి పథమునునందు
భగవంతు లీలలను భక్తితో గనుచుండు! ॥జ్ఞాని॥

అజ్ఞాని దృష్టితో సతని బోధన వలన
బలు సాధనల వలన బరగ బొందగలేని
ధ్యాన శిక్షణ నంది జగతిలో వెలలేని
ఆత్మ సాక్షాత్కార మందుకొను సద్భక్తి ॥జ్ఞాని॥

జ్ఞాని శుభదృష్టియే జాడ్యమును హరియించు
మౌని హస్తస్పర్శ మాధవుని దర్శించు!
ఆత్మసాక్షాత్కార మందుకొను సాధనను
తా జ్ఞానిగా మారు తరుగనీ యాసక్తి!

జ్ఞాని శుభదృష్టితో జ్ఞాని వాత్సల్యమున
పూర్వజన్మల వాసనలు భస్మమగునూ!

## సంపదల సౌఖ్యముల

సంపదల సౌఖ్యముల దగ ద్యజించుట మేలు!
అత్యుత్తమగు సుఖము నందు మానవుడూ!

గర్వ మహములు దొలగు కార్పణ్యమును దొలగు
తానెవరో దెలిసికొను తాత్సారమును దొలగి!

సంపదల సౌఖ్యముల దగ ద్యజించుట మేలు
అత్యుత్తమగు సుఖము నందు మానవుడూ!

ఆ పరమేశ్వరుని యా విశ్వరక్షకుని
స్మరియించుకొనుట కివి చక్కనీ దీపికలు!
సంఘ జీవనమందు దానొక్క జీవిగా
మసలుటకు వీలుగా మాధుర్యమును గూర్చు! ॥సంపదల॥

సంపదలు సౌఖ్యములు దగని దుశ్శీలతలు
దుఃఖ దారిద్ర్యములు దురితములు సమకూడు!
అందుకే సంపదల యలరి దూరమునుండి
చూచుచుండగవలెను చోద్యముగ వానినీ! ॥సంపదల॥

చంద్రకళలకు వోలె చెన్నుగా పెరుగునూ!
అమవసను నిశికి వలె యారిపోవును మలల
బుద్బుదంబగు సౌఖ్య భూరిసంపదలునూ
నీటి బుడగలవోలె నిఖిలమును నశియించు!

ముందుగనె యాస్థితియు పొందుగా రాకుండ
తరుగనీ సంపదల దగ త్యజించుట మేలు!
అందుకే మౌనులును అలసౌఖ్యమును నొదిలి
వృక్ష మూలములందు విడిది జేసిరి గదా!

## అణువణువు నిండినా

అణువణువు నిండినా యా విశ్వరక్షకుని
మదిని స్మరియించుచును మాధుర్య మొలికి!

కిన్నెరను మీటుచుచు కీర్తనలు బాడేటి
ధ్యానించు భక్తులది ధన్య మా జీవితము!

అణువణువు నిండినా యా విశ్వరక్షకుని
మదిని స్మరియించుచును మాధుర్య మొలికి!

తంబురను మీటుచూ దరగ నీ భక్తితో
ఆ జానకీ పతిని యార్తితో బాడుచును!
వీధివీధిని దిరిగి విమలమగు భక్తితో
జీవించు త్యాగయ్య భావింప హృదయమున
ధన్యమా జీవితము! ధరణిలో శాశ్వతము! ॥అణువణువు॥

రాణివాసము నొదిలి రమణీయ సంపదల
స్వీకరింపక దాను శ్రీకృష్ణ దాసియై!
కిన్నెరను మీటుచును కీర్తనల బాడినది!
భక్తమీరాబాయి ధన్య మా జీవితము! ॥అణువణువు॥

ఆ పరమాత్మనూ యపరంధాముని
సంతోషమున భక్తి స్మరియించును మదిని!
కీర్తించి భావించి నర్తించు భక్తులా
ధన్య మా జీవితము ధరణితో నిక్కువము!

అణువణువు నిండినా యా విశ్వరక్షకుని
మదిని స్మరియించుచు మాధుర్య మొలికి!

# మన సాంప్రదాయము

మన సాంప్రదాయముల మనదు నాచారముల
మఱచిపో కెన్నటికి మానసము జెదరా!

అనువరింపుము వాని నతి సుందరంబైన
అమృతభాండలెము వోలె నాదరింపుము వాని

మన సాంప్రదాయముల మనదు నాచారముల
మఱచి పో కెన్నటికి మానసము జెదరా!

నీ దేశ గౌరవము నీ యాత్మ గౌరవము
నిలిచియున్నవి సుమా! నీ సాంప్రదాయముల
మఱచి పో కెన్నటికి మదియందు స్థిరముగా
కేతనమువలె నిలిసి కీర్తింపు వానినీ! ॥మన॥

పతికి సతి, సతికి పతి బరగ భావింపుమా!
తల్లిదండ్రుల యాజ్ఞ దగురీతి బాలింపు!
అన్నదమ్ములయందు నతి ప్రేమ నొలుకుతూ
దేశభక్తివి గలిగి దీనులను గాపాడు! ॥మన॥

సమభావమును గలిగి సద్గుణంబులతోని
అందఱును నొక్కటను నాత్మీయతను గలిగి!
దారిద్ర్య రేఖలను దాటించి ప్రజలనూ
శాంతి కాంతీ క్రాంతి సాధనము లివి నీకు!

మన సాంప్రదాయముట మనదు నాచారముల
మఱచిపో కెన్నటికి మానసము జెదరా!

## భగవంతుని కరుణ

భగవంతుని కరుణ భగవంతు నను్రగహము
సకల జీవులయందు సరసముగ నుండునూ!

మన్ప్రేమ పెన్నిధిని మనసార వాంఛించి
మనను కౌగిలి జేర్ప మథన బడుచుండునూ!

భగవంతుని కరుణ భగవంతు నను్రగహము
సకల జీవులయందు సరసముగ నుండునూ!

అల గజేంద్రుండునూ యల యాత్రిలో మునిగి
వేడుకొనవెస వచ్చె వేగముగ గాపాడ!
శంఖు చక్రము మఱచె సతి వివాదము మఱచె
పరమేశ్వరుని కెంత భక్తులపై ప్రీతి? ॥భగవంతుని॥

గుప్పె డటుకులను దిని కూర్మి కుచేలునికి
సకల సంపద లిచ్చె సంప్రీతి విలసిల్ల!
ద్రౌపదికి వలువలను దగ నిచ్చి గాపాడె
శబరి ఎంగిలిపండ్లు సహజముగ దినెనుగద! ॥భగవంతుని॥

పశ్చేరము నిండనూ బరగ ఫలముల నుంచి
కావలసినావారు కరములను నెత్తమని!
అడుగుచున్నాడు గద! అతిప్రేమ విలసిల్ల
వాంఛించు వారలను వరుస బోవగవచ్చు!

భగవంతుని కరుణ భగవంతు నను్రగహము
సకల జీవులయందు సరసముగ నుంచునూ!

# పరమేశ్వరుని కరుణ

పరమేశ్వరుని కరుణ బన్నుగా నందఱికి
ఎల్లపుడు నుండునూ విడువకను వేసరక!

సమయ సందర్భముల కాలంబునకు గాని
పరిమితము కాదగద! బన్నుగ విచారింప!

పరమేశ్వరుని కరుణ బన్నుగా నందఱికి
ఎల్లపుడు నుండునూ విడువకను వేసరక!

స్రోతస్సు వలె జారు సోలుచును కొండలను
మంద మలదముగనూ మఱికొంత వేగముగ!
ప్రవహించి ప్రవహించి బరగ ఆర్ద్రితతోని
తన ప్రేమ కరుణలను బరగ భక్తుల బ్రోచు! ॥పరమే॥

సమయమును లేదు, మఱి సందర్భమును లేదు
ఎప్పుడు బడితే నపుడు నిల శాంతి మార్గమున
పరమేశు ధ్యానింప బన్నుగా దయజూపు!
పరువెత్తుకొనివచ్చు పరమ పావనమూర్తి! ॥పరమే॥

కంఠమెత్తి తనను కావు మని బిలువగా
'ఓ' యనుచూ బలుకునూ ఒనర యా మాధవుడు!
ఆరాటములతోని నలరి పరుగెత్తుచును
శరణన్న వానిపై చయ్యనా గాపాడు!

పరమేశ్వరుని కరుణ పన్నుగా నందఱికి
ఎల్లపుడు నుండునూ విడువకను వేసరక!

## దేహమున ప్రాణములు

దేహమున ప్రాణములు నున్నంత వఱకునూ
దేహి యొక్కడు గదా దేహమును మోయునది!

రోగములలో గాని భోగములలో గాని
ఆ దేహియొక్కడే అలరి మోయుచునుండు!

దేహమున ప్రాణములు నున్నంత వఱకునూ
దేహి యొక్కడు గదా! దేహమును మోయునది!

ఆట పాటలతోని యలరు సమయమునందు
సుఖ సౌఖ్యములతోని తూలుచుండెడి వేళ!
రోగాల నొప్పులను మూగియై నప్పుడును
ఆదేహి దేహమును నలరి మోయుచు నుండు! ॥దేహమున॥

జీవముతో నుండి జీవించు వఱకునూ
సకల కార్యములందు సారథిగ తా నుండు!
దేహమే రాజుగా దిశలు బరిపాలించు
తన వారి నందఱిని దగ శాసనముజేయు! ॥దేహమున॥

ప్రాణిపోయిన వెనుక బరగ యీ దేహమును
చలన రహితంబునై బలుకదొక పలుకునూ!
అట్టి దేహంబునూ యిట్టి రహనము జేయ
మోయుదురు సలుగురును మోహమును విడనాడి!

దేహమున ప్రాణములు నున్నంత వఱకునూ
దేహి ఒక్కడు గదా దేహమును మోయునది!

# అహము గల మానవుడు

ఆహముగల మానవుం డంతయును దానుగా
జేయుచున్నా ననుచు జిత్తమున భావించు!

భ్రమబడుచు నుండునూ బన్నుగా గర్వమున
కర్తగా భావించు గల కర్మ లన్నిటికి!

అహము గల మానవుడు నంతయును దానుగా
జేయుచున్నాననుచు జిత్తమున భావించు!

గోపురంబుల మూలమున నున్న రాళ్ళునూ
భారమంతయు గూడ బరువు నంతటినీ!
తమ భుజ స్కంధముల దగ గోపురమునంత
మోయు చున్నట్లుగా మొరటుగా దలచునటు! ॥అహ॥

రాజ్యమేలుచునున్న రాజేంద్రుడును గూడ
రాజ్యమంతయు గూడ రమ్యముగ తనతోని!
పాలింపబడుచున్నదని మదిని భావించు
మంత్రులను సేనలను మైమఱచి గర్వమున! ॥అహ॥

సర్వేశ్వరుండనే సామర్థ్య జేతనే
మోయబడుచున్నదను మోహమును గనలేక!
అహముచే సన్నిటిని యలరి తానే ననుచు
నడుపుదున్నా ననుచు నడి వీధి నర్తించు!

అహము గల మానవుడు నంతయును దానుగా
జేయుచున్నా ననుచు జిత్తమున భావించు!

## ఎవరికైనను గూడ

ఎవరికైనను గూడ యెంత వారలకైన
ఈ జన్మలో వారి వింత ప్రవర్తనయు!

వారి వారల యందు వర్తిలుచు నుండినా
ప్రారబ్ధమే గదా బరగ జరుగుచు నుండు!

ఎవరికైనను గూడ యెంత వారలకైన
ఈ జన్మలో వారి వింత ప్రవర్తనయు

గత జన్మలో తాను చేసినా దుష్కృతుల
అనుభవింపగ వలయు నలరి యీ జన్మమున!
చేసినా పుణ్యముల దుష్కృతుల గూడనూ
భోగింపగా వలయు బుధజనులు కీర్తింప! ॥ఎవరి॥

ఇల ధాత్రియందునను నిహ జన్మమందునను
పాప పుణ్యంబులను బరగ ప్రతి జీవియును
అనుభవింపగ వలయు నదియె ప్రారబ్ధమని
బుధజనులు బలికిరీ బుద్ధి ప్రకాశమున! ॥ఎవరి॥

అందుకే ప్రతిజీవి నలరి పుణ్యంబులను
సుకృతుల జేయవలె సూటిగా ధర్మ పథ!
వర్తులై పయనించి వరుసగా మోక్షమును
నందగా వలయువని యల బుధులు బలికిరీ!

ఎవరికైనను గూడ యెంత వారలకైన
యీ జన్మలో వారి వింత ప్రవర్తనయు!

# మనుజ జీవిత మందు

మనుజ జీవితమందు మానవుడు సిద్ధినీ
ఆత్మ సాక్షాత్కార మంద వలె నన్నా!

దైవ ప్రత్యక్షమును దగ నంద వలె నన్న
దైవ కృప ముఖ్యావసరము గద ధరణిలో!

మనుజ జీవిత మందు మానవుడు సిద్ధినీ
ఆత్మ సాక్షాత్కార మంద వలె నన్నా!

సాధు జీవితమును సాధింప వలె ముందు
సత్కర్మలందునను సమబుద్ధి వర్తింప!
పాప కర్మల యందు దగ దూరముగ నుండి
ధ్యానమభ్యాసముల దగ నిష్ఠ నుండవలె! ॥మనుజ॥

జప మంత్ర స్తోత్రముల జరియింపగా వలయు
ఏకాగ్ర బుద్ధితో నిల భక్తి ధ్యానింప!
అల పరంధామునీ అలరు కృప గలుగునూ
ఉన్నతంబగు బుద్ధి యొనర ప్రకాశించు! ॥మనుజ॥

ధ్యాన యోగముతోని భక్తి యోగముతోని
ఆ విశ్వరూపునీ యలరి ధ్యానము సేయ!
దేహాత్మ బుద్ధియును జెదిరి పోవును దిశలు
ఆత్మ ప్రకాశించు అల విశ్వరూపమున! ॥మనుజ॥

తానెవరో తెలిసికొను దగ విశ్వరూపిగా
నిర్వాణమును నందు నిఖిల మందున గలియు!
సమకూరు నిది యంత సర్వేశ్వరుని కృపను
మార్గదర్శియె గదా! మఱి యెప్పుడు భక్తులకు! ॥మనుజ॥

## నీ వెవరవో ముందు

నీ వెవరవో ముందు నికరముగ తెలుసుకో!
దేహాత్మవా? లేక విశ్వాత్మవా దెలుపు!

అప్పుడే యీ సృష్టి అర్ధమౌ సరళముగ
అరటి పండును నొలిచి యారగించిన యటుల!

నీ వెవరవో ముందు నికరముగ తెలుసుకో!
దేహాత్మవా? లేక విశ్వాత్మవా? దెలుపు!

ఆత్మ దేహములోని యలరు భాగమటంచు
దేహాత్మ బుద్ధితో దిశలు జూచుచు నీవు!
భ్రమియించు చుంటివీ బరగ దేహము నీదు
అస్థిరంబని తెలిసి యలరాడు చుంటివీ! ॥నీ వెవరవో

అది కాదు, ఇది కాదు, ఆత్మ స్థితి కనుగొనుము
ఆద్యంతములు లేక యలరు శాశ్వత స్థితియు!
అపరిమితమైన యీ యల విశ్వవ్యాప్త స్థితి
ఆకార వికార అల పదార్ధములకును!
శక్తులకు ఆధారభూతమగు స్థితి యిదీ
యిదియె ఆత్మ స్థితీ! ఇదియె సహజ స్థితీ!
అట్టి ఆత్మయె నీలో యలరారుచున్నదీ
అణువణువునను జగతి అశక్తియున్నదీ! ॥నీ వెవరవో।

కావునను తెలుసుకో! కఠినమగు నీ ప్రశ్న
దేహాత్మ ననుచునూ దిశలు జూడవిరాదు!
విశ్వాత్మగా నీవు విలసిల్లు జీసివీ!
ఆ ఆత్మ నీ హృదిని యలరాడుచున్నదీ
ఆత్మయే భగవానుడని మదిని తెలుసుకో! ॥నీ వెవరవో॥

## అల సముద్రమునకును

అల సముద్రమునకును అల తన తరంగములును
ఎన్నున్నవో వాని యెఱుక యుండదుగా!

అటులనే యాత్మకును అల అహము గూర్చియును
ఎఱుక యుండదు గదా! యెంత యత్నించినను

అల సముద్రమునకును అల తన తరంగములు
ఎన్నున్నవో వాని యెఱుక యుండదుగా!

చింతచెట్టున నున్న చిగురు లెన్నున్నవో
తెలుప జాలదు చెట్టు దీరుగా లెక్కించి!
మల్లె దీవెయు గూడ మధురముగ లెక్కించి
పూవులెన్నున్ననో పులకరింపదు గదా! ॥అల॥

ఆకాశమున నున్న అల తారలెన్నియో
తెలుప జాలదు గదా దీరుగా గగనమును
సెలయేటి జాలులో చిఱుచేప లెన్నియో
తెలుపజాలదు గదా తేటగా సెలయేఱు! ॥అల॥

అటులనే యాత్మయును నలరి తన యహమునూ
వివరించి తెలుపదూ! వ్యాప్తమౌ తనజాడ!
పరమాత్మ రూపమున బరగ నా ఆత్మకును
అహముతో పనియేమి? ఆదరింపగనేల?

అల సముద్రమునకును అల తన తరంగములను
ఎన్నున్నవో వాని యెఱుక యుండదుగా!

## ఇదియె ఆత్మస్థితీ!

ఇదియె ఆత్మస్థితీ! ఇదియె సహజస్థితీ!
దీని సాధింపగా దివ్య మును లెందరో!

ఎడతెగని తపసులను గడు యోగ యాగముల
ఆచరించిరిగదా! ఆనంద యోగమును!

ఇదియె ఆత్మస్థితీ! ఇదియె సహజస్థితీ!
దీని సాధింపగా దివ్య ముని లెందరో!

ఆద్యంతములు లేని అలరు శాశ్వత స్థితియు
అపరిమిత మైనట్టి యల విశ్వవ్యాప్తస్థితి!
అఖిలమైనట్టి యా యాకారములకునూ!
వివిధమైనట్టి యల వికారాది శక్తులకు
సర్వ పదార్థమగు సహజమగు వాక్కునను
ఆధారభూతమగు నలరు నాత్మ స్థితియె! ॥ఇదియె॥

ఆత్మ యన క్రొత్తగా నలరి సంపాదించి
కొనితెచ్చునదికాదు కొంగు బంగారమిది!
నిఖిల జన్మలయందు నిత్యముగ నున్నదీ!
కర్మబంధములందు కలిసియున్నది యాత్మ! ॥ఇదియె॥

ఆత్మ సాక్షాత్కారమును నందినా సుకృతి
మఱు జన్మ యుండదూ! మాధుర్యమును జెందు!
అట్టి విశ్వాత్మలో నా దివ్య జ్యోతిలో
దివ్య కిరణము వోలె దీప్తిజెందును నతడు!

# ఆత్మ సాక్షాత్కార

ఆత్మ సాక్షాత్కార మర్త్యులకు సిద్ధించు
అర్హతయు నేమనగ యలరుచును తనదూ!

సర్వ సంగమములను సకల బంధములనూ
త్యజియించి పరమేశు బరగ ధ్యావించుటయె!

ఆత్మ సాక్షాత్కార మర్త్యులకు సిద్ధించు
అర్హతయు నేమనగ యలరుచును తనదూ!

తన భాగ్య భోగముల తన సంపదల నన్ని
త్యజియించి సన్యాసిగా సకలమును వదిలి!
కాననంబుల కేగి కటిక నేల బరుండి
వృక్ష మూలములందు విమలముగ గడుపవలె!

సర్వమును త్యజియించి తన గురువు బోధించు
అట్టి బోధలయందు నాత్మ నుద్దేశించి
ఆత్మసాక్షాత్కారమును నందవలె యోగిగా
సర్వ జీవులయందు తనను జూడగవలయు!

సర్వజీవులయందు సహజమగు ప్రేమతో
వర్తిల్లవలె వాని వనర పరమేశుగా!
భావించు వారలే బరగ యీ జగమందు
ఆత్మ సాక్షాత్కార మంది యీ లోకమున
ముక్తులై బంధముల మౌనివలె భాసించు!

ఆత్మ సాక్షాత్కార మర్త్యులకు సిద్ధించు
అర్హతయు యేమనగ యలరుచును తనదూ!

## పసిపాపలే గదా!

పసిపాపలే గదా! బ్రహ్మ స్వరూపులును
అహము దూరమునున్న ఆత్మ స్వరూపులూ!

ఆడుచును పాడుచును ఆనందగీతిగా
పాడుచుందురు గదా! బ్రహ్మగీతమునూ!

పసిపాపలే గదా! బ్రహ్మస్వరూపులును
అహము దూరము నున్న ఆత్మ స్వరూపులూ!

మౌనులును నటులనే యాఅహము త్యజియించి
కుబుసమును విడిచినా కూర్మి సర్పమువోలె!
ఆనంద సంద్రమున యందరుచుందురు యెపుడు
జగదీశు ధ్యానమున చరియించు చుందురూ! ॥పసి॥

పసిపాపలందునను బన్నుగా అహమునూ!
పూర్తిగా తలయెత్తి పులకరింపదు గదా!
జ్ఞానిలో నా యహము కానగా రాదుగా
నశియించి యుండునూ నడిరేయి నిదురగా! ॥పసి॥

తల్లి ఒడిలో పాప తన పాలు త్రాగుతూ
ఆనందమును నిండి యలరు చున్నట్లుగా
పరమాత్మ యొడియందు పరమయోగియు గూడ
మెసలు చున్నట్లుగా మేల్మి భావింపవలె!

పసిపాపలే గదా! బ్రహ్మ స్వరూపులును
అహము దూరము నున్న ఆత్మ స్వరూపులూ!

## జ్ఞానియగు వానినీ

జ్ఞాని యగువానినీ జ్ఞానియే గుర్తించు
అజ్ఞాని యగువాడు నలరి తెలియడుగా!

మౌనియగు వానినీ మౌనియే గుర్తించు
మూగివాడెటు దెలియు మోక్షమార్గమునూ!

జ్ఞాని యగువానినీ జ్ఞానియే గుర్తించు
అజ్ఞాని యగువాడు నలరి తెలియదుగా!

వాసంత ఋతువునను వనర కోకిలగూడ
బాడుకొనుచుండునూ బరగ మావిని జేరి!
తుమ్మెదయు బాడుకొను తూలుడూ పాటలను
మందార పొదలందు మధుర స్నేహముతో! ॥జ్ఞాని॥

సజ్జనులు సజ్జనులు దగ కూర్మితో నుండి
దుర్జనుల కూటమికి దూరముగ నుందురూ!
మంచి వారెవ్వరో నంచితము జేరుదురు
చెడ్డవారందఱును జేరుదురు నొకచోట! ॥జ్ఞాని॥

ఆచరణ మార్గమును నలరు వాక్కునుజూచి
జ్ఞానియగు వానినీ జ్ఞానియే గుర్తించు!
పాలు పాలొకటగును బరగ నీరునుగూడ
నొకటగును నేకమై వనర జ్ఞానులు గూడ!

జ్ఞానియగువానినీ జ్ఞానియె గుర్తించు
అజ్ఞానియగువాడు నలరి తెలియడుగా!

## అంతర్ముఖుండైన

అంతర్ముఖుండైన యలరు నా జీవికిని
శాస్త్రగ్రంథము లేల? చర్చలవి యేలా?

భగవంతు దర్శనము బరగ బొందినవాడు
విపులమగు గ్రంథముల విమల పఠనము లేల?

అంతర్ముఖుండైన యలరు నా జీవికిని
శాస్త్రగ్రంథము లేల? చర్చలవి యేలా?

అంతర్ముఖుండైన అట్టి ప్రహ్లాదుడును
వేదాంత గ్రంథములు విమలముగ బఠియించె?
గురువు జెప్పినదియునూ గురుతుగా జదువడూ!
ఎటులొచ్చె యా చదువు పటుశాస్త్ర సారమును! ॥అంత॥

అయిదేండ్ల బాలుడగు యాధ్రువున కెటులొచ్చె
మౌనులకు లేని యా మహనీయ తత్త్వమును?
గురువుకూడను లేని కూర్మి యా ధ్రువునకును
ఎటులొచ్చె యా చదువు నిందిరారమణునీ! ॥అంత॥

భక్తిశ్రద్ధలు నున్న బరగ విశ్వాత్ముదే
ఆశీస్సులవి యున్న అది. చాలు జీవికి
అంతర్ముఖుండగుచు నాదేవు స్మరియింప
సకలసిద్ధులు గలుగు పద్యమును సిద్ధించు!

అంతర్ముఖుండైన యలరు నా జీవికిని
శాస్త్రగ్రంథము లేల? చర్చలవి యేలా?

## పుట్టినందుల కిలను

పుట్టినందుల కిలను బురుషార్థ మెద్దియో
తెలిసికొనగోరుచే తేటగా గత జన్మ!

పుణ్యఫల మది సుమా! పుడమి వసియించుచును
అది తెలిసికొనుటయే అలరు కర్తవ్యమూ!

పుట్టినందుల కిలను బురుషార్థ మెద్దియో
తెలిసికొన గోరుచే తేటగా గత జన్మ!

ఎన్ని జన్మలయందు నెన్ని గాథలు నడిచె
పాపపుణ్యంబులనూ బరగ జేయును జీవి!
కష్టసుఖములు నిలను గడులెస్స బొందుచును
యోచింపడాయె గద! యోగదృష్టిని బఱపి! ॥పుట్టి॥

కొన్నాళ్ళు సుఖములును, కొన్నాళ్ళు కష్టములు
చావుపుట్టుకలలో తల్లడిల్లుచు జీవి!
పురుషార్థ మెద్దియో పూర్తిగా తెలిసికొని
యాచరింపును గదా! యలరి యా మార్గమును? ॥పుట్టి॥

గుడ్డెద్దు చేనిలో కూర్చి మేసిన యట్లు!
పోవుచున్నాడు గద! పులకరింపుచు జగతి!
తానెవరో దలవడూ! తగ నాత్మ దలపడూ!
కర్మఫలముల గూర్చి మర్మముల దెలియుడూ! ॥పుట్టి॥

ఎన్ని జన్మలు నిటుల బన్నుగా బోవుటయు
ఎన్ని మరణము లిలను దెన్నుగా జరుగుటయు
పరమార్థ మెఱుగుచే బరగ జీవాత్మలకు!
పుణ్యఫలమును దెల్పియు పురుషార్థమును దెలియు
అతడు సుకృతి సుమా! అటుగాక వ్యర్థుడూ! ॥పుట్టి॥

## అనుభవము లన్నిటికి

అనుభవము లన్నిటికి యాత్మమే సాక్షి గద!
ప్రాపుగా నుండు తుది ప్రాదిపదికగనూ!

గత కథల నన్నిటిని కనుల యెదుటను నిలుపు
పాప పుణ్యంబులను బరగ దెలుపుచునుండు!

అనుభవము లన్నిటికి యాత్మయే సాక్షి గద!
ప్రాపుగా నుండునది ప్రాతిపదికగనూ!

దేహి జేసిన పనులు దీరుగా స్మృతి దెచ్చు
జేసినా మలినములు జెన్నుగా వినిపించు!
తాను వలదన్ననూ దగ జేసినా పనులు
అనుభవమునకు దెచ్చు అంతరంగంబునకు ॥అనుభవము॥

దుష్క్రియల నన్నిటిని వోరముగ జూపించు
పాప క్రియ లన్నిటిని బరగ విశదము జేయు!
మంచి పనులను గూడ మర్యాదగా దెలిపి
ఆనంద భాష్పముల నటు రాల్పు చుండునూ! ॥అనుభవము॥

పాప పుణ్యంబులకు బరగ సాక్షియె తాను
ప్రారబ్ధ కర్మలకు బరగ మధ్యస్థమును!
వ్యథ జెందుటయులేదు వేదనను జెందదూ!
దేహి పొందెడి పాట్లు దీరుగా గనుచుండు!

అనుభవము లన్నిటికి ఆత్మయే సాక్షిగద!
ప్రాపుగా నుండునది ప్రాతిపదికగనూ!

బంధ మోహంబులును బరగ మమతలు లేని
ఆతడే గద యోగి? ఆతడే జ్ఞానీ!

బంధముల విడివడుట బరగ జ్ఞానం బనుచు
జన కాది మౌనులును జాగృతిని దెలిపిరీ!

బంధ మోహంబులును బరగ మమతలు లేని
ఆతడే గద యోగి! ఆతడే జ్ఞానీ!

సర్వకాలము నందు సద్గురుని కృపచేత
మఱపునకు రానట్టి మఱి జ్ఞానమే గదా!
అట్టి జ్ఞానము గదా! అఖిలమును నిత్యమును
శాశ్వతంబది సుమా సర్వస్వమును గూడ! ॥బంధ॥

రాజ్య భోగంబులును రమ్య సంపదలునూ,
బంధుమిత్రుల సకల బాంధవ్య మంతయును!
సుఖ సౌఖ్యముల నన్ని త్రోసివేయును జ్ఞాని
ఇందిరా రమణునీ మందిరంబును జేరు! ॥బంధ॥

ధ్యాన మార్గంబునను దగ దాను జనుచునూ
ఆత్మ సాక్షాత్కార మందుటకు యత్నించు!
ఆలుబిడ్డల నొదిలి యడవులకు బయనమై
వృక్షమూలములందు విమలముగ వసియించు!

బంధ మోహంబులును బరగ మమతలు లేని
ఆతడే గద యోగి! ఆతడే జ్ఞానీ!

## జ్ఞానోదయంబైన

జ్ఞానోదయంబైన జ్ఞానికిని తదుపరిని
తన శరీరముపైని తగ లక్ష్య ముండదూ!

పాము కుబుసము విడిచినట్లుగా దేహమును
విడిచివేయగ జూచు విమల భావముతోని!

జ్ఞానోదయంబైన జ్ఞానికిని తదుపరిని
తన శరీరము పైని తగ లక్ష్యముండదూ!

భోజనానంతరము భోజ్యమగు విస్తరిని
పారవేయుదుము గద! బరగ వీధుల యందు!
అటులనే జ్ఞానియును అలరి తన దేహమును
వదిలివేయుటకు దా వనర యత్నము సేయు! ॥జ్ఞానో॥

సౌభాగ్య సంపదల సకల ఋతువుల గడిపి
అలరి శిశిరము రాగ యా ప్రబల వృక్షములు!
ఆకులన్నియు రాల్ప యత్నించి నట్లుగా
తన దేహమును దేహి తగ రాల్ప యత్నించు! ॥జ్ఞానో॥

రాజ భోగమలంది రమణీయ సుఖములను
అనుభవించియు గూడ నటుపై విరక్తితో!
తన శరీరము నొదల దగ కానలకు జేరి
వృక్షమూలములందు వర్తించుచుండు గద!

భాస్కరోదయమైన బంగారు కిరణములు
వెలుగులను తానొంది విడువాడు జీకటుల!
యత్నించు దినమువలె విమల జ్ఞానము నంది
జ్ఞాని తన దేహమును దగ విడువ యత్నించు!

## ఒక్కటే సత్యమూ!

ఒక్కటే సత్యమూ! ఒక్కటే నిత్యమూ!
అది యాత్మ! అది యాత్మ! అది ఆత్మయే సుమా!
అన్నియు నసత్యములు! అలరి పరిశీలింప
ఒక్కటే నిత్యమూ! ఓంకార నాదమూ!
ఒక్కటే సత్యమూ! ఒక్కటే నిత్యమూ!
అది యాత్మ! అది యాత్మ! అది యాత్మయే సుమా!

ఆత్మయన క్రొత్తిగా నంరి సంపాదించి
తెవి తెచ్చునది కాదు, కొంగు బంగార మిది!
నిత్యముగ నున్నదే నిఖిల జన్మలయందు
కర్మబంధములందు గలిసి యున్నది యాత్మ! ॥ఒక్కటే॥

సర్వ జీవులయందు సహజమగు ప్రేమతో
పర్తిల్ల వలె వాని వనర పరమేశుగా!
భావించు జీవులే బరగ యీ జగమందు
ఆత్మ సాక్షాత్కార మంది యీ లోకమున
ముక్తులై బంధముల మునులవలె భాసించు! ॥ఒక్కటే॥

శుద్ధ చైతన్యమే నూటిగా యాత్మయని
సకలజీవుల యందు సహజముగ యున్నదని
శాశ్వతము స్థిరము అని సకలమందున గూడి
నిండి యున్నది యనుచు బండితులు బలికిరీ!

ఒక్కటే సత్యమూ! ఒక్కటే నిత్యమూ!
అది యాత్మ! అది యాత్మ! అది ఆత్మయే సుమా!

# నే ననగ యెవ్వరో!

నే ననగ యెవ్వరో నిండు ప్రాణము గాదు!
నేను నీవును గాదు నిఖిలమును గాదు మఱి!
సకల జీవులయందు సర్వత్ర వ్యాపించి
అణువణువు నున్నదే! యలరు నా పరమాత్మ!

నే ననగ యెవ్వరో నిండు ప్రాణము గాదు!
నేను నీవును గాదు నిఖిలమును గాదు మఱి!

విశ్వమంతటి యందు విమలమగు నీ యందు
ఒక్కటే వస్తుంది నిక్క మగు ఆత్మ యది!
అంతరంగమునందు నహమునూ త్యజియింప
పరికిలప గోచరించెడి దాత్మయే సుమా! ॥నేననగ॥

ఇందుగల డంచునూ అందు లేడంచునూ
సందేహ భావమున దగజూడ వలదనుచు!
ప్రహ్లాదుడా డా నాడు బరగ దెలిపిన బలుకు
ఆత్మకును వర్తించు నలరి బరికింపగా! ॥నేననగ॥

సుఖమున్నై సుద్ధము సుప్రకాశంబున్నై
నిత్యమై వ్యాప్తమె నిర్ణయింపగ రాని!
ఆధారమై యఖిల నామ రూపంబులకు
అట్టి పరమాత్మయే అలరి నే ననుచునూ!

ఆద్యంతములు లేవి యల నిరంతర మైన
శాశ్వతానంద మని స్థిర రూపమని దెలియు!
ఆ మహా జ్యోతికిని అలరి దా కిరణమవి
భావింపు మదియందు భవ్యాత్మ బుద్ధితో!

## నేను అనునదిలేని

నేను అనునదిలేని నిఖిలమైనట్టిదియు
ఆల యహంకారమును యణగిపోయిన యట్టి

స్వానుభవ నిష్ఠయే సకలమగు సాధనము
అదియె తపస్సనీ యందు రా బుధవరులు!

నేను యనునదిలేని నిఖిలమైనట్టిదియు
ఆల యహంకారమును నణగిపోయిన యట్టి!

ఇవియె శ్రీరమణునీ యింపైన సూక్తులివి
ఆత్మ స్వరూపమును నలరుచును దెలిపినవి!
నూట యెనిమిదియునూ మేటిసూక్తుల నిచట
పాటగా బాడితిని బన్నుగా ఖండగతి! ॥నేను॥

అరుణాచలేశ్వరుని అట్టి సూక్తులు బరగ
మద్దాళివారు మఱి మధురముగ తెనిగించి!
తెలుగు ప్రజలందఱికి తేటగా దెలిపిరీ!
వేదాంతసారమును విమలమగు భావమును! ॥నేను॥

అట్టి సూక్తులను నే నలరుచును ఖండగతి
లలితగీతములుగా లావణ్య మొప్పగా!
తాత్పర్యమంతయును తగ లలిత గీతముల
సుకుమార శైలిలో చోద్యముగ బాడితిని!

## ఆఖిల విశ్వమునందు

అఖిల విశ్వమునందు అఖిల జీవులయందు
అలరారు చుండేటి ఆత్మ వందనమూ!

మహనీయులగు ఋషులు మౌనులందఱు నిన్ను
ఆత్మజ్యోతివియనుచు అర్చించుచుండెదరు!

అఖిల విశ్వమునందు అఖిల జీవులయందు
అలరారు చుండేటి ఆత్మ వందనమూ!

పరమేశుడే నీవు! నీవు పరమేశుడవు!
నీ లోపలన గలడు నిఖిల మంతయు గూడ!
నేను జేరుటయెగదా నిఖిలజీవులకునూ
గమ్యమును లక్ష్యమును కలిసిపోవగ నేను! ॥అఖిల॥

సుఖ దుఃఖములు లేని సుందరంబగు త్రోవ
మఱుజన్మ లేకుండ మహనీయజ్యోతిలో
కలిసి పోనగ జేసి కారుణ్యమూర్తివై
హృదయమున జేర్చుకొను సదయ శుభమూర్తీ! ॥అఖిల॥

మధియించితిని స్వామి మధురమగు హృదయమును
ఆత్మ చింతనతోని అలరితిని శ్రీకృష్ణ!
ఏదారిబోదునో ఎటనారిగి పోదునో
నాతోని నుండుమా నను దయను జూడుమా!

అఖిల విశ్వము నందు! అఖిల జీవులయందు
అలరారు చుండేటి ఆత్మ వందనమూ!

—★—

# రచయిత పరిచయం

జననం : విజయవాడలో బ్రాహ్మణవీధి.

స్వగ్రామం : నల్లగొండ జిల్లాలో చెరుకుపల్లి (నక్రేకల్) గ్రామం.

బాల్యం : ప్రాథమిక విద్యకుగూడ నోచుకోని దుర్భర జీవితం 12 సం॥ల ప్రాయంలోనే శ్రామిక జీవితం.

జీవనయాత్ర : స్వగ్రామం జేరుకొని పితృతుల్యునికి శుశ్రూష, ఉన్న కొద్ది పొలంలోనే వ్యవసాయం.

ఉస్మానియా తెలుగు పరీక్షలు స్వయముగా అధ్యయనం. ఉన్న కాస్త పొలం గ్రామ నాయకులచే అపహరణ.

జిల్లా ఉన్నత పాఠశాలలో తెలుగు పండితునిగా ఉపాధ్యాయ జీవితం.

ఉపాధ్యాయ వృత్తితోబాటు రచనా వ్యాసంగం. కీ॥శే॥ శ్రీ దేవులపల్లివారిని ఆదర్శంగా లలితగీతాలు, ఇతర సాహితీ గ్రంథాలు దాదాపు నలుబదిపైన రచించి ప్రచురించడం.

జిల్లా విద్యాధికారులచే ఉత్తమ ఉపాధ్యాయునిగా సన్మానింపబడుట.

ఉద్యోగ విరమణ :

2400 పేజీలుగల 'శ్రీరామకథా సుధాలహరి' గీతికారూపమైన రామాయణాన్ని ఎనిమిది సంపుటాలుగా ప్రచురించుట.

చివరి కోరికలు : స్పృహ ఉన్నంతకాలం సాహితీరచన చేయాలనీ, తాను పనిచేసిన పాఠశాలలకు బీద విద్యార్థులపేర యిచ్చిన విరాళాలు మరణానంతరం సద్వినియోగం కావాలనీ.

అంతిమ సమయంలో : కొండల్లో, కోనల్లో, సెలయేటి నిస్వనాలలో ప్రకృతిమాత ఒడిలో కన్నుమూయాలనీ.

# రచయిత నూతన గ్రంథములు

డైరెక్టర్ ఆఫ్ హైద్రాబాదు వారిచే ది 25-10-99న జారీచేయబడిన
సైటేషన్ నెంబర్ల జాబితాలోని

## మా స్వంత పుస్తకములు :

| | | |
|---|---|---|
| 1. మంచుముత్యాలు | 771/సాతె 700/13754 | రు. 12-00 |
| 2. శ్రీ భగవద్గీత | 276/సాతె 200/101 | రు. 18-00 |
| 3. శ్రుతిలయలు | 1272/సాతె 800/455 | రు. 12-00 |

## 1999 - 2000లో నూతన ప్రచురణలు :

| | | |
|---|---|---|
| 1. కలబోసిన ముత్యాలు (1000 ఆటవెలది గీతపద్యాలు) | | రు. 20-00 |
| 2. ఆనంద యాత్ర (లలిత గీతాలు) | | రు. 20-00 |
| 3. విరహగీతం | " | రు. 20-00 |
| 4. ఆనంద గ్రంథి | " | రు. 20-00 |
| 5. ప్రభాత గీతాలు (హరిపూజ) (తిరుప్పావై గీతములకు స్వేచ్ఛానువాదము) | | రు. 20-00 |
| 6. హంసధ్వని (లలిత గీతాలు) | | రు. 20-00 |
| 7. శ్రీరామకథా సుధాలహరి బాలకాండము | 970/సాతె 800/158 | రు. 25-00 |
| 8. శ్రీరామకథా సుధాలహరి (చతురస్ర గీతికలు) అయోధ్యాకాండము (మొదటి భాగము 240 పే.) | | రు. 30-00 |
| 9. అయోధ్యాకాండము (రెండవ భాగము 260 పే.) | | రు. 30-00 |
| 10. అరణ్యకాండము (320 పే.) | " | రు. 40-00 |
| 11. కిష్కింధాకాండము | | రు. 50-00 |
| 12. సుందరాకాండము | | రు. 15-00 |
| 13. యుద్ధకాండము (మొదటి భాగము) | | రు. 50-00 |
| 14. యుద్ధకాండము (రెండవ భాగము) | | రు. 50-00 |
| 15. అంతర్మథనం-ఆత్మ చింతన | | రు. 80-00 |